**జవాబు :**

అత్యంత నిర్మలత్వము, స్వచ్ఛత్వము, సూక్ష్మత్వము ఆత్మ బుద్ధులకు యుక్తి సంగతంమగుట వలన, ఈ బుద్ధి ఆత్మ సమమైన నిర్మలత్వము పొందుట వలనను, ఆత్మ చైతన్యాకార భాసత్వము మనసులో కలుగును. ఈ జ్ఞానమునకు "బాహ్యాకార భేద బుద్ధి నివృత్తిరేవ ఆత్మ స్వరూపాలంబన కారణమ్". "జ్ఞానేయత్నో న కర్తవ్యః కింతు అనాత్మ బుద్ధి నివృత్తావేవ" తస్మాద్ జ్ఞాననిష్ఠా సుసంపాద్యా" ప్రయత్నము చేయనవసరము లేదు కాని అనాత్మ బుద్ధిని నివారించవలయును. అందులకే జ్ఞాన నిష్ఠ సుసంపాద్యము. "అనాది రనన్తో నైసర్గికో ధ్యాసో మిథ్యా ప్రత్యయరూపః కర్తృత్వ, భోక్తత్వ ప్రవర్తకః సర్వలోక ప్రత్యక్షః అస్య అనర్థ హేతోః ప్రహాణాయ ఆత్మైకత్వ విద్యాప్రతిపత్తయే సర్వే వేదాన్తాః ఆరభ్యన్తే "బ్ర.సూత్ర.అధ్యాస భాష్యం.

ప్రవాహరూపములో అనాదిగా వచ్చు ఈ అధ్యాసము స్వాభావికము. ఈ అధ్యాసము తత్వజ్ఞానము వల్లనే నశించును. దేని స్వరూపము మాయవల్ల కనుపించుచున్నదో అదే ఈ కార్యప్రపంచము దానినే మిథ్య అందురు. అదే ఈ కర్తృత్వ, భోక్తృత్వములకు ప్రవర్తకము. గాఢనిద్రలో ప్రతివారు ఆత్మానుభవమును అనుభవించుచున్నారు గాని ప్రపంచ భావము లేదు. అందుకని మాండూక్యకారికలో "జాగ్రతవస్థా మిథ్యా దృశ్యత్వాత్ స్వప్నవత్" అను తర్కమును చెప్పిరి. ఇది సర్వలోక ప్రత్యక్షము. ఈ కర్తృత్వాది అధ్యాసమే అనర్థకారణము. ఈ అనర్థకారణమును నివారించుటకు, ఆత్మైక్య జ్ఞానమును పొందుటకు, వేదాంతమును ఉపనిషత్ వాక్యముల శ్రవణ, మనన, నిధి ధ్యాసములు చేయుటకు, ఈ బ్రహ్మ సూత్రములు ఆరంభించిరి. శ్రవణముతో కూడిన విచారము ఐక్య బోధకు తోడ్పడును.

నిజముగా చెప్పవలయుననిన ప్రతి ఒక్కరు ప్రతిరోజు బ్రహ్మలో ప్రవేశించుచున్నారు. అందుకనే శృతిలో "అహరహః బ్రహ్మ గమయతి" అనిరి. గాఢ నిద్రలో ఆత్మానందమును అనుభవించి నిద్రలేవగానే పూర్వవాసనల అనుసారము ప్రాపంచిక వ్యావహారములో చిక్కుకొనుచున్నారు. దీనికి మూడు ఉదాహరణములు చెప్పవచ్చును. మొదటిది ఉన్నది ఒక్కటే బ్రహ్మరూపమైన ఆత్మ అని చెప్పుటకు. సాధారణంగా త్రోవలో మనము గుంటలు చూసెదము. దాని యందు వ్యాపకమైన ఆకాశము గలదు. వర్షము నీరు వానిలో చేరును. ఆ నీటిలో మరల ఆకాశము ప్రతిబింబించును. అట్లే ఒకే ఆత్మలో కర్మల వల్ల మనస్సు ఏర్పడుచున్నది. ఏర్పడిన మనస్సులో మరల ఆ ఆత్మే ప్రతిబింబించుచున్నది. ఇచ్చట శాస్త్ర దృష్టిలో చూచిన గాఢ నిద్రయందు మూడు వస్తువులను ఒప్పుకొనవలయును. మొదటిది అధిష్ఠాన రూపములో నున్న ఆత్మ చైతన్యము. రెండవది ప్రాతిభాసిక చైతన్యము అనగా ప్రతిబింబించిన చైతన్యము. మూడవది అజ్ఞాన వృత్తి. నిద్రలో ఉపనిషత్తులో చెప్పినట్లు "సత్తా సోమ్య తదా సంపన్నో భవతి" సదాత్మతో ఒక్కటైనను జాగ్రత్తలో అనుభవమునకు వచ్చుటలేదు. దానికి ఉదాహరణ దీపము. దీపము వెలిగించి దాని మీద చిమ్ని ఉంచి దీపము దగ్గర కూర్చొనిన దీపము యొక్క వెలుతురు, వేడి అనుభవములోకి వచ్చును, గాని దీపశిఖను ముట్టుకొనలేము. అట్లే చిమ్ని స్థానములోనున్న అజ్ఞానవృత్తి బ్రహ్మ నుండి జీవచైతన్యమును వేరుచేయుచున్నది.

**మరొక ఉదాహరణ :**

పెద్దపాత్రలో చల్లని నీరు తీసుకుని దానిలో వేడి నీరు పోసిన సీసా దారముతో కట్టి వదిలిన సీసాలో ఉన్న

నీరు చల్లబడునే గాని, సీసాలోని నీరు పాత్రలోకి కాని, పాత్రలో నీరు సీసాలోకి రావు. దారముతో సీసాను వేరు చేయవచ్చును. ఈ దారమే ఇచ్ఛా, కోరికలు, తృష్ణాలాంటిది. దీనినే కామమందురు. నిద్రలో శరీర, ఇంద్రియ, మనస్సులు పని చేయకపోయినను, సుఖానుభవము ఆత్మ ద్వారా కలుగుచున్నది. కాని జాగ్రత్తలో ఆత్మానుభవము కుంటుబడి, శరీర, ఇంద్రియమనస్సుల అనుభవమే సుఖ దుఃఖ రూపముగా పొందుచున్నాడు. అందుకనే ప్రతివారు పరమాత్మను చూడలేదని చెప్పుదురు. అది సరికాదు. ఆత్మ రూపములో నున్న పరమాత్మను ప్రతిరోజు అనుభవించుచున్నారు. ఇంకా స్పష్టముగా అంధకారములో నిదురించిన వ్యక్తి స్వప్నములో ప్రకాశము చూచుచున్నాడు. అది ఆత్మ ప్రకాశమే వేరుకాదు. మనస్సును ఏకాగ్రము చేసుకుని వేదాంత వాక్యముల ద్వారా బ్రహ్మ విచారము చేయుటయే జ్ఞాన మార్గము. ఈ జ్ఞానమునకు అంతరంగ సాధనములు, శమదమాదులు మరియు శ్రవణ, మనన, నిధి ధ్యానములు.

సంస్కృత భాష రాని వారికి, మరియు శాస్త్రాంగములైన వ్యాకరణ న్యాయా(తర్కము)దులలో ప్రవేశము లేని వారికి విద్యారణ్యగురువులైన భారత తీర్థస్వాముల వారు తేలిక భాషలో వైయాసిక న్యాయామాల రచించిరి. దానిని గూడ చదివి అవగాహన చేసుకొనలేని వారికి తెలుగు అనువాదమును ప్రారంభించితిని. దానితో బాటు సూత్రార్థములు మరియు అధికరణ విషయములైన విషయము, సంగతి, సంశయము, పూర్వపక్షము, సిద్ధాంతము అనునవి గూడ జోడించితిమి. సూత్రార్థములు మరియు అధికరణ విషయములు బ్రహ్మవిద్యా పీఠము యొక్క పదవ పీఠాధిపతులైన స్వామి విద్యానందగిరి వారి బ్రహ్మసూత్రముల హిందీ అనువాదము నుండి గ్రహించడమైనది.

**స్వామి మేధానందపురి**
కైలాసాశ్రమము, హృషికేశ్

*****

# వైయాసిక న్యాయమాలా

వేదవ్యాస భగవానుల ద్వారా రచించబడిన వేదాన్త వాక్యార్థములు నిర్ణయించు అధికరణములకు వైయాసిక న్యాయములందురు. ఆ న్యాయములను క్రమబద్ధముగా నుంచుటచే అది ఒక మాల రూపము ధరించినది. అందువల్ల ఈ గ్రంథమును వైయాసిక న్యాయమాలందురు.

వ్రాయదలచిన గ్రంథము అవిఘ్నముగా పూర్తి చేయుటకు మరియు ప్రసిద్ధి చెందుటకు దానితో పాటు శిష్టుల ఆచరణమును పరిపాలించుటకు విశేషమైన ఇష్టదేవతారూప తత్త్వమైన ఉపాధి రూపములో నున్న గురుమూర్తికి నమస్కరించి గ్రంథ విషయమును ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నారు.

1. శ్లో॥ ప్రణమ్య పరమాత్మానం శ్రీ విద్యాతీర్థ రూపిణమ్
వైయాసిక న్యాయమాలా శ్లోకై సంగృహ్యతే స్ఫుటమ్

వ్యాసుల వారి ద్వారా చెప్పబడినదానిని 'వైయాసికీ' అందురు. వేదాన్త వాక్యములను నిర్ణయించు అధికరణములను న్యాయములందురు. వానిని క్రమముగా కూర్చుటను మాల అందురు. సూత్రకారులు, భాస్యకారులు (ఆది శంకరులు) విస్తారముగా చెప్పినను సూత్రాదులు, వ్యాకరణాదులు చదివిన విద్వాంసులకే భోదపడును గనుక మందబుద్ధిగల వారిని అనుగ్రహించుటకు (వ్యాకరణ, న్యాయ, మీ మీంసలు చదువని వారికై) శ్లోకముల ద్వారా ఈ మాలను స్పష్టముగా సంక్షేపముగా చెప్పుచున్నాను. (భారతీ తీర్థ స్వాముల వచనము)

2. శ్లో॥ ఏకో విషయ సందేహ పూర్వ పక్షావభాసకః।
శ్లోకోపరస్తు సిద్ధాన్త వాదీ సంగతయః స్ఫుటా॥

ఒక్కొక్క అధికరణములో ఐదు అవయవములు గలవు. విషయము, సందేహము, సంగతి, పూర్వ పక్షము మరియు సిద్ధాంతము అనునవి. వాని యొక్క సంక్షేప రూపము చెప్పుచున్నారు.

ప్రత్యేక అధికరణ సంగ్రహమునకు రెండు రెండు శ్లోకములు చెప్పెదరు. ప్రథమ శ్లోకములోని పూర్వార్ధము ద్వారా విషయము మరియు సంశయము అను రెండు అధికరణ అంశములు చెప్పబడినవి. ఉత్తరార్ధము ద్వారా ఒక అంశము చెప్పిరి. (పూర్వపక్షము) రెండవ శ్లోకములో సిద్ధాంతపక్ష నిరూపణము. సంగతి అను ఒక అవయవము మిగులును. దాని నిరూపణము వైయాసిక న్యాయమాలలో విడిగా చెప్పలేదు. విద్వాంసులు స్వయముగా సంగతిని కల్పన చేసి కొనగలరు. ఒక్కొక్కసారి సంగతిని గ్రంధకర్త (భారతీ తీర్థస్వాములు) సూచించెదరు.

3. శ్లో॥ శాస్త్రే అధ్యాయే తథాపాదే న్యాయ సంగతయస్త్రిధా।
శాస్త్రాది విషయే జ్ఞాతే తత్తత్సంగతి రూహ్యతామ్॥

సంగతి యొక్క విభాగములను ప్రతిపాదించుచున్నారు. శాస్త్రసంగతి అధ్యాయ సంగతి, పాదమునకు సంబంధించిన న్యాయ సంగతి అని మూడు రకముల సంగతులు. శాస్త్రాదుల జ్ఞానముండిన సంగతి కల్పన పాఠకులు స్వయముగా చేసికొనగలరు. శాస్త్రము ద్వారా ప్రతిపాద్య సంగతి, అధ్యాయము ద్వారా ప్రతిపాద్య

సంగతి మరియు పాద ప్రతిపాద్య సంగతి. ఈ విధముగా మూడు సంగతులను వ్యుత్పన్న పాఠకులు కల్పన గావించగలరు. వ్యుత్పన్నులనగా శాస్త్రజ్ఞులు.

4. శ్లో॥ శాస్త్రం బ్రహ్మ విచారాఖ్యమధ్యాయః స్యుశ్చతుర్విధాః
సమన్వయ విరోధౌద్వౌ సాధనంచ ఫలం తథా॥

శాస్త్ర ప్రతిపాద్యము మరియు అధ్యాయ ప్రతిపాద్యములను చెప్పుచున్నారు. వేదాన్త విచార రూపమైనది ఈ శాస్త్రము. సమన్వయ నామక ప్రథమాధ్యాయములో అన్ని వేదాన్త వాక్యముల యొక్క తాత్పర్యము అద్వయ బ్రహ్మమందే సమన్వయ మగుచున్నవనిరి. ద్వితీయ అధ్యాయములో సంభావిత విరోధములకు పరిహారము గావించిరి. బ్రహ్మ విద్యకు కావలసిన సాధనముల నిర్ణయము తృతీయ అధ్యాయములో కావించిరి. జ్ఞాన ఫలము యొక్క నిర్ణయము చతుర్థ అధ్యాయములో చెప్పిరి. ఇదే నాలుగు అధ్యాయముల అర్థము.

5. శ్లో॥ సమన్వయే స్పష్టలింగమస్పష్టత్వేప్యుపాస్యగమ్
జ్ఞేయగం పదమాత్రం చ చిన్త్యం పాదే ష్వనుక్రమాత్॥

అచట ప్రథమాధ్యాయములో నున్న పదార్థములను విభజించుచున్నారు. ప్రథమపాదములో స్పష్ట బ్రహ్మలింగ వాక్యముల సమన్వయము బ్రహ్మమందు చెప్పిరి. ఎట్లనగా "అన్తస్తద్ధర్మోపదేశాత్:" (బ్ర.సూ.న1-1.20) అను సూత్రములో సర్వజ్ఞత్వము, సర్వతాదాత్మ్యము సర్వపాప రహితత్వము అను అద్వయ బ్రహ్మ అసాధారణ ధర్మములను స్పష్ట చిహ్నములుగా చెప్పిరి. ఏఏ వాక్యములలో బ్రహ్మ చిహ్నములు స్పష్టముగా లేవో అవి ఉపాస్య బ్రహ్మమును చెప్పుచున్నవని రెండవ పాదములో చెప్పిరి. ఉదాహరణకు ఛాందోగ్యములోని శాండిల్య విద్యలో "సర్వ ఖల్విదం బ్రహ్మ" ఇందంతయూ నిశ్చయముగా బ్రహ్మమే అని మొదలిడి (ఛాం. 3-4-1,2) మనోమయత్వము, ప్రాణ శరీరత్వము అను ధర్మములు సగుణబ్రహ్మకు జీవునికి సమానముగా ఉన్నవని చెప్పుట వలన అస్పష్ట బ్రహ్మలింగము. తృతీయ పాదములో శ్రుతులలో నున్న జ్ఞేయ బ్రహ్మ యొక్క విచారము చేసిరి. వానిలో గూడ బ్రహ్మలింగములు స్పష్టముగా లేవు. ఉదాహరణకు మొదాటి అధికరణములో ముండక శ్రుతిలోని వాక్యము బ్రహ్మతత్వమును చెప్పుచున్నది. స్వర్గము, భూలోకము మరియు అంతరిక్షలోకములు సూత్రాత్మలోను పరబ్రహ్మములోను సాధారణముగా ఓతప్రోతమైయున్నవి. అందువల్ల దీనిలో బ్రహ్మలింగము స్పష్టముగాదు. అట్లయినను ద్వితీయ పాదములో కఠోపనిషత్తులోనున్న బ్రహ్మతత్వ బోధక వాక్యములను విచారించిరి. అట్లే మూడవ పాదములో దహరోపాసనను చెప్పు వాక్యమును విచారించిరి. (దహరమనగా శరీరములో గల హృదయాకాశమని) దీనికి అంతరంగికము అని చెప్పుచు. ఆ రెండు పాదములకు సాంకర్యము లేదనుచున్నారు. ఈ విధముగా వాక్యముల విచారము మూడు పాదములలో జరిగినది. నాల్గవ పాదములో అవ్యక్త పదము అజపదములాంటి సందిగ్ధ పదములు విచారము చేసిరి.

6. శ్లో॥ ద్వితీయే స్మృతి తర్కాభ్యామవిరోధో అన్య దుష్టతా
భూత భోక్తృ శ్రుతే ర్లింగ శ్రుతే రస్య విరుద్ధతా॥

ద్వితీయ అధ్యాయములో గల విషయములను చెప్పుచున్నారు. మొదటి స్మృతి పాదము ద్వారా సమన్వయమునకు అవరోధమును చెప్పిరి. రెండవదైన తర్కపాదము ద్వారా సాంఖ్యాది ఇతర పక్షముల దుష్టత్వమును

చెప్పిరి. భూతముల మరియు భోక్త జీవునికి సంబంధించిన శ్రుతుల విరోధములను చెప్పు శ్రుతుల పరిహారము గావించిరి. ద్వితీయ అధ్యాయములోని ప్రథమ పాదములో సాంఖ్య, యోగ, కాణాద (వైశేషిక)÷ స్మృతులు మరియు వారి తర్కముల ద్వారా వేదాంత సమన్వయమునకు కలిగిన విరోధములను (ఖండించిరి) పరిహరించిరి. ద్వితీయ పాదములో సాంఖ్యాది మతములు దోషయుక్తములని చెప్పిరి. తృతీయ పాదములో పూర్వార్ధము ద్వారా పంచమహాభూతములను చెప్పు శ్రుతుల పరస్పర విరోధము పరిహరింపబడినది. ఉత్తరార్ధము ద్వారా జీవునికి సంబంధించిన శ్రుతులలో గల విరోధమును పరిహరించిరి. చతుర్ధ పాదములో సూక్ష్మ శరీరమును చెప్పు శ్రుతులలో గల విరోధములను దూరము కావించిరి.

7. శ్లో॥ తృతీయే విరతిస్తత్వం పదార్ధ పరిశోధనమ్
గుణోపసంహృతి జ్ఞాన బహిరంగాది సాధనమ్॥

మూడవ అధ్యాయములో వరుసగా వైరాగ్యము, తత్, త్వం పదార్ధముల శోధన, గుణోపసంహారము, జ్ఞాన బహిరంగ సాధనము చెప్పబడినవి.

ప్రథమ పాదములో వైరాగ్య నిరూపణ కొరకు జీవుని పరలోక గమనాగమనములు విచారించిరి. రెండవ పాదములో పూర్వ భాగము ద్వారా "త్వం" పదార్ధ శోధన మరియు ఉత్తరభాగమున "తత్" పదార్ధ శోధన చెప్పిరి. మూడవ పాదములో సగుణ ఉపాసనలలో గుణోప సంహారమును మరియు నిర్గుణ బ్రహ్మములో పునరుక్తి కాని పదములు ఉపసంహారము చెప్పిరి. నాల్గవ పాదములో నిర్గుణ విద్యకు కావలసిన బహిరంగ సాధనములు, యజ్ఞాదులను మరియు అంతరంగ సాధనములగు శమ, దమ, నిధి ధ్యాసనాదులు నిరూపించిరి.

8. శ్లో॥ చతుర్ధే జీవతోముక్తి రుత్క్రాన్తిర్గతి రుత్తరా
బ్రహ్మ ప్రాప్తి బ్రహ్మలోకావితి పదార్ధ సంగ్రహ॥

నాలుగవ అధ్యాయములోని విషయములు విభజించుచున్నారు. మొదటి పాదములో శ్రవణాదుల ఆవృత్తి వలన నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారము లేక ఉపాసన ద్వారా సగుణ బ్రహ్మను సాక్షాత్కరించుకుని పుణ్యపాపలేపము నాశనము చేసుకుని ముక్తి నొందుట చెప్పబడెను. రెండవ పాదములో మరణాసన్న వ్యక్తి యొక్క ఉత్క్రాన్తి చెప్పబడెను. స్థూల శరీరము నుండి సూక్ష్మ శరీరము వేతై ఎట్లు మార్గములో ప్రవేశించును దానిని ఉత్క్రాన్తి అందురు. 3వ పాదములో సగుణోపాసకులు మృతినొంది ఉత్తర మార్గమున పోవుటను చెప్పిరి. 4వ పాదములో బ్రహ్మవేత్తల విదేహ కైవల్యము పూర్వ భాగములో చెప్పిరి. ఉత్తరభాగములో సగుణ బ్రహ్మవేత్తల బ్రహ్మలోక స్థితి నిరూపించిరి. ఇది పదార్ధముల సంగ్రహము.

9. శ్లో॥ ఊహిత్వా సంగతీస్తిస్రస్తథావాన్తర సంగతీః
ఊహేధాక్షేప దృష్టాంత ప్రత్యుదాహరణాధికాః॥

శాస్త్ర సంగతి, అధ్యాయ సంగతి, పాద సంగతులను ఊహించిన లాభమేమనది చెప్పుచున్నారు. ఈక్షత్యధికరణములో "తదైక్షత" అన్నచోట ఆ వాక్యము బ్రహ్మ పరమా లేక ప్రధాన పరమా అను సందేహము కలిగినపుడు విచారము బ్రహ్మ గురించి జరుగుచున్నందువలన బ్రహ్మ విచారము శాస్త్రసంగతి యని నిర్ణయించిరి.

అన్ని శృతి వాక్యములు బ్రహ్మమనే తాత్పర్యముగా చెప్పుట వలన సమన్వయము, అధ్యాయ సంగతి. ఈక్షణమనగా సంకల్ప క్రియ చైతన్య బ్రహ్మమందు అసాధారణ హేతువు అగుటవలన ప్రధమపాద సంగతి. ఈ విధముగనే అన్నీ అధికరణముల యందు ఈ మూడు సంగతులను కల్పన చేసుకొనవలయును. అవాంతర సంగతులనేకములు. ఆక్షేప సంగతి దృష్టాంత సంగతి, ప్రత్యుదాహరణ సంగతి మరియు ప్రాసంగిక సంగతి. ఈ అవాంతర సంగతులను బుద్ధిమంతులు స్వయముగా కల్పన చేసుకొనగలరు. కాని పాఠకుల సౌలభ్యార్థము ప్రతి అధికరణము ముందు ఈ అవాంతర సంగతులను వీలైనంత వరకు ఉల్లేఖించినాము.

10. శ్లో॥ పూర్వన్యాయస్య సిద్ధాంతయుక్తి వీక్ష్య పరేనయే
పూర్వ పక్షంచ యుక్తించ తత్ర ఆక్షేపాది యోజయేత్॥

పూర్వాధికరణములో చెప్పిన సిద్ధాంతపక్షమును, తర్కమును దృష్టిలో నుంచుకుని ఉత్తర అధికరణమునందలి పూర్వ పక్షయుక్తిని దృష్టిలో ఉంచుకుని, అధికరణమునకు ముందు ఆక్షేపాది సంగతులను తెలుసుకొనగలరు. ఏ విధముగా ననిన, మొదటి అధికరణములో బ్రహ్మ విచారశాస్త్రము ఆరంభించవలయునని సిద్ధాంతీకరించిరి. దానికి యుక్తి ఏమనగా బ్రహ్మ సందిగ్ధమైనది, కనుక బ్రహ్మ విచారము చేయవలయును. ద్వితీయ అధికరణములో పూర్వపక్షి జగజ్జన్మాది బ్రహ్మలక్షణము కానేరదు, ఎందుకనగా జన్మస్థితిలయములు జగన్నిష్టములు గనుక, లక్షణములేని బ్రహ్మవిచారము యోగ్యము కాదనెను. ఈ రెండు పక్షములను చూపి ఇచ్చట ఆక్షేపసంగతిని తెలుసుకొనవలయును. జన్మాదులు జగన్నిష్టములగుటవలన బ్రహ్మలక్షణములేనందున, బ్రహ్మమే లేదు మరి సందిగ్ధత్వము విచారత్వముల గురించి ఎట్లు చెప్పగలరు. జన్మాదులు జగత్తునందు గలవు గనుక బ్రహ్మకు లక్షణము లేదనుట దృష్టాంత సంగతి, విచారము చేయుటకు కారణమున్నను బ్రహ్మకు లక్షణము లేదని చెప్పుటకు కారణము లేదనుట ప్రత్యుదాహరణ సంగతి. దృష్టాంత సంగతి మరియు ప్రత్యుదాహరణ సంగతి. సర్వత్ర సులభముగా తెలుసుకొనవచ్చును. పూర్వాధికరణ సిద్ధాంతములో ఉత్తరాధికరణ యొక్క పూర్వపక్ష హేతువును మరియు ఉత్తరాధికరణ సిద్ధాంతములో పూర్వపక్ష హేతువు లేదను వైలక్షణ్యమును మంద బుద్ధిగలవారు గూడ గ్రహించగలరు. ఈ ప్రకారము యథయోగ్యము ఆక్షేపసంగతిని తెలుసుకొనుట సులభము. ఇపుడు ప్రాసంగిక సంగతిని గూర్చి చెప్పుచున్నారు. సమన్వయాధ్యాయ మూడవ పాదములో అధికారి విచారము చేయునపుడు దేవతాధికరణములో దేవతల అధికార సంగతి లేకపోయినను బుద్ధిలో నున్న అవాంతర సంగతి ఉండనేయున్నది. బ్రహ్మవిద్యలో దేవతలకు అధికారము ఉన్నదా లేదా అని అధికారము నిర్ణయించునపుడు అవాంతర సంగతిని గురించి చెప్పుచూ పూర్వాధికరణములో నున్న (అంగుష్టమాత్ర) వాక్యము బ్రహ&ఓమపరమగుట వలన బ్రహ్మ అంగుష్ట పరిమాణము గల వాడని తేలినది. మనుష్యుల హృదయము అంగుష్టమాత్ర పరిమాణమగుట వలన బ్రహ్మవిద్య యందు మనుష్యులకు, శాస్త్రము అధికారము గలదనినది. మనుష్యులకు అధికారమున్నదన్న, దేవతలకు అధికారము కలదా లేదా అను ప్రశ్న బుద్ధిస్థమగుట వలన దీనిని ప్రాసంగిక సంగతి అందురు. ఈ విధముగా అధికరణముల సంగతి చెప్పిరి. ప్రతి అధికరణమునకు రెండు శ్లోకములు చెప్పిరి. వానిలో ముందు చెప్పిన నాలుగు విషయములు అనగా విషయము, సంశయము, పూర్వ పక్షము, సిద్ధాంతము సంగ్రహముగా నుండును.

**1. జిజ్ఞాసాధికరణము**

అధాతో బ్రహ్మ జిజ్ఞాసా(1.1.1)

సూత్రార్ధము : సాధన చతుష్టయ సంపన్నానంతరము కర్మఫలము అనిత్యమగుటవలన మోక్షాభిలాషులు బ్రహ్మజ్ఞానమునకు వేదాంతవాక్యముల విచారము చేయవలయును.

శ్లో॥ విషయోవిశయశ్చైవ పూర్వ పక్షస్తథోత్తర మ్
సంగతిశ్చేతి పంచాంగం శాస్త్రే అధికరణం స్మృతమ్

సంగతి : ముందు అధికరణము లేనందున సంగతి లేదు.

విషయము : విచారించవలసిన విషయము వేదాంత శాస్త్రము

సంశయము : బ్రహ్మ విచారణీయమా? కాదా?

పూర్వపక్షము : అధ్యాసము నిరూపన కానందువలన సందేహము మరియు ఫలము కనిపించుటలేదు. అందువల్ల బ్రహ్మ విచారణీయ విషయము కాదు.

సిద్ధాంతి : అహం బుద్ధియందు అధ్యాసము నిశ్చయము మరియు శ్రుతి బ్రహ్మను అసంగమని వర్ణించెను. కాన బ్రహ్మ విషయములో సందేహము కలదు. బ్రహ్మ జ్ఞానము ద్వారా మోక్షము కలుగును. అందువల్ల శ్రుతులను ఆధారము చేసుకుని బ్రహ్మ విచారము చేయవలయును. ప్రత్యేక అధికరణములోని నాలుగు విషయములను శ్లోకముల ద్వారా సంగ్రహముగా చెప్పుచున్నారు.

11. శ్లో॥ అవిచార్యం విచార్యంవా బ్రహ్మాధ్యాసా నిరూపణాత్
అసందేహా, ఫలత్వాభ్యాం నవిచార్యం తద్ అర్హతి

12. శ్లో॥ అధ్యాసోహం బుద్ధి సిద్ధ్యో సంగం బ్రహ్మ శ్రుతిరీతమ్
సందేహాన్ ముక్తి భావాచ్ఛ విచార్యం బ్రహ్మవేదతః

**శ్లోకార్ధం 11 :**

బ్రహ్మ విచార రూపమైన ఈ శాస్త్రము అధ్యాస నిరూపణ కానందున ఆరంభించుటకు యోగ్యము గాదు. బ్రహ్మాత్మలందు సందేహము లేనందున ముక్తిరూప ఫలము గోచరము కానందున శాస్త్రము ఆరంభయోగ్యముగాదు.

(ఫుట్‌నోట్స్) : నిత్యానిత్య వస్తు వివేకము, ఇహమూత్రార్ధ ఫల విరాగము, శమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము దీనిని సాధన చతుష్టయములందురు.

అహంబుద్ధి ద్వారా అధ్యాసము సిద్ధము. బ్రహ్మ అసంగమని శ్రుతిలో చెప్పిరి. దేహాదులు ఆత్మయని సందేహముండుట వలన, శ్రుతుల ద్వారా ముక్తి ఉన్నదని చెప్పుట వలనను, ముముక్షువులు బ్రహ్మ జ్ఞానము కొరకు వేదాంత విచారము చేయవలయును. (12)

"ఆత్మావా అరే! ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యో నిధిధ్యాసితవ్యః" (బృ' 2.4.5) పరబ్రహ్మమును గూర్చి శ్రవణము చేయవలయును. వినిన అర్థమును యుక్తుల ద్వారా విమర్శింపవలయును. పిదప నేను బ్రహ్మమని ధ్యానింపవలయును. ఇదియే పరమ పురుషార్థము ఇచ్చట ఆత్మ దర్శన ఫలమునుద్దేశించి దానికి సాధన రూపములో శ్రవణమును విధించుచున్నారు. వేదాంత వాక్యముల తాత్పర్యము బ్రహ్మమునందే అని నిర్ణయించుటకు అనుకూలమైన తర్క విచారమును శ్రవణమందురు. ఈ విచారమును విధించు వాక్యము విషయము. ఈ విషయము పై రెండు శ్లోకములలో సంగ్రహించలేదని సంశయము వలదు. సంక్షేపముగా సంశయము చెప్పుట ద్వారా దాని అర్థము వలననే విషయము గ్రహింపవలయును. బ్రహ్మ విచారాత్మకము, న్యాయ నిర్ణయాత్మకము శాస్త్రము ఆరంభించవలయునా? లేదా? అని సందేహము. పూర్వ పక్ష సిద్ధాంత పక్ష యుక్తుల ద్వారా అన్ని చోట్ల సందేహ కారణము గ్రహించవలయును. ఆరంభించరాదు అనునది పూర్వ పక్షము ఎందులకనగా ఈ శాస్త్రము యొక్క విషయ ప్రయోజనములు లేవు గనుక సందిగ్ధ విషయమునే విచారించెదరు. బ్రహ్మము అసందిగ్ధము మరి బ్రహ్మరూపములో సందేహమా? లేక ఆత్మరూపములోనా? ప్రథమ రూప వికల్పముగాదు. ఎందులకనగా "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై. 2.1) అను వాక్యము ద్వారా బ్రహ్మలక్షణము నిశ్చయము. రెండవ వికల్పము కానేరదు. అహమను జ్ఞానము ద్వారా ఆత్మ జ్ఞానము గూడ నిశ్చయమే. అహం జ్ఞానము అధ్యస్థ ఆత్మ విషయమనిన అదియు సరిగాదు. ఎందుకనగా ఇంత వరకు అధ్యాసము నిరూపింపబడలేదు. విరుద్ధ స్వభావముగల అంధకారము వెలుతురు వలె జడ దేహము చైతన్య ఆత్మల యొక్క అధ్యాసము, ఆలచిప్పయందు వెండివలె కానవచ్చు, అన్యోన్య అధ్యాసము నిరూపించుటకు శక్యము గాదు. భ్రాంతిహీనమైన శ్రుతి అహం జ్ఞానము ద్వారా నిశ్చయమైనది. శ్రుతి అసందిగ్ధ మగుటవలనను బ్రహ్మ విచారమునకు విషయము లేదు. అంతేకాక ప్రయోజనము కనబడుట లేదు. అందువల్ల బ్రహ్మ విచారము అయోగ్యము అనర్థము గాన శాస్త్రము ఆరంభించునవసరము లేదు. ఇంతవరకు పూర్వపక్షము.

సిద్ధాంతి ఇచ్చట సమాధానము చెప్పుచున్నారు. శాస్త్రము ఆరంభించవలయును. ఎందుకనగా విషయ ప్రయోజనములున్నందు వలన శ్రుతిలో చెప్పినదానికి అహమను జ్ఞానమునకు అనేక విరుద్ధ విచారమతములుండుట వలననూ బ్రహ్మాత్మ విషయములు సందిగ్ధ విషయములగుట వలననూ శాస్త్రము ఆరంభింపవలయును. అయమాత్మా బ్రహ్మ (బృ. 2.5.10) అను శృతి అసంగబ్రహ్మమును ఆత్మరూపముగా నిరూపించుచున్నది. "అహం మనుష్యః" అను అహం బుద్ధి ఆత్మ దేహాల తాదాత్మ్యముల ద్వారా ఆత్మను గ్రహించుచున్నది. అధ్యాసమును నిరూపించలేదనుట వేదాంతులకు అలంకారము. వస్తు విషయము సందిగ్ధము, ముక్తి ప్రయోజనము శ్రుతులలో చెప్పుట వలననూ, జ్ఞానులయందు ముక్తి ఆనందము అనుభవ గమ్యమగుట వలననూ ప్రయోజనం సునిశ్చితము. అందువల్ల వేదాంతవాక్యముల విచారము ద్వారా బ్రహ్మమము విచారాధీనమగుట వలన శాస్త్రము ఆరంభనీయమని సిద్ధాంతము.

పూర్వపక్షము : బ్రహ్మమును గురించి వినిన వారిలో గూడ పూర్వమువలే సంసారము గోచరమగు చున్నదనిన, దానికి సిద్ధాంతి జవాబు : "తరతి శోకమాత్మవిత్" బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అశరీరం వావ సంతంనప్రియాప్రియే స్పృశతః (ఛాం. 8.12.1) శరీరాభిమానరహితులకు ప్రియా ప్రియములు అంటుట లేదు. ఈ శ్రుతి వాక్యముల ద్వారా వేద ప్రమాణ జన్యమైన బ్రహ్మాత్మైక్య జ్ఞానము ద్వారా, అజ్ఞాన నివృత్తి పూర్వక దేహాభిమాన నివృత్తి కలుగుట వలన దుఃఖాదులు ఉండవు. కాన బ్రహ్మను గురించి విని అనుభవించువారిలో సంసారము గోచరము గాదు.

తెలుసుకొనవలయుననను ఇచ్ఛకు విషయమైన బ్రహ్మయొక్క స్వరూపము "జన్మాద్యస్యయతః" అను సూత్రము ద్వారా చెప్పెదరు.

ఇచ్చట బ్రహ్మ ప్రధానము. జిజ్ఞాస కర్మకు ప్రధానమైన బ్రహ్మను గ్రహించిన తదాశ్రిత ప్రమాణాదులు వాటంతటవే గ్రహింపబడును. రాజు వెళ్ళుచున్నాడనిన పరివారజనులతో, సేనా, అమాత్యాదులతో అని అర్థము. "జ్ఞా"ధాతువు (ద్వారా) అజహత్ లక్షణము ద్వారా బ్రహ్మ అపరోక్ష జ్ఞానము లక్షితము. సన్‌ప్రత్యయము (ద్వారా) జహత్ లక్షణము ద్వారా ఇచ్ఛాసాధ్యమైన విచారము లక్షితము అతః పదమునకు అర్థము. "తద్ యథా ఇహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవ అముత్ర పుణ్య కృతో లోకః క్షీయతే" ఏవిధముగా ఇచ్చట కర్మము ద్వారా నిర్వహించబడు వ్యవసాయాదులు క్షీణించునో అట్లే యాగాదుల ద్వారా పొందు స్వర్గాదులు నశించును అని తెలుసుకుని బ్రహ్మ విచారము చేయవలయును. అనగా బ్రహ్మజ్ఞానమునకు వేదాంత వాక్యముల విచారము చేసి తీరవలయును.

బ్రహ్మ విచారణీయమని చెప్పబడినది. బ్రహ్మలక్షణమేదనే సందేహమునకు వ్యాస భగవానుల వారు రెండవ సూత్రమును రచించిరి.

**2. జన్మాద్యధికరణము**

జన్మాద్యస్యయతః (1-1-2)

అస్యజగతః = ఈ ప్రపంచమునకు

జన్మాది = సృష్టి, స్థితి, లయములు

యతః = దేని నుంచి జనించుచున్నదో అది బ్రహ్మము

సంగతి : విచారణీయ బ్రహ్మ లక్షణము సిద్ధము కానపుడు బ్రహ్మ స్వరూపమెట్లు సిద్ధమగును. సిద్ధము కాని బ్రహ్మ విచారణీయ మెట్లగును. ఆక్షేపసంగతి :-

విషయము : ఈ అధికరణములో బ్రహ్మ లక్షణము విచారించిరి.

సంశయము : బ్రహ్మకు లక్షణము కలదా? లేదా?

పూర్వపక్షము : జన్మస్థితిలయములు జగన్నిష్ఠములు.

సత్యం జ్ఞానమనంతమను పదములకు అర్థ ప్రసిద్ధి లేదు.

కనుక బ్రహ్మ లక్షణము అసంభవము.

సిద్ధాంతి : బ్రహ్మ జగజ్జన్మాదులకు కారణము. జగజ్జన్మాది కారణత్వము బ్రహ్మమునందు గలదు. ఎట్లనగా త్రాడుపై కనపడు సర్పమునకు కారణము త్రాడు. అట్లే జగత్ యొక్క జన్మాది కారణమునకు అధిష్ఠానము బ్రహ్మ. లౌకిక వాక్యముల రీతిగా సత్యం జ్ఞానమనంతమను వాక్యము లాక్షణికముగా బ్రహ్మబోధ కలిగించును. ఏది వెండియో అదియే ముత్యపు చిప్ప అనునట్లు, ఏది జగత్ కారణమో అదియే బ్రహ్మ. కల్పిత కారణత్వము బ్రహ్మకు

తటస్థ లక్షణము. "బ్రహ్మాది స్తంభ పర్యంతము భూతములు ఏ పరబ్రహ్మము నుండి పుట్టుచున్నవో" (తై. 3.1.)యతో వా ఇమాని భూతాని జాయంతే" అను వాక్యముల ద్వారా శ్రుతి అనుమానమును గూడ అంగీకరించును. మేధావి పండితుడు దొంగల ద్వారా అరణ్యములో విడువబడి తర్క సహాయముతో తన స్వగ్రామమునకు చేరును.

13. శ్లో॥ లక్షణం బ్రహ్మణో నాస్తి కింవా అస్తి, నహి విద్యతే
జన్మాదే రన్యనిష్టత్వాద్ సత్యాదేశ్చాప్రసిద్ధితః॥

14. శ్లో॥ బ్రహ్మనిష్ఠం కారణత్వం స్సాల్లక్ష్యం స్రగ్ భుజంగవత్
లౌకికాన్యేవ సత్యాదీన్యఖండం లక్షయన్తిహి॥

**శ్లోకార్థము :**

బ్రహ్మయొక్క లక్షణము కలదా? లేదా? బ్రహ్మ లక్షణము లేదు. జన్మస్థితి భంగములు జగన్నిష్ఠములగుట వలననూ, సత్యం జ్ఞానమనంతం అను బ్రహ్మలక్షణము లోకములో ప్రసిద్ధము గానందున.

జన్మాదులు జగత్తునకు ఐనను జగత్ కారణము బ్రహ్మ, ఏది పామో అదే మాల అను బాధ సామానాధికరణము ద్వారా బ్రహ్మ తటస్థ లక్షణము సిద్ధమగును. సత్య జ్ఞానాదులు భిన్నార్థకములైనను బ్రహ్మమునందే పర్యవసానములగుచున్నవి. కనుక బ్రహ్మ స్వరూప లక్షణము సిద్ధమగుచున్నది. అనగా పరమాత్మ ఈ జగత్తుకు అభిన్న నిమిత్త ఉపాదానకారణము.

"యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవన్తి యత్ ప్రయంత్య భిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వతద్ బ్రహ్మ" ఈ భూతములు దేని నుండి జన్మించుచున్నవో, ఎచ్చట నిలిచి ఉన్నవో, నాశనమయిన తరువాత దేనిలో చేరుచున్నవో, అదియే బ్రహ్మము దానిని విచారము చేసి తెలుసుకొనుము. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" (తై. 2.1) ఏది సత్యమో, జ్ఞాన స్వరూపమో, అనంతమో, అదియే బ్రహ్మము. ఈ రెండు వాక్యములు, ఈ అధికరణమునకు విషయములు. పై రెండు వాక్యములలో చెప్పిన బ్రహ్మ లక్షణము సంభవమా? కాదా? అని సంశయము. సంభవము కాదు. జన్మాదులు బ్రహ్మ లక్షణములా? లేక సత్యాదులు బ్రహ్మ లక్షణములా? జన్మాదులు కానేరవు. ఎందులకనగా అవి జగన్నిష్ఠములు మరియు బ్రహ్మతో సంబంధము లేదు. సత్య జ్ఞానాదులు లోక ప్రసిద్ధములు వానిని స్వీకరించిన భిన్నమైన అర్థములు అగుట వలన అఖండ బ్రహ్మము సిద్ధముగాదు. అప్రసిద్ధమైన సత్యాదులు లక్షణములుగా చెప్పుట యుక్తియుక్తము గాదు. అందువల్ల బ్రహ్మకు తటస్థలక్షణము గాని, స్వరూపలక్షణము గాని లేదు అని పూర్వపక్షి వాదించగా దానికి సిద్ధాంతి సమాధానము.

ఏ లక్షణములో రూపములు అంతర్భూతములు గావో మరియు సత్య పదార్థమును వ్యవస్థితముగా చెప్పుటకు కారణమో, అది తటస్థలక్షణము. "కాకవద్ దేవదత్తస్య గృహమ్" అనినపుడు దేవదత్తుని ఇంటిపై వాలిన కాకి ఎగిరిపోయినను సత్యమైన దేవదత్తుని ఇల్లు చూపించును. ఇల్లును చూపించుటకు కాకి హేతువు. అట్లే జన్మాదులు అన్యమైన జగన్నిష్ఠములైనను దాని ఉత్పత్తి కారణము కల్పన ద్వారా సంబంధము కలదని చెప్పుటచే తటస్థలక్షణము బ్రహ్మమునందు కలదని చెప్పుట సంభవము. "యే భుజంగః సాస్రక్" అనగా ఏది పామో అదే త్రాడు. అన్నట్లు "ఏది జగత్ కారణమో అదే బ్రహ్మము" "యద్ జగత్ కారణం తద్ బ్రహ్మ" అని కల్పిత వస్తువు ద్వారా వాస్తవమైన

వస్తువును ఉపలక్షణముగా చెప్పగలము. తండ్రి, కొడుకు, అన్నా, అల్లుడు అను భిన్నార్థములు ఒకే దేవదత్తుని యందు అంతమొందినను విరోధము లేదు. ఒకే దేవదత్త పిండమును కొడుకు, తండ్రియని, తండ్రి తనయుడని, తమ్ముడు అన్నయని, మామ అలుల్దని సంబోధించెదరు. అయిననూ విరోధము లేదు. ఆ విధముగానే లోకములో ప్రసిద్ధములైన భిన్నార్థములైన సత్యాది శబ్దములు అఖండ బ్రహ్మమునందు లీనమగుట వలన స్వరూప లక్షణము సిద్ధమగుచున్నది. ఈ విధముగా రెండు లక్షణములు బ్రహ్మకు గలవు.

తత్వ జ్ఞానము వస్తు తంత్రము. అస్థిత్వము గల బ్రహ్మ జ్ఞానము వస్తుతంత్రము. బ్రహ్మ ఇంద్రియ అగ్రాహ్యము. అందువల్ల శ్రుతుల ద్వారానే బ్రహ్మను తెలుసుకొనగలము. మనస్సు ద్వారా చింతింపలేని రచనాశక్తి నామ రూపాదులతో గూడి వ్యక్తమైన ప్రత్యక్షాది ప్రమాణములకు ఆలవాలమైన ఈ జగత్తు యొక్క సృష్టి స్థితి భంగములు, ఆ సర్వజ్ఞుడు సర్వశక్తి సంపన్నుడైన కారణము నుండియగును. అదే బ్రహ్మము.

**3. శాస్త్రయోనిత్వ అధికరణము (1.1.3)**

జగత్ కారణమైన బ్రహ్మ సర్వజ్ఞుడని సిద్ధమైనది. దానినే ఈ అధికరణములో దృఢపరచుచున్నారు.

**3. శాస్త్రయోనిత్వాత్ (1.1.3)**

1. ఋగ్వేదాది శాస్త్రములకు కారణమగుట వలన బ్రహ్మ సర్వజ్ఞుడు
2. వేద శాస్త్రము ద్వారా గమ్యమగుట వలన బ్రహ్మ ఇతర ప్రమాణముల ద్వారా అగమ్యము.

సంగతి : సంపూర్ణ జగత్ కారణము బ్రహ్మ సర్వజ్ఞుడనుట సరికాదు, వేదము నిత్యమగుట వలన. జగదంతర్గతమైన వేదము బ్రహ్మ సర్వజ్ఞుడనునది నిరాకరించగా ఈ అధికరణము ఆరంభింపబడినది. ఇచ్చట ఆక్షేప సంగతి.

విషయము : వేదకర్త బ్రహ్మమనునది విచారణీయము

సంశయము : వేదకర్త బ్రహ్మమా? కాదా?

పూర్వపక్షము : "వాచాది రూప నిత్యయా" ఈ వేదవాక్యములో వేదము నిత్యమని చెప్పబడినది. దానికెవరు కర్త కాజాలరు. అందువల్ల వేదకర్త బ్రహ్మము కాదు.

సిద్ధాంతము : వేదకర్త బ్రహ్మమే. వేదము పరమేశ్వరుని శ్వాస నిశ్వాసముల ద్వారా వెలువడినది. వేదముల నిత్యత్వము కల్పములను చూచి చెప్పబడినది. వేదములతో బాటు అన్ని భూతముల కర్త బ్రహ్మమగుటచే అతడు సర్వజ్ఞుడు.

# ౨. ద్వితీయ వర్ణకము

సంగతి : జగత్ కారణుడైన బ్రహ్మ ఇతర ప్రమాణముల ద్వారా గ్రహింపగలడు అను శంక కలుగవచ్చును. లక్షణ ప్రమాణముల ద్వారా బ్రహ్మ నిర్ణయింపబడును. పూర్వాధికరణములతో ఈ అధికరణమునకు ఏక విషయత్వమనునది సంగతి. పూర్వాధికరణములో బ్రహ్మ లక్షణము చెప్పబడినది. దీనిలో ప్రమాణము నిర్ణయించబడినది.

విషయము : బ్రహ్మ సంబంధమైన ప్రమాణములు విచారింపబడినవి.

సంశయము : సిద్ధ బ్రహ్మఉ శాస్త్రగమ్యమా లేక అన్య ప్రమాణ గమ్యమా?

పూర్వ పక్షము : కుండవలె సిద్ధవస్తువైనందున బ్రహ్మ అన్యప్రమాణగమ్యము.

సిద్ధాంతము : రూపము, ధర్మ బోధక చిహ్నాము అనబడు హేతువు లేనందున బ్రహ్మ వేద భిన్నములైన ప్రమాణములతో తెలియదు. "తంతు ఔపనిషధం పురుషం పృచ్ఛామి" అనుశృతి వాక్యములో వేదైక గమ్యము చెప్పబడినది. వేద భిన్నమైన ఏ ప్రమాణము ద్వారాను బ్రహ్మను తెలుసుకొనజాలము.

ప్రథమ వర్ణకము వ్యాఖ్యానము : ఋగ్వేదాది శాస్త్రములకు కారణమగుట వలన బ్రహ్మ సర్వజ్ఞుడు "శాస్త్రస్య యోనిః" వేదము అపౌరుషేయము సృష్టికి ఆదిలో పరమేశ్వరుడు పూర్వ సృష్టియందు సిద్ధమైయున్న వేదమును అనుపూర్వికముగా (పూర్వానుసారముగా) విరచించెను. పూర్వ సిద్ధమునకు విజాతీయము గాదు. మహాభారతాదులు, పూర్వ కల్ప సృష్టి యందున్న దానికంటే విపరీతముగా ఈ స్వర్గములో వ్రాసినదానిని పౌరుషేయమందురు. "సజాతీయ ఉచ్చారణ అనపేక్ష ఉచ్చారణ విషయత్వం పౌరుషేయమ్" దానికి విపరీతముగా వేదములలో పూర్వ కల్పము వలే ఈ కల్పములో శబ్ధజాలము గలదు. అది మారదు అందువల్ల అది అపౌరుషేయము.

1. "వాచా విరూప నిత్యయా" శ్రుతి

2. "అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా!

అదౌ వేదమయీ దివ్యా యతః సర్వా ప్రవృత్త యః॥ స్మృతి

1. విరూపుడను పేరుగల ఓ దేవత! నీవు శాశ్వతమైన వేద వాక్కుచే నాచేత స్తోత్రము చేయించుకొనుము.

2. ఉత్పత్తి వినాశములు లేనట్టియు, శాశ్వతమైనట్టియు, వేద రూపమగు వాక్కును బ్రహ్మదేవుడు మొట్టమొదట లోకమునకు తెలిపెను. దాని ద్వారా సర్వ వ్యవహారములు ప్రచలితములు. "తస్మాత్ యజ్ఞాత్ సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే" బ్రహ్మము నుండి ఋక్కులు, సామ మంత్రములు జనించెను. (శుక్ల.యజ.సం.21.7)

ద్వితీయ వర్ణకము వ్యాఖ్యానము : "శాస్త్రం యోనిః యస్య సః" వేద శాస్త్రముల ద్వారా గమ్యమగుట వలన బ్రహ్మ ఇతర ప్రమాణముల" ద్వారా అగమ్యము.

"నావేదవిన్మనుతే తం బృహంతం, నా బ్రహ్మవిత్ పరమం ప్రైతి ధామ, విష్ణుక్రాంతం వాసుదేవం విజానన్విప్రో విప్రత్వం గచ్ఛేత్ తత్వదర్శీ (శాట్యాయనోప. 4)

వేదవేత్త కాని వాడు పరమాత్మను మననము చేయలేడు. బ్రహ్మవేత్త కాని వాడు పరమ పదమును పొందలేడు. విష్ణుక్రాంతమైన వాసుదేవుని తెలుసుకున్నవాడై (వ్యాపక పరమాత్మను అనుభవించినవాడై) విప్రుడు తత్వ దర్శియై విప్రత్వము నొందును. ఋగ్వేదాది కారణము మరియు ప్రమాణముకు బ్రహ్మ యధాతథ్యముగా తెలుసుకొనుటకు. కనుక వేదముల ద్వారానే బ్రహ్మ తెలుసుకొనబడును. శ్రుతుల ద్వారా బ్రహ్మ తెలుసుకున్న తర్వాత, బ్రహ్మకు వాని అనువాదరూపముగా అనుమానము, అనుభవము అంగీకరించబడును. కాన బ్రహ్మ వేదైక గమ్యము.

15. "న కర్తృ బ్రహ్మ వేదస్య, కిం వా కర్తృ, న కర్తృతత్ (ప్రధమ వర్ణక వ్యాఖ్యానము)
విరూపనిత్యయా వాచేత్యేవం నిత్యత్వవర్ణనాత్॥

16. కర్తృనిఃశ్వసితాద్యుక్తేర్ నిత్యత్వం పూర్వసామ్యతః
సర్వావభాసి వేదస్య కర్తృత్వాత్ సర్వవిద్భవేత్॥

పూర్వపక్ష శ్లో॥ బ్రహ్మ వేదము యొక్క కర్తయా? కాదా? బ్రహ్మ వేద కర్త కాదు. ఎందులకనగా "విపురూపుడను పేరుగల ఓ దేవత! నీవు శాశ్వతమగు వేదవాక్కుచే నాచే – స్తోత్రము చేయించుకొనుము" అను వాక్యములో వేదము నిత్యమని వినబడుచున్నది.

సిద్ధాంత శ్లో॥ వేద కర్త బ్రహ్మమే, ఎందులకనగా వేదము బ్రహ్మ యొక్క శ్వాస, నిఃశ్వాస రూపము. వేదము యొక్క నిత్యత్వము పూర్వ కల్పముతో సమానమగుట వలన చెప్పబడెను. అన్నింటిని ప్రకాశింపజేయు వేదకర్త బ్రహ్మమగుట వలననే వానిని సర్వజ్ఞుడందురు.

"అస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతదృగ్వేదో, యజుర్వేదః సామవేదః" ఈ పరమాత్మ యొక్క నిఃశ్వాస (నిట్టూర్పు) రూపముగా ఋగ్, యజుస్సామవేదములు ఉత్పన్నమైనవి. (బృ. 4.8.10) అను ఈ వాక్యము ఈ అధికరణమునకు విషయము. ఋగ్వేదాదులు నిత్య సిద్ధమైన బ్రహ్మ యొక్క నిఃశ్వాసమువలే అప్రయత్నముగా వెలువడెను. బ్రహ్మ వేదకర్తయా? కాదా? అనునది సందేహము. బ్రహ్మ వేదకర్త గాడు. వేదము నిత్యము గనుక "వాచా విరూప నిత్యయా". విరూపుడను పేరుగల ఓ దేవతా! నీవు నిత్యమగు వేదము ద్వారా నాచే స్తోత్రము చేయించుకొనుము. నిత్యమైనది వేదవాణియే "అనాది నిధనా నిత్యా వాగు త్పృష్టా స్వయంభువాc ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వా ప్రవృత్తయః "ఉత్పత్తి వినాశములు లేనట్టియు, శాశ్వతమైనట్టియు వేద రూపమగు వాక్కును బ్రహ్మ మొట్టమొదట లోకమునకు తెలిపెను. దాని ద్వారా సర్వలోక వ్యవహారములు ప్రచలితమయినవి. అవి స్మృతిలో చెప్పినందున వేద కర్త బ్రహ్మకాదు ఈ పూర్వ పక్షములకు సిద్ధాంతి ఉత్తరము. బ్రహ్మవేద కర్త అనుటకు అర్హుడు. ఏలననగా అప్రయత్నముగా, అనాయాసముగా, నిఃశ్వాసరూపముగా వేదము బ్రహ్మ నుండి వెలువడినది గనుక. "తస్మాత్ యజ్ఞాత్సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే (శుక్ల యజు, సం. 21.7) "యజ్ఞ స్వరూపుడైన బ్రహ్మము నుండి ఋగ్వేదమంత్రములు సామవేద మంత్రములు జనించెను. అన్ని యజ్ఞముల ద్వారా హవనమునకు యోగ్యమగుట ద్వారా యజ్ఞశబ్ధ వాచ్యమైన బ్రహ&్మఉ నందు స్పష్టముగా వేదముల ఉత్పత్తి శ్రుతులలో

వినబడుచున్నది. అప్రయత్నముగా జనించిననూ అర్థము తెలుసుకుని రచించెను. కాళిదాసాదుల ద్వారా రచించిన వాక్యముల కంటే విలక్షణమైనందున అపౌరుషేయము. ప్రతి కల్పమందు పూర్వమున ఎట్లున్నదో అట్లే తదనురూపముగా మంత్ర, పద, వర్ణములు మరియు స్వరములుండుట వలన ప్రవాహము వలె నిత్యము. వేదము సంపూర్ణ జగత్తు యొక్క వ్యవస్థను చూపించుట వలన, దాని కర్త బ్రహ్మమగుట వలన, వాని యందు సర్వజ్ఞత్వము నిరూపించబడినది.

**ద్వితీయ వర్ణక వ్యాఖ్యానము :**

17. "అస్తి అన్యమ ఏయతా పృస్య కింవాలైదిక మేయతా।
ఘట వత్సిద్ధవస్తుత్వాద్ బ్రహ్మాన్యేనాపి మీయతే॥

18. రూపలింగాది రాహిత్యాన్నాస్య మానాన్తర యోగ్యతా
తం త్వౌపనిషదేత్యాదౌ ప్రోక్తా వేదైక మేయతా॥

బ్రహ్మను తెలుపుటకు వేదమే ప్రమాణమా? లేక అన్యప్రమాణము కలదా? కుండవలె సిద్ధవస్తువగుట వలన అన్య ప్రమాణముల ద్వారా గూడ బ్రహ్మ అవగాహ్యమే.

రూపము, హేతువు మొదలుగునవి (జాతి, గుణ, కర్మ, శూన్యము) లేనందున వేదభిన్న ప్రమాణము ద్వారా బ్రహ్మ తెలిసికొనలేము. "నేను మిమ్ము ఉపనిషత్తులలో నున్న పురుషుని గురించి అడుగుచున్నాను. "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అను వాక్యములో వేదమొక్కటే ప్రమాణమని చెప్పబడినవి.

"తం త్వైపనిషదం పురుషం పృచ్ఛామి" (బృ. 3.9.26) అను శ్రుతి వాక్యము శాకల్యుని యజ్ఞ వల్క్యుడడిగినది. ఈ వాక్యములో పరబ్రహ్మరూపమైన పురుషుని ఉపనిషత్తుల ద్వారానే తెలుసుకొనబడుననునది స్పష్టమగుచున్నది. ఇది విషయవాక్యము, బ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణముల ద్వారా గమ్యమా? కాదా? అనునది సంశయము. పూర్వ పక్షము స్పష్టమే.

రూపరసాదులు బ్రహ్మమందు లేనందువలన ఇంద్రియముల ద్వారా తెలుసుకొనబడదు. హేతువు గాని హేతు సాదృశ్యము గాని లేనందున అనుమానము ద్వారా అగమ్యము. ఉపనిషత్తుల ద్వారానే తెలుసుకొనబడును. వేద జ్ఞానము లేని వాని ద్వారా ఆ పూర్ణ బ్రహ్మము మనన యోగ్యము గాదు. బ్రహ్మవేత్త గాని వాడు పరమధామము చేరలేడు. వ్యాపకమైన విష్ణువును విష్ణుక్రాంతుడందురు. ఆ వాసుదేవుని తెలుసుకుని తత్వదర్శియై విప్రత్వము పొందును. తత్వజ్ఞాని కాని విప్రుని యందు విప్రత్వము లేదు. శాట్యాయన ఉపనిషత్తులో ఈ విషయము 4వ మంత్రములో చెప్పబడినవి. ఈ మంత్రములో వేదముల ద్వారానే బ్రహ్మ తెలియునని చెప్పుచూ అన్య ప్రమాణ గమ్యమును నిషేధించిరి. జన్మాది సూత్రములో భాష్యకారులీవిధంగా చెప్పిరి. "శ్రుత్వాదయో అనుభవాదయశ్చ యథా సంభవం ఇహ ప్రమాణమ్॥. శ్రుత్యాదులు, అనుభవాదులు యథా సంభవము బ్రహ్మ జ్ఞానమునకు ప్రమాణములు. ఈ వాక్యములో ఆది పదము ద్వారా అన్య ప్రమాణములు భాష్యకారులు అంగీకరించిరనిన సరియే గాని ప్రథమములో శ్రుతులే ప్రమాణములు. శ్రుతుల ద్వారా ప్రమాణము గావించిన తదుపరి అనువాద రూపముగా అనుమానానుభవములను అంగీకరించిరి. గాన బ్రహ్మను చెప్పుటకు వేదములే ప్రమాణములు.

# 4. సమన్వయాధికరణము

సూత్రము : తత్తు సమన్వయాత్ (1.1.4)

సూత్రార్థము : వేదాంత వాక్యములు స్వతంత్రముగనే బ్రహ్మను బోధించుచున్నవి. కర్త మరియు దేవతల ద్వారా ఉపాసనాంగములు కావు.

**ప్రథమ వర్ణకము**

సంగతి : బ్రహ్మను గూర్చి చెప్పుటలో మీరు ఎట్లు శాస్త్ర ప్రమాణము గలదని చెప్పుచున్నారు. వేద వాక్యములు కర్మను ప్రతిపాదించుచున్నవి. అట్లు కర్మను ప్రతిపాదించని వాక్యములు అనర్ధకములు."ఆ మ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనర్థక్యం అతదర్థానామ్॥ (జై.సూ. 1.21) ఈ జైమిని మహర్షి వాక్యములో కర్మ పరకములు వేదాంత వాక్యములని చెప్పబడినవి. ఆక్షేప సంగతి :

విషయము : ఈ అధికరణములో అన్ని వేదాంత వాక్యములు విచారణీయములు.

సంశయము : వేదాంత వాక్యములు కర్మ మరియు దేవతలను ప్రతిపాదించుట వలన కర్మాంగములా? లేక బ్రహ్మను ప్రతిపాదించుట వలన బ్రహ్మ పరకములా? అని సంశయము.

పూర్వ పక్షము : కర్మానుష్ఠానము నందు ఉపయోగపడుట వలన వేదాంత వాక్యములు కర్త మరియు దేవతలను ప్రతిపాదించుచున్నవి.

సిద్ధాంతము : వేదాంతమనగా ఉపనిషత్తులు. కర్మను గూర్చి చెప్పుటలేదు. కర్మ కన్న భిన్నమైన ప్రకరణము కాన అవి కర్మ శేషములు ఆవు. కాని బ్రహ్మను బోధించుచున్నవి. తాత్పర్యమును నిర్ణయించు షడ్విధ తాత్పర్య లింగ ములనగా ఆయా హేతువులు. వాని ద్వారా గూడ వేదాంత వాక్యములు బ్రహ్మతత్వమునే బోధించుచున్నవి. అనర్థమగు అజ్ఞానమును నశింపచేయు స్వతంత్ర ప్రయోజనము గల వేదాంత వాక్యములను కర్మాంగములనుట సరికాదు.

వై.న్యా.మాల : 19 వేదాంతా : కర్తృ దేవతా పరాబ్రహ్మ పరా ఉత
అనుష్ఠానోపయోగిత్వాత్ కర్త్రాది ప్రతిపాదకాః

వేదాంత వాక్యములు కర్త మరియు దేవతాది పరకములా, లేక అనుష్ఠానము నందు ఉపయోగపడుట వలన కర్తృపరకములా?

వై.న్యా.మాల. 20. భిన్న కరణాల్లింగషట్కాచ్చ బ్రహ్మ బోధకాః।
సతి ప్రయోజనే అనర్థహానే అనుష్ఠానతో త్రకిమ్॥

వేదాంత వాక్యములు కర్మకాండ కన్న భిన్న ప్రకరణములు కనుక బ్రహ్మ బోధకములు. తాత్పర్య నిర్ణాయకములైన షడ్విధ చిహ్నముల ద్వారా వేదాంత వాక్యములు బ్రహ్మ తత్వమును బోధించుచున్నవి. అనర్థ కారణమైన అజ్ఞానమును తొలగించుట యను స్వతంత్ర ప్రయోజనముండుట వలన కర్మ శేషము లెట్లగును?

విషయ, సంశయములు స్పష్టములే. జీవుని గురించిన వాక్యములు కర్త పరములు. బ్రహ్మను గురించి చెప్పు వాక్యములు సాధనపరములు. ఈ విధముగ వేదాంత వాక్యములు అనుష్ఠానమునకు వచ్చుచున్నవి. వేదాంత వాక్యములు బ్రహ్మపరములైన అనుష్ఠానము నందు ఉపయోగమునకు రావు. అందుచే నిష్ప్రయోజనములు కావు. వేదాంత వాక్యములు కర్త దేవతా సాధన పరములు.

ఈ సంశయమునకు సమాధానము వేదాంత వాక్యములు బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవి. ఎందులకనగా కర్మ కన్న భిన్న ప్రకరణమైన జ్ఞాన కాండను ప్రతిపాదించుచున్నవి. అవి కర్తను గురించి గాని, కర్మ శేషత్వమును గురించి గాని బోధించుట లేదు. షడ్విధ తాత్పర్య లింగముల ద్వారా బ్రహ్మ పరత్వమని చెప్పుటయే సంభవము. తాత్పర్య గ్రాహక షడ్విధ లింగములను పూర్వా చార్యులీవిధముగా చెప్పిరి.

శ్లో॥ ఉపక్రమోపసంహారావభ్యాసో పూర్వతా ఫలమ్।
అర్థవాదోపపత్తీచ లింగం తాత్పర్య నిశ్చయే ॥

ఉపక్రమ ఉపసంహారములు, అభ్యాసము, అపూర్వతా, ఫలము, అర్థవాదము, ఉపపత్తి (యుక్తి) అను ఆరు తాత్పర్యము నిశ్చయించుటకు హేతువులు (చిహ్నములు). సోమ్య ఇదమగ్ర ఆసీత్" (ఛాం. 6.2.1) ఉపక్రమము : హే సోమ్యుడా! సృష్టికి ముందు సదాఖ్య పరబ్రహ్మమే యుండెను. "ఐత దాత్మ్యమిదం సర్వం తత్ సత్యం స ఆత్మా తత్వమసి" (ఛాం. 6.16.3) ఈ చరాచరాత్మక సర్వము ఆత్మస్వరూపమే. అదే సత్యము, అదే ఆత్మ, అదే నువ్వు. ఇది ఉపసంహారము. ఉపక్రమ ఉపసంహారములు రెండు కలిసి ఒక చిహ్నము. ఎందులకనగా బ్రహ్మ విషయకమైన ఏక వాక్యత ఉండుట వలన. అనేక సార్లు "తత్వమసి" అని చెప్పుట అభ్యాసము. నిర్గుణ, నిరాకార, అవిషయమైన బ్రహ్మము వేద ప్రమాణము ద్వారానే గమ్యము ఇతర ప్రమాణముల ద్వారా కాదు అనునది అపూర్వత. బ్రహ్మమమను, ఒక పదార్థ జ్ఞానము ద్వారా సర్వ జ్ఞానము ఫలము. ఉత్పత్తి, స్థితి, ప్రలయము, ప్రవేశము, నియమనము అను ఐదు అర్థవాదములు. అనగా స్తుతి పరములు. మృత్తి కాది దృష్టాంతములు యుక్తులు. ఈ హేతువుల ద్వారా వేదాంత వాక్యములు బ్రహ్మ పరములనియే నిశ్చయింపవలయును. వేదాంత వాక్యములందు అనుష్ఠానము లేనిచో ప్రయోజనము లేదనుట సరిగాదు. "రజ్జు రియం నాయం సర్పః" ఇది త్రాడు పాము కాదు" అను హేయోపాది శూన్యమైన సిద్ధవస్తువైనను దాని స్వరూపోపదేశము ద్వారా బోధ కలుగును. అట్టి స్వరూప బోధ నిరర్థకము గాదు. పైగా ఆ బోధ ద్వారా అజ్ఞానాదులైన అనర్థముల నివృత్తి సంభవము.

# ద్వితీయ వర్ణకము

శ్లో॥21 ప్రతి పత్తిం నిధిత్సన్తి బ్రహ్మణ్యవసితా ఉత
శాస్త్రత్వాత్తే విధాతారో మననాదేశ్చ కీర్తనాత్॥

ప్రవృత్యాది విధులను బోధించుచున్నది? లేక సిద్ధవస్తువు బ్రహ్మను ప్రతిపాదించుచున్నదా? శాసించుట వలన శాస్త్రమనబడును. శాస్త్రము విధి విశేషమును బోధించుచున్నది. శ్రవణము తరువాత మననాదులను విధించుట వలన, విధి విషయములను బోధించుచు వేదాంత శాస్త్రము బ్రహ్మ సంబంధము చెప్పుచున్నది.

శ్లో॥22 నా కర్తృ తంత్రే విధిః శాస్త్రత్వం శంసనాదపి।
మననాది పురాబోధాత్ బ్రహ్మణ్యవసితాస్తతః

సిద్ధ వస్తువునందు విధి ప్రవృత్తి లేదు. హితమునుపదేశించుట వలన గూడ శాస్త్రమందురు. మననాదులు సాక్షాత్కారమునకు ముందు చెప్పబడినవి. అందువలన వేదాంత వాక్యములు బ్రహ్మము నందే పర్యవసించుచున్నవి.

ఏకదేశిమతము : వేదాంత వాక్యములు బ్రహ్మ పరములైనను బ్రహ్మము నందే పర్యవసానమగుటలేదు. ఎట్లనగా? బ్రహ్మతత్వమును పరోక్ష రూపగా చెప్పిన తర్వాత అపరోక్షముగా పొందుటకు మననాదులను విధించుచున్నది. ఆ విధముగా శాసించుట వలన వేదాంతములను శాస్త్రమనుచున్నారు. "శ్రోతవ్యః" అని శబ్ధజ్ఞానాత్మకమైన శ్రవణమును విధించిన పిమ్మట మనన, నిధిధ్యాసములను అనుభవ జ్ఞానాత్మక స్వరూపములైన వానిని విధించిరి. కనుక వేదాంత వాక్యములు విధిశేషములు అని చెప్పగా, సమాధానము వేదాంత వాక్యములు విధి శేషములు కానేరవు. ఈ వేదాంత వాక్యములు చేయుటకు, చెయ్యకుండుటకు, విపరీతముగా చేయుటకు కర్మలవలె శక్యముగాదు. ఇవి వస్తు తంత్రములు పురుషాధీనములు గావు. అనుష్ఠేయములని చెప్పుట, అనుష్ఠేయములని శాసించుట మాత్రముచే శాస్త్రములని చెప్పు నియమము లేదు. సిద్ధ వస్తువులైన ఆత్మ, పరమాత్మలను చెప్పునది గూడ శాస్త్రమని చెప్పబడును. శబ్ధము ద్వారా జ్ఞానము కలిగిన తరువాత అనుభవమునకై మననాదులు విధించుట యుక్తము గాదు. "దశమఃత్వమసి" నీవు పదవవాడవు అన్నట్లు శబ్ధము ద్వారానే అపరోక్ష అనుభవ జ్ఞానము గలుగుచున్నది. అసంభావనా విపరీత భావనాదులను తొలగించుటకు వ్యాపార రూపమైన కర్త్రాధీనమైన మననాదులను శాబ్ధబోధమునకు ముందు విధించిరి. అందులకే "తత్వమసి" అది మహా వాక్యములు బ్రహ్మను బోధించుట యందే సమాప్తమగుచున్నవి.

సూత్రార్ధము : తు = పూర్వ పక్ష నిరాకరణము

తత్ = బ్రహ్మ సర్వజ్ఞము, సంపూర్ణ జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములకు కారణము

సమన్వయాత్ : చక్కగా, తాత్పర్యము ద్వారా, బ్రహ్మములోనే అన్ని వేదాంత వాక్యముల అన్వయము.

ఈ వేదాంత వాక్యములను కర్మ, ఉపాసనల పరముగా ఉపాసన చేసిన శ్రుతహాని అశ్రుత కల్పనా దోషముల ప్రసంగము వచ్చును. "బ్రహ్మన కర్తృ పరత్వం" బ్రహ్మ కర్త్రాధీనము గాదు. "తత్ కేన కం పశ్యేద్."

సర్వము ఆత్మ రూపమే అని తెలిసికొనిన ఏ పదార్థమును ఏ సాధనచే ఏ కర్త కనుగొనగలడు. పై శ్రుతిలో క్రియాకర్త ఫలములను నిరాకరించిరి.

శబ్ద జ్ఞానము తర్వాత అనుభవాత్మకమైన మనన నిధి ధ్యాసలు విధించిరి. "దశమస్త్వమసి" అను వాక్యము ద్వారా అపరోక్ష జ్ఞానము. బ్రహ్మోపాసన ద్వారా మోక్షమనిన అది సరిగాదు. బ్రహ్మ జ్ఞానము ద్వారా మోక్షము. సిద్ధ వస్తువునందు ప్రవృత్తి లేదు. శబ్ద శక్తి ద్వారా గ్రహించలేము అనిన సరికాదు. పుత్రస్తే జాతః అను హర్ష సూచకమును పద చిహ్నముల బట్టి చూచి భాషరాని మధ్యముడు తెలుసుకొనును. కన్యాతే గర్భవతి అను దుఃఖ సూచకమును గూడ శబ్ధశక్తి ద్వారా గ్రహించగలరు.

# 5. ఈక్షత్యధికరణము

క్రిందటి నాలుగు సూత్రములలో ఎవరికి బ్రహ్మాత్మైక్య జ్ఞానము పురుషార్థమో వారికి కర్మకాండ ప్రసక్తి లేకయే వేదాంత వాక్యములు బ్రహ్మను బోధించుచున్నవలవియు, బ్రహ్మము నందు సమన్వయమును పొందుచున్న వనియు చెప్పబడెను. ఆ బ్రహ్మమే సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడనియు, ఈ జగత్తునకు సృష్టి, స్థితి, లయ కారకుడనియు చెప్పబడినది.

సంగతి :బ్రహ్మము కూటస్థమగుట వలన విక్రియా రహితము. బ్రహ్మమందు క్రియాశక్తియే లేదు. క్రియాశక్తి లేని బ్రహ్మము జగత్కారణమెట్లగును. ఈ విధమైన ఆక్షేపము కలిగినందున ఈ అధికరణమారంభించిరి. పూర్వాధికరణములో దీనికి ఆక్షేపసంగతి.

విషయము : "సదేవసోమ్య ఇదమగ్రే ఆసీత్" ఏకమేవ్యాద్వితీయమ్" ఛాం. (6.2.1) సృష్టికి ముందు ఒక అద్వితీయమగు సద్ బ్రహ్మమూ మాత్రమే ఉండెను. అనుశ్రుతి వాక్యము విచారణీయ విషయము.

సంశయము : "తదైక్షత్ బహుస్యాం ప్రజాయేయేతి, తత్తేజో అస్రుజాత్ (ఛాం. 6.2.3). "అది సంకల్పించెను, నేను ప్రజలను సృష్టించెదను" అని. ఈ వాక్యము ద్వారా సాంఖ్యుల ప్రధానము చర్చించబడినదా? లేక బ్రహ్మమా? అని సంశయము.

పూర్వ పక్షము : జ్ఞానము మరియు క్రియాశక్తితో కూడిన జడవస్తువైన ప్రధానమే అన్నింటికి కారణము. సత్ శబ్దవాచ్యమీ ప్రధానమే.

సిద్ధాంతము : జగత్తు సృష్టించువానిని సంకల్ప క్రియకు కర్తగా చెప్పిరి. సంకల్ప క్రియ చేయువాడు చైతన్య ధర్మము గలవాడై ఉండవలయును. కాన సత్ శబ్ద వాచ్యము బ్రహ్మమే. ఈ చైతన్యముతో తాదాత్మ్యము చెందిన వారికి మోక్షము చెప్పిరి. ఈ విషయములు ప్రధాపక్షములకు విరోధములు.

### 5. ఈక్షతే ర్నా శబ్దమ్ (1.1.5)

బ్రహ్మమందు వికారము అసంభవము బ్రహ్మ శరీర రహితము. ఏకాత్మ రూపము. కనుక బ్రహ్మ జగత్కారణము కాజాలదు. అందువలన ఈ సూత్రము జెప్పిరి.

సూత్రార్థము : ఈక్షతేః = తదైక్షత అను శ్రుతి వాక్యములో జగత్ సృష్టికర్త యందు ఈక్షితృత్వము వినబడుచున్నది. ఈక్షితృత్వమనగా సంకల్పము సంకల్ప పూర్వక సృష్టి, హేతుగర్భ విశేషణము. న అశబ్దమ్ = ప్రధానము జగత్ కారణము కాదు. అది వేద బాహ్యము. శ్రుతి ద్వారా ప్రతిపాదించలేదు. గనుక

వైయాసిక న్యాయమాల (వై.న్యా.మా) (23) – తదైక్షతేతి వాక్యేన ప్రధానం బ్రహ్మ వోచ్యతే।

జ్ఞాన క్రియాశక్తి మత్వాత్ ప్రధానం సర్వకరణమ్। "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజో అసృజత" "సత్ శబ్దవాచ్యమైనది. బహుభవనమునకై సంకల్పించెను. అది అగ్నిని సృజించెను". ఈ వాక్యములో సృష్టికర్త ప్రధానమా? లేక బ్రహ్మమా? జ్ఞానశక్తి, క్రియాశక్తి కలిగిన ప్రధానము సృష్టి కారణమగును.

వై.న్యామా. 24. ఈక్షణాత్ చేతనం బ్రహ్మ క్రియా జ్ఞానేతు మాయయా।
ఆత్మ శబ్దాత్మ తదాత్మ్యే ప్రధానస్య విరోధినో॥

చైతన్య ధర్మము గలిగి సంకల్పము చేయగలిగిన బ్రహ్మమే జగత్ స్రష్టా. క్రియాశక్తి జ్ఞానశక్తి దానియందు మాయ ద్వారా సంభవములు. సత్‌శబ్ద వాచ్య తత్వమును ఆత్మశబ్దముతో చెప్పిరి. దానితో తాదాత్మ్యము చెందిన మోక్షప్రాప్తి చెప్పిరి. చైతన్యము, మోక్ష ప్రాప్తి, సంకల్పము, సత్ శబ్దము, సత్ శబ్దమును ఆత్మయనుట ఇవన్నియు, ప్రధానము జడమగుట వలన దానికి విరోధములు.

ఛాందోగ్యోపనిషత్తులో "సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయమ్" (6.21) "హేప్రియదర్శన సృష్టికి ముందు ఈ నామరూపాత్మక ప్రపంచము సజాతీయ విజాతీయ స్వగత బేధ శూన్యమైన కేవల సద్రూపమై ఉండెను" అని మొదలిడి. "తదైక్షత బహ/స్యాం ప్రజాయేయ" 6.2.3 సద్రూపమైన వస్తువు నేను అనేక రూపములుగా ఉత్పన్నమవుతానని సంకల్పించెను. ఇచట సాంఖ్యులీవిధముగా చెప్పుచున్నారు. జగత్కారణము బ్రహ్మ కానేరదు. ఆ ప్రధానములో రజోగుణము ఎక్కువగుట వలన క్రియాశక్తి మత్వము మరియు సత్వగుణము ఎక్కువైన సర్వజ్ఞత్వము సంభవమగును. నిర్గుణ కూటస్థ బ్రహ్మమునందు జ్ఞానశక్తి, క్రియాశక్తి అసంభవము. గనుక సృష్టికి కారణము కాజాలదు.

ఇచ్చట సిద్ధాంతి చెప్పుటదేమనగా, సంకల్ప పూర్వక సృష్టి వినబడుటచే చైతన్యమైన బ్రహ్మమే సత్ శబ్ద వాచ్యమైన సృష్టికర్త. అచేతనము జడమైన ప్రధానము నందు సంకల్పశక్తి అసంభవము మాయద్వారా బ్రహ్మమందు జ్ఞానశక్తి క్రియాశక్తి సంభవములు. "అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛాం. 6.3.2) "ప్రాణమును ధరించిన శరీరాధ్యక్షుడైన జీవాత్మరూపముతో లోపల ప్రవేశించి నామరూపములను సృష్టించెదును". నామ రూపములను ఉత్పత్తి చేయు కర్తను, జగత్ కారణ దేవతను, స్వవాచకమైన ఆత్మ శబ్దము ద్వారా చైతన్యమైన జీవుని ఉపదేశించిరి. అంతేగాక "తత్వమసి" అని చెప్పుచూ చైతన్యవంతుడైన శ్వేతకేతువును, జగత్ కారణముతో తాదాత్మ్యము గురువు ఉపదేశించెను. ఆత్మ శబ్ద ప్రయోగము, కారణ తాదాత్మ్యము ఈ రెండు విషయములు జడమైన ప్రధానము జగత్ కారణమైన సంభవము కానేరవు. అందువల్ల చైతన్యమైన బ్రహ్మమే సత్‌శబ్ద వాచ్యము.

ప్రధానైక్య సంపదుపాస ఫలము పూర్వపక్షము. బ్రహ్మాత్మైక్య జ్ఞానము జ్ఞేయమని సిద్ధాంతోపక్షము. ప్రధానమందు ఉన్నవని చెప్పిన గుణములు, జ్ఞానశక్తి, క్రియాశక్తి బ్రహ్మయందు మాయద్వారా సంభవములు.

ప్రధానము సృష్టికర్త కాదనుటకు సిద్ధాంతి తర్కమును చెప్పుచున్నాడు. సత్వ గుణోత్కర్షవల్ల ప్రధానమందు జ్ఞానశక్తి సర్వజ్ఞత్వము చెప్పిన వలన రజోగుణ తమోగుణ ఉత్కర్షవల్ల ఆ ప్రధాన మందు అల్పజ్ఞత్వము కల్గునని చెప్పవలయును. కాన సృష్టి కారణము కాజాలదు.

"తత్తేజో అస్రుజత తా ఆపః ఐక్ష్యంత" "అగ్ని సృష్టించెను, జలములు సంకల్పించెను" అను శ్రుతి వాక్యము ఉండుట వలన అగ్ని, జలము అను జడపదార్థములు. సృష్టించెను అను శ్రుతివాక్యముల వల్ల జడపధానము యొక్క సంకల్పము గౌణమని చెప్పవచ్చును గదా. దానికి సూత్రము.

### 6. గౌణశ్చేన్నాత్మశబ్దాత్ 1.1.6

సూత్రార్థము : శ్రుతిలో చెప్పిన ఈక్షణ శబ్దము గౌణమని చెప్పజాలము, ఎందులకనగా శ్రుతిలో జగత్కారణ కర్తయందు ఆత్మశబ్దము ప్రయోగించబడెను. జగత్కారణము చైతన్యము, ఈక్షణము ముఖ్యమే గాని గౌణము గాదు. "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆషీత్ ఏకమే వ్యాద్వితీయమ్". "తదైక్షత బహుస్వాం ప్రజాయేయ" తత్తేజో అస్రుజత" ఛాం. (6/2/1–3). ఓ సౌమ్యుడా! సృష్టికి ముందు ఈ జగత్తు సత్ పదార్ధమై యుండెను. అతడు సంకల్పించెను. అతడు అగ్నిని సృష్టించెను. సత్ శబ్ద వాచ్యమైన జగత్ కారణమునందు ఆత్మ శబ్ద ప్రయోగము వల్ల "తదైక్షత" అనుచోట తద్ అనునది సర్వనామ శబ్దము. సర్వము బ్రహ్మము, దాని నామము తద్ అని, దాని భావమే తత్త్వమ్. అది బ్రహ్మ యొక్క యథాత్మ్యమ్. దానినే చూచు స్వభావము గలవారు తత్వదర్శులు.

ఈక్షణ చేసి అగ్ని, జలము, భూములను సృష్టించిన ఆ సృష్టికర్తను దేవతా శబ్దముతో పరామర్శించి, శ్రుతిలో "అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్వ నామ రూపే వ్యాకరవాణి" అని చెప్పిరి. (ఛాం. 6.3.2) ఇచ్చట కూడ జగత్కారము ఆత్మ శబ్దము వినబడుచున్నది. ప్రధానము సృష్టికర్తయైన దేవతా శబ్దముతో పరామర్శించి యుండవలయును. కాని "జీవాత్మనా" అనిరి. జీవుడనగా (చైతన్యము) ప్రాణము ధరించిన శరీరాధ్యక్షుడని అర్థము. అచేతనమైన ప్రధానము ఆత్మ శబ్దార్థము కానేరదు.

ఆత్మ కార్యములన్నీ చేయు అచేతన ప్రధానమందు ఆత్మ శబ్ద ప్రయోగము గావించిరనవచ్చును గదా. ఎట్లనిన రాజుగారు తన కార్యములన్నీ చేయు భద్రసేనుడు అను సేవకుని యందు "మమాత్మా భద్రసేనః" భద్రసేనుడు నా ఆత్మయే అని ప్రయోగించినట్లు, ప్రధానము ఆత్మ యొక్క (పురుషుని) భోగ, మోక్షముల కార్యము నిర్వహించుననిన ప్రశ్నకు ఈ సూత్రమును చెప్పిరి.

### 7. తన్నిష్ఠస్య మోక్షపదేశాత్ 1.1.7

సూత్రార్థము : జగత్కారణమైన బ్రహ్మయొక్క ఐక్యజ్ఞానము వలన పురుషునికి మోక్షపదేశము శ్రుతి ఉపదేశించుచున్నది. అచేతన ప్రధానైక్య జ్ఞానము వలన మోక్షము దొరకదు. ప్రధానము సృష్టి కారణము గాదు అని చెప్పుటకు 'న' కారము పూర్వ సూత్రము నుండి అనువర్తించును"స ఆత్మా" "అది ఆత్మ" అని అతి సూక్ష్మ ఆత్మ తత్వమును గైకొని, ఓ శ్వేత కేతు "తత్వ మసి" అదే నువ్వు, అనువాక్యము ద్వారా ముముక్షువైన శ్వేతువునకు ఆత్మనిష్ఠను ఉపదేశించిరి. ఆచరణవంతులైన పురుషులు ఆ బ్రహ్మను తెలుసుకుందురు. "ఆ జ్ఞానికి కైవల్య ప్రాప్తికి

ప్రారబ్ధ పరిసమాప్తి యే అవధి" (చాం. 6.14.2) అని మోక్షపదేశము. చేతనమైన ముముక్షువునకు జడప్రధాన నిష్ఠ అసంభవము. అట్టి అనర్థ ఉపదేశముచే సాంఖ్యశాస్త్రము అప్రమాణము. కాన ఆత్మ శబ్దము చైతన్యపరము.

**8. హేయత్వా వచనాచ్చ (1.1.8)**

సూత్రార్థము : నకారము అనువర్తించును. ప్రధానము జగత్కారణము కాజాలదని చెప్పుటకు. ఈ ఆత్మోపదేశము స్థూల అరుంధతీ న్యాయమున ప్రధానమనిన అది సరిగాదు. స్థూల అరుంధతీ న్యాయము ద్వారా ప్రధానము నిషేధించలేదు. అందువల్ల ప్రధానము సత్‌శబ్ద వాచ్యము గాదు.

"స ఆత్మ తత్త్వమసి" అన్నచోట సత్‌శబ్ద వాచ్యము ప్రధానమనిన, ప్రధానమును ఉపదేశించవలయును. ముఖ్య ఆత్మను ఉపదేశించుటకు శాస్త్రము స్థూల అరుంధతీ న్యాయము ద్వారా ఆత్మను ఉపదేశించిన ప్రధానమును పరిత్యజించామని చెప్పలేదు. సత్‌మాత్రమైన ఆత్మ జ్ఞానము మరియు దానియందు నిష్ఠ చెప్పి ఆరవ అధ్యాయము ముగించిరి. కారణ జ్ఞానము ద్వారా అన్ని కార్యజ్ఞానములు కలుగునని ప్రతిజ్ఞ చేసిరి. అనగా ఆత్మజ్ఞానము ద్వారా సర్వజ్ఞానము ప్రధానమును త్యజించమని చెప్పిన ఈ ప్రతిజ్ఞకు విరోధము కలుగును. అందువలన ప్రధానము సత్ శబ్ద వాచ్యము గాదు.

పై నాలుగు సూత్రములలో ప్రధానమునకు 'ఈక్షణ' క్రియను నిరసించి, అది జగత్కారణము కాదని ఖండించిరి. ఇపుడు స్వతంత్ర హేతువుల ద్వారా ప్రధానమును జగత్కారణముగా నిరసించుటకు (అగ్రిమ) ముందు మూడు సూత్రములను చెప్పుచున్నారు.

**9. స్వాప్యయాత్ (1.1.9)**

సూత్రార్థము : "న" అనువర్తించును. ప్రకృత సత్ శబ్ద వాచ్యమైన ఆత్మయందు నిద్రలో ఈ జీవుడు ఒకటౌచున్నాడు. "సతా సౌమ్య తదా సంపన్నోభవతి" "స్వమపీతోభవతి" (బాం. 6.8.1) ఇచ్చట లయము వినిపించుచున్నది. మరియు స్వశబ్దముతో ఆత్మనే చెప్పుచున్నారు. "అపీతః" అనగా లయమని అర్థము స్థూల, సూక్ష్మ ఉపాదులు ఉపరమము కాగా సుషుప్తిలో అజ్ఞానము తప్ప ఉపాధి విశేషము లేనందున, ఆ ఆత్మచైతన్యములో అన్ని ప్రాణులు విలయమగుచున్నవి. ఆ చైతన్యమునే సత్ శబ్దముతో, జగత్కారణముగా చెప్పిరి, కాని ప్రధానము కాదు.

**10. గతి సామాన్యాత్ (1.1.10)**

సూత్రార్థము : అన్ని వేదాంత వాక్యములలో చెప్పు జ్ఞానము సామాన్యము. అన్ని ఉపనిషత్తులలో జగత్కారణము చైతన్యమనే చెప్పబడినది. జడ ప్రధానము కారణము కాదు. "న" అనువర్తించును. "ఆత్మనః ఆకాశః సంభూతః" (తై. 27) "ఆత్మన పవ ఇదం (పవేదం) పరమ్" (భాం. 7.26.1) "ఆత్మనః ఏషో షాణో జాయతే" (ప్రశ్న. 3.3) అనగా "ఆత్మ నుండి ఆకాశము ఉత్పన్నమైనది". "ఆత్మ నుండి ఈ సంపూర్ణ సంసారముత్పన్నము" "ఆత్మ నుండి ఈ ప్రాణము పుట్టెను". ఇలాంటి అన్ని వేదాంత వాక్యములు చైతన్యమును జగత్కారణముగా ప్రతిపాదించుచున్నవి. ఈ గతి సామాన్యము వలన సర్వజ్ఞ బ్రహ్మమే జగత్కారణము.

**11. శ్రుతత్వాచ్చ (1.1.11)**

సూత్రార్థము : "సకారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చిద్ జనితా నబాధిపః" (శ్వే. 6.9) అను శ్రుతిలో జగత్కారణము సర్వజ్ఞ బ్రహ్మమని చెప్పబడినది. అందువల్ల బ్రహ్మమే జగత్కారణము. ప్రధానము గాదు. ప్రధానమునందు వేదాంత వాక్యముల సమన్వయము కానేరదు. ఎందువల్లననగా 'శ్రుతత్వాచ్చ'. పైన చెప్పిన శ్వేతాశ్వర వాక్యములో సర్వజ్ఞ ఈశ్వరుని ప్రసంగము చెప్పుచు "ఆ ఈశ్వరుడే జగత్కారణము, ఇంద్రియములకు అధిపతి, జీవులకు అధిపతి, వానిని శాసించువారు గాని, వాని జన్మకు కారణము గాని వేరొకరు లేరు" కనుక సర్వజ్ఞ ఈశ్వరుడే జగత్కారణము. ప్రధానము కాదు.

# 6. ఆనందమయాధికరణము (12-19)

ఇంతవరకు బ్రహ్మ విచారమునకు ఉపనిషత్తులే ప్రమాణములనియు, అవన్నియు ఆ పరమేశ్వరుని గూర్చి చెప్పుచున్నవనియు సిద్ధాంతము చేయబడినది. ఉపనిషద్ వాక్యములు నిర్విశేష బ్రహ్మ పరములు.

**ఏకదేశిమతము :-**

సంగతి : క్రిందటి అధికరణములో ఈక్షణము గౌణమని చెప్పబడినది. అట్లే "ఆత్మా నందమయః" (తై 2.5) అను వాక్యములో మయట్ ప్రత్యయము వికారార్థమగుటచే తత్వ నిర్ణయము గాదని చెప్పుచు ప్రత్యుదాహరణ సంగతి కలదనిరి.

విషయము : "త్మానందమయః" "ఆనంద వికారమగు ఆత్మ జీవుడు" అను తైత్తిరీయ వాక్యము విచారణీయము.

సంశయము : "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను వాక్యములో మొదలు బెట్టిన ప్రకరణములో గల ఆనందమయః అను శబ్దము ద్వారా బ్రహ్మము చెప్పబడినదా? లేక వేరొక పదార్థము ఆనందమయ వాచ్యముగా చెప్పబడినదా?

పూర్వపక్షము : వికారార్థమైన మయట్ ప్రత్యయము వల్ల బ్రహ్మ విభిన్నమైన వేరొక పదార్థము చెప్పబడినది. దానికి ప్రియ మోద ప్రమోదములు అవయవములు.

సిద్ధాంతము : పునరావృత్తి మరియు ఉపక్రమములను దృష్టిలో ఉంచుకుని చూసిన, ఆనందమయమును పదమునకు బ్రహ్మమనియే అర్థము. ఇచ్చట ప్రయోగించిన మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థములో గాని వికారార్థములో గాదు. నిరవయవ విశుద్ధ బ్రహ్మము నందు ప్రియాది అవయవములు ఆరోపింపబడినవి. అవి పరమార్థ దృష్టిలో లేవు.

వై.న్యా.మా. 25. సంసారి బ్రహ్మవా ఆనందమయః సంసార్యయా భవేత్।
వికారార్థమయట్ శబ్దా త్రియాద్యవయవోక్తితః॥

సత్యం జ్ఞానమనం బ్రహ్మ అనువాక్యము ద్వారా ఉపక్రమించిన బ్రహ్మమే ఆనందమయ శబ్దవాచ్యమా? లేక సంసారి జీవుడా? వికారార్థమైన మయట్ శబ్ద ప్రయోగము వలనను ప్రియమోద ప్రమోదములు చెప్పుటవలనను బ్రహ్మభిన్నమైన సంసారి జీవుడని పూర్వపక్ష నిర్ణయము.

వై.న్యా.మా. 26. అభ్యాసోపక్రమాదిభ్యో బ్రహ్మ నన్దమయో భవేత్।
ప్రాచుర్యార్థో మయట్ శబ్దః ప్రియద్యాఃస్యు రూపాధిగాః॥

పునరావృత్తి ఉపక్రమాదులను పర్యవేక్షించిన ఆనందమయ అనుపదమునకు బ్రహ్మమనియే అర్థము చెప్పవలయును. 'మయట్' ప్రత్యయమిచట (వికారార్థములో కాదు) ప్రాచుర్యార్థములో చెప్పిరి. విశుద్ధ నిరవయవ బ్రహ్మమందు ప్రియాది అవయవములు ఔపాధికమని ఏకాదేశిమతము.

ఈ ఆరవ అధికరణము ముందు ఏకదేశిమతాను సారము చెప్పిరి. తైత్తిరీ యోపనిషత్తులో దేహ, ప్రాణమన, బుద్ధి, ఆనందరూపములను, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయమును పేర్లతో పంచకోశములను క్రమముగా ఒకదానిలోపల వేరొకటి చెప్పిరి. అన్నింటికన్నా లోపలనున్న ఆనందమయ కోశము సంసారి జీవుడా లేక పరమాత్మయా అని సందేహము.

సంసారి జీవుడే ఆనందమయము. ఎందులకనగా, ఆనందము యొక్క వికారమే ఆనందమయము వికారార్థము సంసారి యందు సంభవము అవికారమైన పరమాత్మ యందు సంభవము కాదు. ఆ ఆనందమయమునకు ప్రియము శిరము, మోదము దక్షణ పక్షము (రెక్క). ప్రమోదము ఉత్తర పక్షము, ఆనందము శరీర మధ్య భాగమైన ఆత్మ. బ్రహ్మ పుచ్ఛము (తోక అనగా ఆధారము) (తై. 2.5). ఇట్లు ఆనందమయమునకు ఐదు అవయవములు చెప్పిరి. కోరుకున్న ఆవశ్యకమైన వస్తువును చూచుట ద్వారా వచ్చు సుఖమును ప్రియమందురు. అది దొరికిన వచ్చు సుఖమును మోదమందురు. దానిని అనుభవించుటచే వచ్చు సుఖమును ప్రమోదమందురు. అజ్ఞానోపాధి ద్వారా సుషుప్త్యాదులలో కలుగు సుఖమును ఆనందమందురు. నిరుపాధిక సుఖము బ్రహ్మమము ప్రియాది ఐదు అవయవములను తల ఱెక్కలు తోకలతో పోల్చుట ఉపాసన సౌలభ్యమునకు పక్షి రూపముగా చెప్పిన ఆనందమయమునకు తల ఱెక్కలు మూడవయవములు. ఆత్మ శబ్దము ద్వారా శరీర మధ్యభాగము నాలుగవ అవయవముగా చెప్పిరి. పుచ్ఛము మిగిలిన భాగము. అది ఆధారము. మనిషికి ఆధారము పాదములు. అదే ఐదవ అవయవము. కాని అంశములేని పరమాత్మయందు అవయవములు కల్పించుట యుక్తము కాదు. అందువల్ల ఆనందమయము ఆ సంసారియే ఈ విధముగా చెప్పినదానికి సమాధానము. ఆనందమయము పరమాత్మయే ఎందులకనగా అనేకసార్లు పునరావృత్తి చెప్పుట వలన. "సైషా ఆనందస్య మీమాంసా భవతి" ఈ విధముగా ఆనందము యొక్క పూజ్య విచారము జరుగును. "పతమానందమయ మాత్మానముప సంక్రామతి" ఈ ఆనందమయ ఆత్మను జీవుడు పొందుచున్నాడు. ఈ విధముగా ఆనందమయము యొక్క పునరావృత్తి చెప్పబడెను. వేదాంత వాక్యముల తాత్పర్యము బ్రహ్మమందే అని చెప్పియుంటిమి. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అన ఉపక్రమములో బ్రహ్మను చెప్పి, "ఇదం సర్వ మసృజిత" ఈ దృశ్యమాన సంపూర్ణ జగత్తును సృష్టించెను. సర్వమూ సృష్టించుట వలన కూడ ఆనందమయము బ్రహ్మ. "మయట్" (వికారార్థము) ప్రత్యయము బ్రహ్మమునందు యుక్తియుక్తము

గాదు. ప్రాచుర్యార్థము సంభవము. ప్రియాది అవయవములు కూడ విషయ దర్శనము ద్వారా ఉపాధి ఉన్న తత్వమునకే కలుగును. అందువల్ల ఆనందమయము పరమాత్మయే అని ఏకదేశిమతము.

**వృత్తికారమతానుసారము సూత్రముల వ్యాఖ్యానము :-**

**12. ఆనందమయో అభ్యాసాత్ (1.1.12)**

సూత్రార్థము :- ఆనందమయ శబ్దమునకు అర్థము పరమాత్మయే. ఎందులకనగా పరమాత్మయందు ఆనందశబ్దము బ్రహ్మ అర్థములో అనేకసార్లు ఆవృత్తి గావించిరి గనుక. ఈ అధికరణములో ఆనందమయ రూపముగా జీవుని ఉపాసన అని పూర్వపక్షమైన నిర్విశేష బ్రహ్మను అభేద రూపముగా సాక్షాత్కరించుకొనుట అని సిద్ధాంతము.

తైత్రిరీయోపనిషత్తులో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు క్రియముగ చెప్పిరి. "అన్యోన్తరాత్మా ఆనందమయః" ఆ తరువాత విజ్ఞాన మయ కోశమునకు లోపల దానికన్న భిన్నమైన ఆత్మ ఆనందమయ కోశము గలదనిరి. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను ప్రకృతి పరబ్రహ్మమును ఆనందమయ శబ్దముతో చెప్పుచున్నారా? లేక బ్రహ్మ భిన్నమైన అముఖ్య ఆత్మను చెప్పుచున్నారా? అని సంశయము. ఎందులకనగా అన్నమయాది అముఖ్య ఆత్మ ప్రవాహములో ఆనందమయ శబ్దము వచ్చినది గనుక బ్రహ్మ భిన్నవస్తువుని చెప్పిరని పూర్వపక్షము.

సిద్ధాంతి పరమాత్మయే ఆనందమయ శబ్దార్థమనెను. ఎందులకనగా పరమాత్మయందే ఆనందమయ శబ్దమును అనేకసార్లు ప్రయోగించిరి. ఆనందమయ ప్రసంగములో "రసం హ్యేవాయం లబ్ధ్వా ఆనంద భవతి" ఈ జీవుడు రసమును పొంది ఆనందించుచున్నాడు. "యదేష ఆకాశ ఆనందో నస్యాత్" "ఈ సుఖస్వరూపుడైన పరమాత్మ హృదయాకాశములో లేనిచో ఈ జీవుడు ఎట్లు ఆనందమును పొందును". "ఏష హ్యేవానందయాతి" ఈ పరమాత్మయే లోకమును సుఖపెట్టుచున్నాడు. ''(తై 2.7) సైషానందస్య మీ మాంసా'' ఆనందవిచారమిదియే. "పతమానందమయమాత్మానముప సంక్రామతి" జ్ఞాని ఈ ఆనందమయమాత్మను దాటును. అనగా దానితో తాదాత్మ్యమును వదిలివేయును (తై 2.8)

ఇట్లు అనేక వాక్యములలో ఆనందశబ్దము బ్రహ్మ పరముగా చెప్పిరి. అందువల్ల ఆనందమయాత్మ బ్రహ్మమే. అముఖ్య ఆత్మ ప్రవాహములో చెప్పుట వల్ల ఆనందమయము ముఖ్యముగాదనిన? అది సరిగాదు. అన్నమయాదులలో అంతరాత్మగా ఆనందమయమున్నది స్థూల అరుంధతీ న్యాయముతో అన్నమయాదులకు సర్వాంతరము గనుక ఆనందమయము పరమాత్మయే.

ఆనందమయములో 'మయట్' ప్రత్యయార్థము వికారము.

**13. వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్ 1.1.13**

సూత్రార్థము : 'మయట్' ప్రత్యయము వికారార్థములో గనుక ఆనందమయ శబ్దమునకు అర్థము బ్రహ్మము కాదనిన అట్లనుట సరిగాదు. ఎందులకనగా ప్రాచుర్యార్థములో 'మయట్' ప్రత్యయ విధానము గలదు. అందువలన ఆనందమయ శబ్దము పరబ్రహ్మమే.

నిర్వికార బ్రహ్మమునందు వికారము లేదనిన అన్నవికారము అన్నమయ శరీరమువలె చెప్పవచ్చును గదా. 'తత్ ప్రకృతవచనే మయట్' ప్రాచుర్యార్థములో పాణిని మహర్షి 'మయట్' ప్రత్యయము చెప్పిరి. 'తస్య వికారః' సూత్రము ద్వారా ఇచ్చట వికారార్థము గాదు. "అన్నమయో యజ్ఞః" అన్నచోట అన్న ప్రచురితవలె. ప్రచురమనుష్యానందము నుండి ప్రారంభించి వందరెట్లు, వందరెట్లు ఆనందమును ఎక్కువగా చెప్పుచు నిరతిశయ ఆనందము బ్రహ్మానందమనిరి. అందు ప్రాచుర్యార్థములో 'మయట్' అనిరి.

'మయట్' ప్రత్యయాము ప్రాచుర్యార్థములో చెప్పుటకు కారణాంతరము.

### 14. తద్ధేతు వ్యపదేశాచ్చ (1.1.14)

సూత్రార్థము : "ఏషహ్యేవానందయాతి" ఈ ఆనందమయ బ్రహ్మమే పరిపూర్ణ విశ్వమునకు ఆనందమును ఇచ్చుచున్నది. అందరి ఆనందమునకు బ్రహ్మమే కారణము. అందువల్ల ఆనందమయ శబ్దార్థము పరబ్రహ్మయే. అందరి ఆనందమునకు బ్రహ్మ కారణమని చెప్పుటవల్ల ప్రాచుర్యార్థములోనే మయట్ ప్రత్యయము. ఆనందమున్న వాడే వేరొకరికి ఆనందమీయగలడు. ఎట్లనగా డబ్బున్నవాడే పంచగలడు.

### 15. మాంత్ర వర్ణిక మేవ గీయతే (1.1.15)

సూత్రార్థము : "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై. 2. 1) ఈ మంత్రములో నిర్ణయించిన బ్రహ్మమే "అన్యోన్తరాత్మానందమయః" అనువాక్యములో చెప్పిరి. ప్రకారము ద్వారా అదే ప్రాప్తము. అందువల్ల ఆనందమయ శబ్దార్థము బ్రహ్మమే.

"బ్రహవిదాప్నోతి పరమ్" "బ్రహ్మను అనుభవించిన వాడు బ్రహ్మమునే పొందుచున్నాడు. అని ఉపక్రమించి (బ్రహ్మము సత్యమును జ్ఞానమును అనంతమునై యున్నది) తై. 2. 1 అని విశేషణములతో నిర్ణయించిరి. ఇది మంత్రవాక్యము. దీనినే బ్రాహ్మణ వాక్యములో "అన్యోంతరాత్మానందమయః" వేరొక ఆత్మ ఆనందమయములోపల నున్నదనిరి. మంత్ర బ్రాహ్మణములకు ఏక వాక్యత్వములేనిచో శ్రుతహాని అశ్రుత కల్పనా దోషము కల్గును గనుక ఆనందమయము పరమాత్మ.

### 16. నేతరోనుప పత్తేః (1.1.16)

సూత్రార్థము : ఆనందమయము జీవుడు గాదు (నేతరః) ఎందులకనగా 'సో కామయత" అను శ్రుతివాక్యములో పరమాత్మ యొక్క సృష్టి సంకల్పము వినిపించుచున్నది. అది జీవునికి అసంభవము. అందువల్ల ఆనందమయము పరమాత్మయే.

జీవుడు ఎందులకు ఆనందమయము కాదు అనిన యుక్తి సంగతము గాదు గనుక (అనుపపత్తేః). ప్రకృత ఆనందమయ ప్రసంగమునకు విరోధము వచ్చును. ఆనందమయ ప్రసంగము వదలిపెట్టి ఆ పరమాత్మ సంకల్పించెను. నేను అనేక రూపములలో ప్రజలుగా రూపొందును గాక సృష్టికి పూర్వము సృష్టించవలసిన వికారములు సృష్టికర్తకు అభిన్నము. మరియు కామ సంకల్పమునకు జీవుడనిన విరోధము కలుగును. అందువల్ల సర్వవికారముల సృష్టి పరమాత్మకన్న భిన్నమైన వానిలో చెప్పిన యుక్తి సంగతము కానేరదు.

### 17. భేద వ్యపదేశాచ్చ (1.1.17)

సూత్రార్థము : "రసం హ్యేవాయం" అనుశ్రుతిలో ఆనందమయము. జీవునికన్న భిన్నమైన పరమాత్మలో చెప్పబడెను.

ఆనందమయము జీవుడు గాదు. "రసోవైసః రసం హ్యేవాయా లబ్ధ్వా నంద భవతి" పరమాత్మ రస స్వరూపుడు. ఆ రస స్వరూపమైన ఆనందమును పొంది ఈ జీవుడు ఆనందితుడగుచున్నాడు. ఇచట ఆనందము పొందువాడు జీవుడు, పొందబడేది ఆనందమయము పరమాత్మయని భేదరూపముగా ఉపదేశించిరి. ఎచ్చటనూ పొందువాడు, పొందబడేదిగా కానరాదు. అచ్చట కూడ ఉపాధి భేదమునననుసరించి "భేద వ్యపదేశాచ్చ" అనిరి. అందువల్ల పారమార్థిక భేదము (భిన్నత్వము) శంకింపరాదు. అట్లనిన ఆనందమయము ప్రధానమని చెప్పిన

### 18. కామాచ్చ నానుమానాపేక్షా (1.1.18)

సూత్రార్థము : "సోకామయత" అను శ్రుతివాక్యములో ఆనందమయమును సంకల్పము చేయువాడనిరి. కాన అనుమానము ద్వారా నిశ్చయించు సాంఖ్యుల ప్రధానము ఆనందమయము కానేరదు.

అంతేగాక "ఈక్షతే ర్నాశబ్దమ్" అను సూత్రములో ప్రధాన కారణవాదము నిరాకరించిరి. మరల దాని ప్రసంగము సరికాదనుట సరిగాదు. ఎందులకనగా కామనా కర్తృత్వాదుల శ్రవణమువల్ల ఈ ప్రసంగములో మరల ప్రధానము నిరాకరించుట దోషముగాదు.

### 19. అస్మిన్నస్యచ తద్యోగం శాస్తి (1.1.19)

| | | |
|---|---|---|
| సూత్రార్థము చ | = | ఆనందమయములో |
| అస్య | = | ముముక్షువు యొక్క చిత్తము |
| తద్యోగం | = | ముక్తితో అభేదము |
| శాస్తి | = | చెప్పుచున్నది. |

ఇందువల్ల గూడ అనందమయ శబ్దార్థము జీవ, ప్రధానములు కానేరవు. ఆనందమయమును తెలుసుకున్న జీవునికి దానితో ఏకత్వము శ్రుతి చెప్పుచున్నది. జడ ప్రధానము చైతన్యముతో ఏకీభవించలేదు.

"యదా హ్యేవైష సితస్మిన్ అదృశ్యే నాత్మ్యే నిరుక్తే అనిలయనే భయం ప్రతిష్ఠాం విన్దతే" (తై 2.7) ఎప్పుడు ఇంద్రియ అగోచరము, అసంగము, వాణికి అవిషయము మరియు అవినాశియైన ఆత్మయందు ఈ జీవుడు ప్రతిష్టితమగునో అప్పుడు ఆనందమయ స్వరూపుడైన పరమాత్మలో లేశమైనను భిన్నత్వము చూడడు. అభయమును పొందును. సంసారము నుండి ముక్తుడగునని శాస్త్రము. "తదాత్మనా యోగః తద్యోగః తద్ భావాపత్తిః = ముక్తిః" ఆత్మముతో ఏకత్వం తద్యోగమనిరి. దానినే ముక్తి అందురు. ఆ ముక్తి పరమాత్మను గ్రహించుటవలననే సరి, కాని ప్రధాన జీవుని గ్రహించుట వలన గాదు. అందువల్ల ఆనందమయమే పరమాత్మయని ఏకదేశిమతము.

# భగవద్పాదుల సైద్ధాంతిక మతము

సంగతి : అగ్ని జలముల ఈక్షణము గౌణమనియు ముఖ్య ఈక్షణ కర్త బ్రహ్మమనియు నిర్ణయింపబడినది. పుచ్ఛ శబ్దము అవయవార్థమైనను నిశ్చయార్థ నిర్ణాయకము కాజాలదు. ఈ విధముగా పూర్వాధికరణముతో ఈ అధికరణమునకు ప్రత్యుదాహరణ సంగతి.

విషయము : సిద్ధాంత పక్షములో 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అను వాక్యము (తై. 2.5) విచారణీయము.

సంశయము : ఆనందమయ కోశమునకు తోక రూపములో చెప్పిన ఈ శ్రుతివాక్యము ప్రధానముగా బ్రహ్మమును ఉపదేశించుచున్నదా? లేక వేరొక దానికి అంగరూపముతో చెప్పుచున్నదా?

పూర్వపక్షము : బ్రహ్మము ఆనందమయకోశమునకు అంగము. ఎందులకనగా తోక అంగరూపములో ప్రసిద్ధము.

సిద్ధాంతము : నిరవయవ బ్రహ్మము నందు పుచ్ఛము సంభమము గాదు. పుచ్ఛ శబ్దమునకు 'ఆధారము' అని లక్షణార్థము గావింపవలయును. ఆనందమయ శబ్దమునకు జీవమని అర్థము. అది బ్రహ్మను ఆశ్రయించియున్నది. కనుక పుచ్ఛ వాక్యములో బ్రహ్మ ప్రధానముగనే చెప్పిరి.

వై.న్యా.మా. 27 అన్యాంగం స్వప్రధానం వా బ్రహ్మ పుచ్ఛమితి శ్రుతమ్।
స్వాదానందమయస్యాంగం పుచ్ఛే అంగత్వ ప్రసిద్ధితః॥

బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా అనుచోట వినబడు బ్రహ్మ ఆనందమయమునకు అంగముగా నిర్దేశించిరా? లేక బ్రహ్మమునే ప్రాధాన్యముగా ప్రతిపాదించిరా? అని సంశయము. బ్రహ్మ ఆనందమయమునకు అంగము అంగముగా ప్రసిద్ధము గనుక పుచ్ఛమనగా తోక.

వై.న్యా.మా. 28. లాంగులా సంభవాదత్ర పుచ్ఛే న్యాధార లక్షణా।
ఆనందమయ జీవ్యోస్మిన్ ఆశ్రిత్యోతః ప్రధానతా॥

నిరవయవ బ్రహ్మమందు పుచ్ఛత్వమ సంభవము. అందువల్ల పుచ్ఛ శబ్దమునకు లాక్షణికముగా ఆధారార్థము చెప్పవలయును. ఆనందమయ శబ్దమునకర్థము జీవుడు ఈ జీవుడు బ్రహ్మాశ్రితుడు. అందువల్ల పుచ్ఛరాక్యము నందు బ్రహ్మమునే ప్రధానముగా చెప్పిరి.

సిద్ధాంతి తనమతానుసారము అధికరణమును చెప్పుచున్నారు. "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అను వాక్యములో వినబడు బ్రహ్మ శబ్దమును ఆనందమయమునకు అంగముగా నిర్దేశించిరా? లేక బ్రహ్మను ప్రధానముగా ప్రతిపాదించిరా? అని సంశయము. ఆనందమయమునకు అవయవరూపము చెప్పినందువల్ల లోకములో పుచ్ఛ శబ్దము అవయవరూపములో ప్రసిద్ధము గనుక బ్రహ్మ ఆనందమయమునకు అంగము దానికి సిద్ధాంతి సమాధానము : పుచ్ఛ శబ్దము అవయవము గాదు. కాని లాంగూలవాచి అనగా తోక. ఆనందమయమునకు తోక సంభవము గాదు. ఒకవేళ సంభవమనినను యోగ్యతను బట్టి ఆధారమని లక్షణార్థము చెప్పవలయును. జీవుని యొక్క

ఆనందమయ కోశమునకు బ్రహ్మము ఆధారము. జీవకల్పనకు బ్రహ్మమే ఆధారము గనుక ఆనందమయకోశము పరమాత్మగాదు. "మయట్" ప్రత్యయమునకు ప్రాచుర్యార్ధము చెప్పుట గూడ కుదరదు. ఎందులకనగా ఆనందప్రచురత అనిన అల్ప దుఃఖము గలదని అర్ధము గనుక. అందువల్ల జీవుని కాధారమైన బ్రహ్మమును ప్రాధాన్యముగా ప్రతిపాదించిరి. మరియు 'అసవన్నేవస భవతి, అసద్ బ్రహ్మేతి వేదచేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తోతోవిదుః ' (తై. 2. 6) బ్రహ్మ యొక్క అస్థిత్వము లేదు అనువారి అస్థిత్వము సమసిపోవును. బ్రహ్మ యొక్క అస్థిత్వమున్నదనువారు సన్మార్గములో ప్రవర్తించెదరు. వారిని సాధుమార్గములో నున్నారని బ్రహ్మవేత్తలు చెప్పుదురు. ఈ వాక్యములో బ్రహ్మయొక్క పునరావృత్తి అనగా అభ్యాసము చెప్పబడినది. అప్పుడు "బ్రహ్మ విదాప్నోతి పరమ్" బ్రహ్మ జ్ఞాని పరతత్వమును పొందును" అను ఉపక్రమమును బ్రహ్మమునే ప్రధానముగా చెప్పుచున్నారనుదానికి అనుకూలమగును.

నామరూప వికార భేదముల గల ఉపాధితో కూడుకొనినది సగుణబ్రహ్మము. ఉపాస్యము మరియు జేయమని వేదాంత వాక్యములలో చెప్పిరి. దీనికి విపరీతమైన నిర్గుణ బ్రహ్మము ఉపాధి రహితమైనది. ఈ విధముగా రెండు రూపములు గల బ్రహ్మను వేదాంతములో చెప్పిరి. సగుణ బ్రహ్మ నిరూపణము ఉపాసనా విధి ద్వారా నిర్విశేష బ్రహ్మ నిరూపమునందే తాత్పర్యము. ఇప్పుడు నిర్విశేష బ్రహ్మ ప్రతిపాదక విచారము ఆరంభించుటకు ఈ అధికరణము.

### 12. ఆనందమయో భ్యాసాత్ (1.1.12)

సూత్రార్ధము : "ఆనందమయో భ్యాసాత్" అను ఆనందమయ ప్రసంగములో బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా అని స్వప్రధానముగనే ఇచ్చట బ్రహ్మోపదేశము. కాని ఆనందమయ కోశము యొక్క అవయవరూపముగా బ్రహ్మోపదేశముగాదు. "ఆసన్నేన సభవతి అసద్ బ్రహ్మేతి వేదచేత్" ఆ బ్రహ్మ అస్తిత్వము స్వీకరించిన వాని ఉనికి ఉండును, స్వీకరించని వాని యొక్క అస్తిత్వము సమసిపోవును. బ్రహ్మపదమును పలు మారులు ప్రయోగించిరి. గాన ఆనందమయ శబ్దము ద్వారా స్వతంత్రముగా బ్రహ్మను చెప్పిరి.

### 13. వికార శబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్ (1.1.13)

పుచ్ఛ శబ్దమునకు అర్ధము అవయవము. అట్లైన స్వతంత్రముగా బ్రహ్మోపదేశమెట్లనిన అవయవ ప్రసంగములో పఠించినప్పటికిన్నూ పుచ్ఛ శబ్దము అవయవార్ధముగాదు. బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా అన్నచోట అవయవముతో పోయి ప్రతిష్ఠా శబ్దము ఆధారము అర్ధము గలదనిగూడ వినిపించుచున్నది. పుచ్ఛ శబ్దమునకు అర్ధము ఆధారము. ఇచ్చట సర్వాధారమైన బ్రహ్మను ఉపదేశించిరి.

### 14. తద్ధేతు వ్యపదేశాచ్చ (1.1.14)

తద్ధేతు వ్యపదేశము వల్ల గండ పుచ్ఛశబ్దమునకు అర్ధము ఆధారము తస్వ = బ్రహ్మణః, హేతు = వికారములకన్నిటికి కారణముగా, వ్యవపదేశాత్ = ఉపదేశించిరి "ఇదం సర్వం అస్సృజత్" (తై 2. 6) ఆ పరమాత్మ పరిపూర్ణ సంసారమునకు కారణము. ఆనందమయము వికారము. ఆనందమయముతో పాటు సంపూర్ణ జగత్తునకు కారణము బ్రహ్మమే.

**15. మాంత్ర వర్ణికమేవచగీయతే (1.1.15)**

పుచ్ఛవాక్యములో ప్రధానముగా బ్రహ్మమునే చెప్పిరి. కానీ ఆనందమయ కోశావయవముగా కాదు. “సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ” అను మంత్ర వాక్యములో ఏ బ్రహ్మను ప్రతిపాదించిరో దానినే బ్రహ్మపుచ్ఛం అను బ్రాహ్మణ వాక్యములో స్వతంత్రముగా బ్రహ్మను చెప్పిరి. మంత్ర బ్రాహ్మణములకు ఏకార్థత్వము చెప్పుదురు గనుక.

**16. నేతరోనుపపత్తేః (1.1.16)**

పుచ్ఛవాక్యములో ప్రధానముగా ఆనందమయమును ఎందుకు చెప్పుటలేదనిన, నేతరః = న జీవః, అనుపపత్తేః = యుక్తి సంగతము గాదు., న ఇతరః = ఆనందమయకోశము గల జీవుని ఇచ్చట ప్రతిపాదించుట లేదు, ఎందులకనగా “తస్య ప్రియమేవ శిరః” ప్రియామోద ప్రమోదములు. అవయవములుగా గలవాడు సృష్టికర్త ఎట్లగును? కాన ఇచ్చట స్వతంత్రముగా బ్రహ్మోపదేశమే.

**17. భేద వ్యవపదేశాచ్చ (1.1.17)**

భేద వ్యవపదేశము వలన ఇచ్చట ఆనందమయ కోశము నిరూపితము గాదు. “రసంహేవ్యాయం లబ్ధ్వానంద భవతి” ఇచట ఆనందమయుడు పొందేవాడు, పొందబడేది బ్రహ్మ అను భేద ఉపదేశము వల్ల ఆనందమయమును స్వతంత్రముగా చెప్పలేదు కాని బ్రహ్మోపదేశము చేసిరి.

**18. కామాచ్చ నానుమానాపేక్షా (1.1.18)**

“ఆనందో బ్రహ్మేతివ్యజానాత్” అన్నచోట ఏవిధముగా ఆనందమునకు బ్రహ్మత్వను చెప్పిరో, అట్లే ఆనందమయత్వములో గూడ బ్రహ్మత్వమును అనుమానించవచ్చు గదా అనిన కామ్యతే ఇతి కామః = ఆనందః, ఆనంద, అనిన చోట మయట్ ప్రత్యయము వినబడుట లేదు. అట్లే ప్రియమోద ప్రమోదములు వినబడుట లేదు. ఆనందము బ్రహ్మమనిన ఆనందమయమును బ్రహ్మమని అనుమానము ద్వారా చెప్పనవసరము లేదు. ఆనందమయములో వికారార్థముగల ‘మయట్’ ప్రత్యయమునుపయోగించిరి. గనుక ఆనందమయము బ్రహ్మము గాదు.

**19. అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి (1.1.19)**

పుచ్ఛ వాక్యము ద్వారా చెప్పబడిన బ్రహ్మమును బాగుగా తెలిసికొనిన ఈ ఆనందమయ జీవుడు బ్రహ్మమును పొందును అని శాస్త్రములో చెప్పిరి. “యదా హ్యేవైష ఏతస్మిన్న దృశ్యే అనాత్మ్యే అనిరుక్తే అనిలయనే అభయం ప్రతిష్ఠాం నిరిదతే “ఏ జీవుడు అదృశ్యత్వము మొదలగు లక్షణములు గల ఆ ఆత్మలో అభేద జ్ఞానము పొందునో అట్టి వానికి భయము లేదు. (తై. 2.7) శాస్త్రములో బ్రహ్మను తెలిసికొనిన వారికి బ్రహ్మభావాపత్తి చెప్పిరి. దీని ద్వారా ఆనందమయము ప్రతిపాద్యము కాదనినది నిశ్చయము. కాని ఆ ఆనందమయమునకు ఆధారమైన నిర్విశేష బ్రహ్మము ప్రధానము. కాన ఆనందమయమునకు బ్రహ్మము అవయవము కాదు.

# 7. అంతరధికరణము

సంగతి : పూర్వాధికరణములో ఆనందమయము మరియు ఆనంద అభ్యాసము అనుపదములను చూసి అనేక ప్రమాణములుండుట వల్ల వీని అర్ధము నిర్విశేష బ్రహ్మమునే నిర్ణయింపబడినది. అట్లే రూపమువంటి అనేక ప్రమాణములు చూచుచూ హిరణ్మయ పురుషుడు సంసారి అని పూర్వపక్షి చెప్పుచున్నాడు. అందువల్ల పూర్వాధికరణములో ఈ అధికరణమునకు దృష్టింత సంగతి.

విషయము : "అథ య ఏషో అంతరాదిత్యే హిరణ్యః పురుషే దృశ్యతే" అను ఛాంద్యోగ్యోపనిషత్ వాక్యము ఈ అధికరణమునకు విషయము.

సంశయము : సూర్యమండలాంతర్గత హిరణ్మయపురుషుడు కర్మ ఉపాసనల అనుష్ఠానము ద్వారా పొందు ఉత్కర్ష స్థాన దేవతయా? లేక పరమేశ్వరుడా? హిరణ్మయ పురుషుడు మరియు నేత్రస్థ పురుషుడు దేవతా స్వరూపమా? లేక పరమేశ్వరుడా?

పూర్వపక్షము : లోక మర్యాదలను ధరించుట ఆధారము మరియు రూపము యొక్క వర్ణనము ఉండుట వల్ల పై రెండు స్థానములలో నున్న ఉపాస్యము దేవతయే, ఈశ్వరుడు కాదు.

సిద్ధాంతి : సర్వాత్మా మరియు సంపూర్ణ పాపరహితమైన పురుషుని వర్ణన రెండు స్థానములలో చేయబడినది. అది ఈశ్వరునియందే సంభవము. మాయ యొక్క మహిమ వలన లోక సంగ్రహార్ధము వానిలో రూపవర్ణన ఉపాసన కొరకు సంభవము. మర్యాదా మరియు ఆధారము పరమేశ్వరుని యొక్క ఉపాదులు. అందువల్ల ఆదిత్యమండలములో నేత్రములో గల ఉపాస్య పురుషుడు పరమాత్మయే.

వై.న్యా.మా. 29 హిరణ్యమో దేవతాత్మా కిం వా పరమేశ్వరః
.మర్యాదాధార రూపోక్తేః దేవతాత్మైవనేశ్వరః॥

ఆదిత్యునిలో ఉన్న హిరణ్మయ పురుషుడు దేవతాత్మయా లేక పరమేశ్వరుడా? మర్యాదా ఆధారము మరియు రూపముల వర్ణనము చేయుట వలన దేవతనే ఉపాస్యుడని చెప్పిరి ఈశ్వరుని గాదు.

వై.న్యా.మా. 30. సార్వాత్మ్యాత్పర్వ దురిత మరాహిత్యాచ్చేశ్వరో మతః।
మర్యాదాద్యా ఉపాస్త్యర్థమీశేషస్వరూపాధిగాః॥

సర్వాత్మా తథా సంపూర్ణ పాపరాహిత్యము గల పురుషుని వివాదస్థములలో చెప్పినందువలననూ ఆ లక్షణములు ఈశ్వరునియందే సంభవము అగుట వల్ల హిరణ్మయపురుషుని యందు గలవాడు ఈశ్వరుడే అని చెప్పగలము. మాయా మహిమవలననూ లోకానుగ్రహార్ధమున్నూ ఆ ఈశ్వరుని యందు రూపము చెప్పబడెను. ఉపాసన కొరకు అది సంభవము.

ఛాందోగ్యోపనిషత్తునందలి ప్రథమ అధ్యాయములో నున్న ఉద్గత ఉపన్యాసములను చెప్పి ప్రధానోపాసనము చెప్పుటకు ఈ వాక్యము చెప్పిరి. "అథయ ఏషో అంతరాదిత్యే హిరణ్యపురుషః దృశ్యతే" (ఛాం. 1.6.6)

"ఆదిత్యమండలములో కనబడు హిరణ్మయపురుషుని గడ్డము మీసములు బంగారు వన్నెగలవి". అచట కర్మోపాసనముల అతిశయము వలన ఎవడో ఒక జీవుడు ఆదిత్య మండలములోని దేవతాత్మత్వము పొంది జగత్తులో అధికారము సాధించుచున్నాడు. ఈశ్వరుడు సర్వ వ్యాపకుడగుట వలన ఆదిత్య మండలములో గూడ ఉన్నాడు. ఇచట హిరణ్మయ పురుషుడు దేవతాత్మయా లేక ఈశ్వరుడా అని సంశయము కలుగుచున్నది.

హిరణ్యయపురుషుడు దేవతాత్మయే, ఎందులకనగా? మర్యాద, ఆధారము, రూపము చెప్పుట వలన" యే చాముష్మాత్పరాంచో లోకాః తేషాం చేష్టే దేవకామానాంచ" అతనిపైనున్న లోకములలో గల దేవతల ఇచ్ఛలను "ఆదిత్య మండలములో నున్న పురుషుడు శాసించును. (ఛాం. 1.7.6) ఈ వాక్యములో అతని ఐశ్వరము మరియు మర్యాద చెప్పబడినది. "అంతరాదిత్యే" "ఆదిత్యుని లోపల" అనుచు ఆధారము చెప్పిరి. "హిరణ్మయః" "బంగారు వన్నె గల" అని రూపమును చెప్పిరి. సర్వేశ్వరుడు, సర్వాధారుడు, రూపరహితుడైన పరమేశ్వరునియందు ఐశ్వర్య, మర్యాద, ఆధార, రూపములు అసంభవము. అందువల్ల హిరణ్మయ పురుషుడు దేవతాత్మయే. అను పూర్వపక్షమునకు ఉత్తరము చెప్పుచున్నారు. హిరణ్మయపురుషుడు పరమేశ్వరుడు. ఎందులకనగా సర్వాత్మత్వము వినబడుట వలన "సైవఋక్ తత్సానుతదుక్తం తద్యజుః తద్బ్రహ్మ" ఏది ఋక్ మంత్రమో అదే సామము, అదే యజుర్ మంత్రము, అదే బ్రహ్మము" (ఛాం. 1.5.7). మంత్రములోనున్న తత్ శబ్దము ద్వారా ప్రకృత సందర్భములో నున్న హిరణ్మయపురుషుని సంబంధమును చెప్పుచూ దానినే ఋక్ సామాది సంపూర్ణ జగత్ స్వరూపముగా ఉపదేశించిరి. అద్వితీయ పరమేశ్వరుని యందే అట్లు చెప్పుట యుక్తి యుక్తము కాని దేవతయందు సరిగాదు. మరియు "స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః" (ఛాం. 1.6.7). "ఆ పరమేశ్వరుడు అన్ని పాపములు మరియు వాని కార్యముల నుండి ముక్తుడు". సర్వ పాపముల రాహిత్యము బ్రహ్మ యొక్క అసాధారణ ధర్మము. దేవతల యందు పాపములు లేవు, ఎందులకనగా కర్మల యందు అధికారము లేదు గనుక. కాని రాక్షసుల ద్వారా కలుగు దుఃఖముండుట వలన జన్మాంతరములలో చేసిన సంచిత పాప కర్మ ఉండనే ఉన్నది. మర్యాద, ఆధార, రూపములు (లోకానుగ్రహార్ధము రూప గ్రహణమ్) మొదలగు ఉపాధి ధర్మములుండుట వలన పరమాత్మను ఉపాసన చేయగలరు. అందువల్ల హిరణ్మయపురుషుడు ఈశ్వరుడే.

## 20. అంతస్తద్ధర్మోపదేశాత్ 1.1.20

సూత్రార్ధము : "అథ యేషో అంతరాదిత్యే" అను శ్రుతి వాక్యములో సూర్యమండలాంతర్గ వర్తి పురుషుడు సూర్యుడు గాదు. "తద్ధర్మోపదేశాత్" ఎందులకనగా పాపశూన్యత్వాది బ్రహ్మయొక్క ధర్మములు చెప్పబడినవి. అవి సూర్యునిలో లేవు అందువల్ల సూర్యమండలాంతర్వర్తి పరమేశ్వరుడే.

"యేషో అంతరాదిత్యే" "యేషో అంతరక్షిణి" అని వినబడు శ్రుత్యుక్త పురుషుడు అంతరాత్మ పరమేశ్వరుడే సంసారి కాదు. ఎందులకనగా పరమేశ్వరుని ధర్మములు ఉపదేశించిరి గనుక. సంపూర్ణ పాపరాహిఒత్యము మొదలుగా గల అనేక ధర్మములు ఉపదేశించిరి. "తస్యోదితినామ" ఆదిత్య మండలస్థ పురుషుని పేరు 'ఉత్' అని చెప్పి "సేష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః" ఈ వాక్యములో సంపూర్ణ పాపరహితుడు అని చెప్పిరి. అందువల్ల ఆదిత్యాంతర్గత పురుషుడు పరమాత్మయే సూర్యునిలో బంగారు వన్నెగల గడ్డము, మీసము, వెంట్రుకలు అని వినబడుచున్నది గదా! అని పరమేశ్వరుని ధర్మములు కాదు గదా? అని అనిన అది సరిగాదు. ఆ పరమేశ్వరుడు స్వేచ్ఛగా అనంతశక్తి

గల మాయ ద్వారా ఉపాసన కొరకు మరియు లోకానుగ్రహార్థము అనేక రూపములు గలవాడుగా మారును. ఆధారము యొక్క ఉపదేశము కూడ ఉపాసన కొరకే. పరమేశ్వరుడు వ్యాపకమైనను ఉపాసన విశేషస్థలములలో చేసెదరు. కాన ఆధార ఉపదేశము విరుద్ధముగాదు. నేత్రములలో మరియు ఆదిత్యునిలో గల పురుషుడు పరమేశ్వరుడే.

'అంతర్' అను శబ్దము పూర్వ సూత్రము నుండి అనువర్తించును. కన్నులలో మరియు ఆదిత్యునిలో వినుపించు పురుషుడు ఆదిత్యాది శరీరముల కన్న భిన్నాభిమాని, జీవుని కన్న భిన్నము అతడు అంతర్యామి ఈశ్వరుడు. ఎందులకనగా భేద ఉపదేశమువల్ల య ఆదిత్యే తిష్ఠన్ ఆదిత్యాదన్తరో యం ఆదిత్యో నవేద" (బృ. 3.7.9) ఎవడు ఆదిత్యునిలో నున్నాడో వానిని ఆదిత్యుడు ఎఱుంగడు. వాని శరీరము ఆదిత్యుని శరీరమే. ఈ శ్రుతిలో తెలుసుకునే వాడు తెలిసికొనబడేది అనే భేద వ్యపదేశము గలదు. "య ఏషో అంతరాదిత్యో" అన్నచోట అంతర్ శబ్దము శ్రుతిలో వినబడుచున్నది. దాని ప్రత్యభిజ్ఞ వల్ల (తత్తా ఇదంతా అవగాహి జ్ఞానము – అదే ఇదను జ్ఞానము) ఆదిత్యునిలోని పురుషుడు ఆ ఆదిత్యునికన్న భిన్నమని చెప్పుట వల్ల ఆదిత్యునిలోని పురుషుడు పరమేశ్వరుడే.

# 8. ఆకాశాధికరణము

పూర్వాధికరణములో సర్వపాపరాహిత్యము మొదలుగా గల హేతువుల ద్వారా, సువర్ణ గడ్డము వంటి రూపమున్ననూ, అవ్యభిచరిత అసాధారణ కారణము వల్ల ఆదిత్యునిలోని పురుషుడు బ్రహ్మ అని చెప్పిరి. ఈ అధికరణములో ఆకాశ శబ్దమునకు భూతాకాశమే చెప్పవలయును. హేతు కారణముకన్ననూ శ్రుతి ప్రమాణము బలీయము కనుక ఇచట ప్రత్యుదాహరణ సంగతి.

సంగతి : పూర్వాధికరణములో ఆదిత్యునిలోని పురుషుడు బ్రహ్మమని చెప్పిరి. అదే విధముగా ఆకాశశ్రుతిని బ్రహ్మ కన్న భిన్నముగా చెప్పలేము. లింగ ప్రమాణము (హేతువు) కన్ననూ శ్రుతి ప్రమాణము బలమైనది. అందువల్ల పూర్వాధికరణములో దీనికి త్ర్యుదాహరణ సంగతి.

విషయము : "అస్య లోకస్య కాగతిరితి ఆకాశ ఇతిహోవాచ" (ఛాం. 1.9.1) అను ఛాందోగ్యోపవిషత్తు వాక్యము ఈ అధికరణములో విచారణీయ విషయము.

సంశయము : ఆకాశ శబ్దము పరబ్రహ్మోపదేశమా? లేక భూతాకాశార్థమా?

పూర్వపక్షము : లోక ప్రసిద్ధిని చూచుచు ఆకాశ శబ్దమునకు భూతాకాశమని అర్థము చెప్పవలయును. బ్రహ్మమును అర్థములో సాదృశ్యముననుసరించి బ్రహ్మ బదులు ఆకాశ శబ్దమును అక్కడక్కడ ప్రయోగించిరి. వాయువ్యాది క్రమముననుసరించి ఆకాశము కూడ జగత్తునకు కారణ స్రష్ట అనగలము.

సిద్ధాంతి : ఆకాశములో బాటు సంపూర్ణ జగతుత్పత్తి కారణము బ్రహ్మమగుట వలన, లోక రూఢి కన్ననూ శ్రుతి వాక్యము బలవత్తరమగుటచే, ఆకాశ శబ్ద ప్రయోగము చేసినను దాని అర్థము బ్రహ్మమనియే చెప్పవలయును అన్యము గాదు. "సర్వానిహవా ఇమాని చూతాని ఆకాశాదేవ సముత్పద్యంతే" అను వాక్యములో ప్రయోగించిన "ఏవ శబ్దము వల్ల గూడ ఆకాశ శబ్దమును బ్రహ్మమనియే అర్థము."

వై.న్యా.మా. 31. ఆకాశ ఇతిహోవాచేత్యత్రఖం బ్రహ్మ వాత్రఖమ్।
శబ్దస్య తత్ర రూఢత్వా ద్వాయ్వాదేః సర్జనాదపి॥

"ఆకాశ ఇతి హోవాచ" అనుశ్రుతి వాక్యములో ఆకాశపదము బ్రహ్మను చెప్పుచున్నదా లేక భూతాకాశమునా? ఆకాశపదము భూతాకాశమనుటలోనే ప్రసిద్ధమ మరియు వాయువు మొదలగువానికి ఉత్పత్తికి కారణము. అందువలన ఆకాశపదమునకు భూతాకాశమని అర్థము.

వై.న్యా.మా. 31 : సాకాశ జగదుత్పత్తి హేతుత్వాచ్ఛ్రైరూఢితః।
ఏవకారాదినా చాత్ర బ్రహ్మైవాకాశ శబ్దితమ్॥

శ్రుతులలో ఆకాశపదము బ్రహ్మభోదకము మరియు శ్రుతిలో ఆకాశము అన్ని భూతములకు కారణమని చెప్పబడినది. అన్ని భూతములలో ఆకాశము కూడ అంతర్గతమై ఉన్నది. "ఆకాశాదేవ" అన్నచోట ఏవ పదము వేరు కారణములను నిరాకరించుచున్నది. ఇచట ఆకాశపదము బ్రహ్మ వాచకము.

పూర్వము చెప్పిన హిరణ్మయ వాక్యానంతరము సర్వలోకాధారమును శాలావత్య ఋషి అడుగగా రాజు ప్రవాహణుడు ఈ విధముగా సమాధానము చెప్పెను. "ఆకాశ ఇతిహోవాచ సర్వానిహవా ఇమాని భూతాన్యాకాశాదేవ సముద్పద్యంతే, ఆకాశంపుత్సస్తంయన్తి, ఆకాశో హ్యేవైభ్యో జ్యాయాన్, ఆకాశః పరాయణమ్" (ఛాం. 1.9.1)

"ఆకాశమే ఈ లోకమునకు ఆధారము. ఈ సమస్త భూతములు ఆకాశము నుండే పుట్టుచున్నవి. దానియందే లయమునొందుచున్నవి. అది అన్నిటికంటే నధికమైనది, సర్వమునకాశ్రయమైనది." ఈపై శ్రుతి వాక్యములో వచ్చిన ఆకాశ శబ్దార్థము ఆకాశమనియా? లేక బ్రహ్మమా? అని సందేహము.

పూర్వపక్షము : ఆకాశ శబ్దము భూతాకాశములో రూఢము గనుక భూతాకాశమని అర్థము అన్ని భూతములకుత్పత్తి లయములకు కారణము ఆకాశము కాగలదు. "ఆకాశాద్వాయుః వాయో రగ్నిః" (తై.2.1) ఆకాశము నుండి వాయువు ఉత్పన్నమయ్యెను. వాయువునుండి అగ్ని ఉత్పన్నమైనది. ఈ శ్రుతులలో అన్ని భూతములకు ఆకాశము కారణమని చెప్పబడెను.

సిద్ధాంతి సమాధానము : బ్రహ్మమే ఆకాశబ్దార్థము. "సర్వానిహోనై ఇచట సంకోచము లేని సర్వ శబ్దము ద్వారా ఆకాశముతో బాటు అన్ని భూతముల ఉత్పత్తి వినబడుచున్నది. ఆకాశము ఆకాశోత్పత్తికి కారణము కాజాలదు. రూఢిత్వము లౌకిక ఆకాశము వరకే సీమితము. శ్రుతులలో బ్రహ్మకు పేరు లేకపోయిననూ "ఆకాశోవైనామ నామరూపయోర్నిర్వహితా" (ఛాం. 8.14) ప్రసిద్ధమైన నామరూపములను వ్యక్తము చేయునది (బ్రహ్మ) ఈ ఆకాశమే అని ప్రయోగించిరి కాని "ఆకాశాదేవ' అన్నచోట '%ఏవ' కారము కారణాంతరములను తొలగించుచున్నది. ఇది ఆకాశ పక్షములో సంభవము గాదు. ఘటాదులలో ఆకాశము కన్న అతిరిక్తమైన మృదాడి కారణములు కానవచ్చుచున్నవి. బ్రహ్మ పక్షములో సద్రూపమైన బ్రహ్మ అన్నింటికి అభిన్నముగా నుండి కారణాంతరములను తొలగించుచున్నది. జాయస్త్వ పరాయణత్వములు. ఇంకొక శ్రుతిలో బ్రహ్మ యొక్క గుణములు వినబడుచున్నవి. పృధివీకన్న పెద్దది, అంతరిక్షముకన్న అధికమైనది. "జ్యాయాన్ పృధివ్యాః, జ్యాయాన్ అంతరిక్షాత్" (ఛాం. 3.14.3) "విజ్ఞానమానందాం బ్రహ్మ రాతిర్దాతుః పరాయణమ్:" (బృ-3.9.28)"విజ్ఞానము ఆనందస్వరూపమైన బ్రహ్మ కర్మ ఫలమిచ్చుటకు సమర్థము. మరియు పరమాశ్రయము" అందువల్ల ఆకాశశబ్దముతో బ్రహ్మమే వివక్షితము.

**22. ఆకాశస్తల్లింగాత్ (1.1.22)**

సూత్రార్ధము : "ఆకాశ" ఇతి హోవాచ అనుశ్రుతివాక్యములో చెప్పిన ఆకాశపదము పరబ్రహ్మపరమే కాని భూతాకాశము కాదు. బ్రహ్మము నుండి అన్ని భూతములు ఉత్పత్తి చెందుచున్నవి. దానిలో లీనమగుచున్నవి. ఉత్పత్తి లయములు బ్రహ్మమునకు చిహ్నము లేక అనుమానగమ్యము.

"సర్వానిహ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముద్పద్యన్తే" ఆకాశం ప్రత్యస్తం యాన్త్యాకాశో హేవేభ్యో జ్యాయాన్" (ఛాం. 2.9.1) అను వాక్యములో సమస్త భూత సృష్టి లయములకు కారణము (హేతువు) అగుట వలన బ్రహ్మమే ఆకాశ శబ్దార్ధము. లింగము (హేతువు) కన్న శ్రుతి బలీయమని చెప్పిన అట్లనుట సరికాదు. అనేక బ్రహ్మ బోధక లింగములు వినబడుచున్నందున ఒకచోట చెప్పు ఆకాశ శ్రుతివాక్యము బాధితమైన దోషము లేదు. ఆకాశార్ధము గ్రహించిన "ఆకాశదేవ" అను నిశ్చయార్ధకమైన 'ఏవ' శబ్ద ప్రయోగము యుక్తి సంగతము కాదు. "సర్వాణి" అన్నచోట భూతాకాశము గూడి అంతర్గతమగుట వలన ఆకాశము నుండి ఆకాశోత్పత్తి చెప్పుట సరిగాదు. అంతేగాక అన్నిటికన్న పెద్దది చైతన్యము అన్నింటికి ఆశ్రయము అను విశేషణములు బ్రహ్మమందే సంభవము ఇన్ని కారణముల వల్ల ఆకాశ ప్రసిద్ధార్ధము అకించిత్ కరము, ఎందులకనగా బ్రహ్మమునందు ముఖ్యముగా అనేకచోట్ల ప్రయోగించిరి. గనుక ఉద్ధత వాక్యములోగల ఆకాశ శబ్ద వాచ్యము బ్రహ్మమనియే ఉపాసన చేయవలయును. "త్యజేదేకం కులస్యార్ధే" అను నీతి వాక్యానుసారము ఒక శ్రుతిలో చెప్పిన ఆకాశ శబ్దము త్యజించిన దోషము లేదు. ఎందులకనగా అనేక బ్రహ్మ లింగ వాక్యముల విరోధము కానవచ్చుచున్నందువల్ల.

# ౧. ప్రాణాధికరణము

ఆకాశమునకు చెప్పిన న్యాయవలనే ఇచట అతిదేశము గావించుచున్నారు.

సంగతి : అతిదేశమనగా ఒకచోట చెప్పబడిన సామ్యమును బట్టి మరియొక చోట ఉపయోగించుట అతిదేశమందురు. అతిదేశమగుట వల్ల ఇచట గూడ ప్రత్యుదాహరణ సంగతియే.

విషయము : "కథమా సా దేవతా"? "ప్రాణః ఇతి హోవాచ" (ఛాం. 1.11.4). ఈ ఛాందోగ్యశ్రుతి వాక్యము ఇచట విచారణీయ శ్రుతి వాక్యము.

సంశయము : చాక్రాయణుడు అను ఋషి ధనాభిలాషతో యజ్ఞము చేయుచున్న రాజు వద్దకు పోయెను. సామవేదము చెప్పుచు దేవతలను స్తోత్రము చేయువారిని ప్రస్తోతా ఉద్గాతా, ప్రతిహర్తా అందురు. ఆ ప్రస్తోతతో చాక్రాయణుడిట్లనెను. – ఈ సామవేద భాగమైన ప్రస్తావమునందు స్తోత్రము చేయదగిన దేవత ఏది? దానిని నెరుంగుది వేని సరియే, కానిచో నా ఎదుట ఆ దేవత స్తోత్రము చేసిన నీతల తెగిపోవును అనెను. విద్వాంసుల ముందు వారి ఆజ్ఞతో కర్మ చేయవలయునని నియమము. వారి ఆజ్ఞ లేనిచో అనిష్టము వాటిల్లును. ప్రసోతత భయము నొంది మునిని ఈ విధముగా ప్రశ్నించెను. ఆ దేవత ఏది? దానికి ముని "ప్రస్తోత దేవత ప్రాణమనెను." ఈ ప్రాణమునందే బ్రహ్మ లక్షణములు చెప్పుట వలన సంశయము కలుగుచున్నది. ప్రస్తోత దేవత ప్రాణమా? లేక బ్రహ్మమా? అని.

పూర్వపక్షము : ప్రసోతత దేవతా రూపముగా ఇచ్చట ప్రాణమును చెప్పుటయే ఉచితము. ఎందులకనగా సుషుప్తి దశలో పంచభూతముల సారమైన ఇంద్రియములు ప్రాణముల యందు లయమగుట ప్రత్యక్ష సిద్ధము. మరియు ఆ అవస్థలో ప్రాణము వ్యాపారములో కూడినదై ఉన్నది. ఈ విధముగా ప్రాణ జాగరణ గూడ ప్రసిద్ధమే. అందువల్లనే ప్రస్తోత దేవత ప్రాణమనుట ఉచితము.

సిద్ధాంతము : ఇచ్చట ప్రాణవాయువునకు అర్థము ప్రాణమని చెప్పిన, సర్వభూత లయ కారణము బ్రహ్మమని చెప్పు అర్థమునకు సంకోచము కావించవలయును. సంపూర్ణ జగదుత్పత్తి స్థితిలయ కారణమని చెప్పుటచే పూర్వాధికరణములో ఆకాశ శబ్దమునకు బ్రహ్మమని చెప్పినట్లు ఇచట ప్రాణ శబ్దమునకు బ్రహ్మవాచకమని అర్థము చెప్పుటచే ఉచితము.

వై.న్యా.మా. 33. ముఖ స్థో వాయు రశోవా ప్రాణః ప్రస్తావదేవతా।
వాయుర్భవేత్ తత్ర సుప్తా భూత స్థారేంద్రియక్షయాత్॥

"ప్రాణ ఇతి హో వాచ" అనుశ్రుతిలో చెప్పిన ప్రాణము వాయు వికారమా లేక బ్రహ్మమా? సుషుప్తిలో అన్ని భూతముల సోభూతమైన ఇంద్రియములు ప్రాణవాయువులో లీనమగుచున్నవి. అందువల్ల ఈ ప్రాణము వాయువికారమే.

వై.న్యా.మా. 34. సంకోచో అక్షపరత్వే స్వాత్ సర్వభూత్ లయశ్రుతేః।
ఆకాశ శబ్దవత్ ప్రాణశబ్దస్తేనే శవాచకః॥

సుషుప్తిలో కేవలము ఇంద్రియములు ప్రాణవాయువులో లీనమగును. ఇచ్చట అన్ని భూతముల లయము చెప్పబడెను. ఈ శ్రుతిలో ప్రాణమును వాయువికారముగా చెప్పిన "సర్వాణిహవా" అను శ్రుతిలో నున్న సర్వ శబ్దార్థమును సంకోచించవలయును. ఆకాశ శబ్దము వలె ప్రాణ శబ్దము గూడ శ్రుతిరూఢి ద్వారా బ్రహ్మ వాచకమే. ప్రాణమేవ అన్న చోట 'ఏవ' కారప్రయోగము వల్ల గూడ ప్రాణము బ్రహ్మమనునది సిద్ధము.

(ప్రస్తోత అనగా సామవేదము చెప్పుచూ దేవతలను స్తోత్రము చేయువారు) ఆకాశ తరువాత వాక్యములో ప్రస్తావమను సామవేదము యొక్క దేవతను స్తుతించు ప్రస్తోతా అడిగినదానికి ఉషస్తి చాక్రాయణుడు సమాధానమిచ్చెను. ఆ ప్రసంగమును లోని వాక్యమిది. "ప్రాణ ఇతిహోవాచ సర్వాణిహవా ఇమాని భూతాని ప్రాణమేవ అభిసంవిశంతి ప్రాణమభ్యుజ్జిహతే। సైషా దేవతా ప్రస్తావన మన్వాయత్తా" ఛాం (14.4 1.11.5) ప్రస్తావమున ధ్యానింపదగిన దేవత ప్రాణము. ఈ సర్వభూతములను ప్రళయావస్థయందు ఆ ప్రాణము నందే లీనమగును. ఉత్పత్తి అవస్థయందు మరల దాని నుండియే జనించును. ఆ దేవత ప్రస్తావసంబంధమైనది. ఈ వాక్యములో వచ్చిన ప్రాణ శబ్దమునకు ముఖ బిలాంతవర్తి వాయువని అర్థమా? లేక బ్రహ్మమనియా?

ముఖ బిలాంతవర్తి వాయువే అగును. అన్ని భూతముల లయము అచట సులభముగా అగును. సుషుప్తిలో అన్ని భూతముల సారమగు ఇంద్రియములు ప్రాణవాయువులో లీనమగుచున్నవి గదా అనిన –

"సర్వాణిహవై" అన్న శ్రుతిలో ఇంద్రియముల లయము మాత్రమే చెప్పిన, శ్రుతిలోని సర్వ శబ్దమునకు సంకుచితార్థమగును. శ్రుతిరూఢి వల్ల 'ఏవ' కారము శబ్దము వల్ల ఆకాశ శబ్దమువలె ప్రాణ శబ్దము బ్రహ్మ

వాచకము. ప్రాణ శబ్దము బ్రహ్మమనునది శ్రుతి రూఢిలో గలదు. "ప్రాణస్య ప్రాణమ్" (బృ.దా. 4.4.18) "ప్రాణమునకు ప్రాణమన్నచోట బ్రహ్మను చెప్పుటకే ద్వితీయ ప్రాణ శబ్దమును ప్రయోగించిరి. కనక ప్రాణ శబ్దార్థము ఈశ్వరుడే".

**23. అత ఏవ ప్రాణః 1.1.23**

సూత్రార్థము : ప్రాణ శబ్దము బ్రహ్మ పరము. ఎందుకలనగా పూర్వ సూత్రములో చెప్పిన హేతువు వలనే.

కేవలము ఇంద్రియముల లయము ప్రత్యక్ష శ్రుతి ద్వారా చెప్పినను, సంపూర్ణ భూతముల లయమునకు ఆధారము బ్రహ్మమనునది, బ్రహ్మ యొక్క అసాధారణ హేతువు అట్టి అవ్యభిచరిత బ్రహ్మలింగమును చూచుచు ప్రాణ శబ్దార్థము బ్రహ్మమనియే చెప్పవలయును. "యధా సుప్తః న కంచన స్వప్నం ఏశ్వతి। అథాస్మిన్ ప్రాణే ఏవైకదా భవతి" (కౌ. 3.3.) నిద్రించుచున్న వ్యక్తి కలలు చూచుట లేదు. ఆ అవస్థలో ప్రాణములో ఏకీభవించుచున్నాడు. ఈ కౌశీతకీ శ్రుతి ద్వారా సర్వప్రపంచ లయస్థానము బ్రహ్మ మనియే తెలియుచున్నది. వాక్య ప్రమాణముకన్న సన్నిధి ప్రమాణము దుర్బలమగుట వలన లోక ప్రసిద్ధి అకించిత్ కరము (ప్రయోజనము లేనిది). "ప్రాణస్య ప్రాణః " (బృ. 4.4.18) ప్రాణమునకు ప్రాణము ఇచట మొదటి ప్రాణ శబ్దము వాయు పరము రెండవది బ్రహ్మపరమనుటలో సందేహము లేదు. ప్రాణ శబ్దము బ్రహ్మమే.

# 10. జ్యోతిశ్చరణాధికరణము (24-27)

బ్రహ్మకారణముండుట వలన ప్రాణశబ్దమునకు బ్రహ్మమనినట్లు, ఇచట బ్రహ్మ హేతువు లేనందున బ్రహ్మపరము కాదని ప్రత్యుదాహరణ సంగతితో చెప్పిరి.

సంగతి : సకారణము ద్వారా జ్యోతిః శబ్దమునకు బ్రహ్మమని చెప్పుటకు వీలగునో అట్టి చిహ్నమిచట లేనందున పూర్వాధికరణముతో దీనికి ప్రత్యుదాహరణ సంగతి.

విషయము : "అథ యదతః ఏరోదివో జ్యోతిర్దీప్యతే" (ఛాం. 3.11.7) ఇది మొదలుగా గల వాక్యము విచారణీయము.

సంశయము : ఈ జ్యోతిః శబ్దము ఆదిత్యాదులకు వాచకమా? లేక బ్రహ్మవాచకమా?

పూర్వపక్షము : బ్రహ్మము యొక్క సన్నిధి లేనందున కార్యరూపమైన ఆదిత్యాదులను జ్యోతిః శబ్దమని చెప్పవలయును. వాక్యప్రమాణమున కన్న లింగ ప్రమాణము బలవత్తరమైనది. లింగ ప్రమాణము ద్వారా జ్యోతిః శబ్దమునకు కార్యజ్యోతులైన ఆదిత్యాదులు చెప్పవలయును. "శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన సమాఖ్యానాం సమవాయే పౌరదౌర్బల్య మర్థ విప్రకర్షాత్" అను పూర్వ మీమాంసా సూత్రానుసారము (3.3.14) లింగ ప్రమాణము బలవత్తరమైనది. ఇచట శ్రుతిప్రమాణము స్వతంత్రము. లింగము మొదట శ్రుతిని కల్పన చేసి ఆ తరువాత కల్పితశ్రుతి ద్వారా అర్థము చెప్పును. గనుక అర్థము చెప్పుటకు విలంభమగును. అట్లే వాక్యదులు అర్థము చెప్పుటలో ఒకదాని తరువాత ఒకటి దూరము అగుచున్నది. పూర్వ పక్షి ఇచట వాక్య ప్రమాణమున కన్న లింగ ప్రమాణము

బలవంతమని చెప్పెను. ఎందులకనగా వాక్యము లింగ కల్పన చేసి, లింగము శ్రుతి కల్పన చేసి అర్థము చెప్పవలయును గనుక.

సిద్ధాంతము : జ్యోతి శబ్దమునకు పర బ్రహ్మమని అర్థము చెప్పుట ఉచితము. "పాదో అస్య విశ్వా భూతాని" అను వాక్యములో బ్రహ్మమునకు నాలుగు పాదములు చెప్పబడినవి. ప్రకాశమునకు చాలాచోట్ల జ్యోతిః శబ్దము చెప్పెదరు. నాలుగు పాదములు గల ప్రకరణగత బ్రహ్మకొరకే 'యత్' శబ్దము ప్రయోగించిరి. విశేష ప్రదేశములో బ్రహ్మమున్నదని చెప్పిన అది తప్పక ఔపాదిక మగును. ఆధారములేక అధికరణము నిర్దేశించుట ఉపాసనకొరకు ఉచితమే. అందువల్ల జ్యోతి దీప్యతే అను వాక్యములో సుస్పష్టముగా బ్రహ్మ ఉల్లేఖించబడినది.

వై.న్యా.మా. 35. కార్యం జ్యోతిరుత బ్రహ్మ జ్యోతిర్దీప్యత ఇత్యతః।
బ్రహ్మణో అసంనిదేః కార్యం తేజోలింగబలాదపి॥

"అథ యదతాః ఏరో దివో జ్యోతిర్ దీప్యతే" అను శ్రుతిలోని జ్యోతిః శబ్దమునకు అర్థము కార్యజ్యోతియా లేక బ్రహ్మమా? బ్రహ్మప్రకరణము కానందువల్ల మరియు "ఇదం వావ తద్యది ద మస్మిన్నంతః పురుషే జ్యోతిః" అను వాక్యములో జఠరాగ్నితో అభేదరూపమైన జ్యోతిఃలింగము ప్రతీతమగుచున్నది. అందువల్ల ఈ శ్రుతిలో కార్యజ్యోతిని చెప్పిరి.

వై.న్యా.మా. 36. చతుష్పాత్ ప్రకృతం బ్రహ్మ యచ్ఛబ్దేనానువర్త్యతే
జ్యోతిః స్సాద్భాసకం బ్రహ్మ లింగం తూపాధియోగతః॥

"పాదో అస్య విసర్వాభూతాని త్రిపాదస్స్యామృతందివి" అని వెనుకటి శ్రుతిలో చెప్పిన నాలుగు పాదముల బ్రహ్మము ప్రకృతము. "యదతః" అన్నచోట ఆ బ్రహ్మమును ఇచట యత్ శబ్దముతో అనువృత్తి గావించిరి. జ్యోతిః శబ్దమునకు అర్థము ప్రకాశించుచున్నది అని బ్రహ్మ జగత్తును ప్రకాశింపచేయుచున్నది. తేజోలింగము ఉపాధితో కూడిన బ్రహ్మము నందు కల్పన గావించవచ్చు. కనుక చెప్పిన శ్రుతిలో జ్యోతి శబ్దమునకు బ్రహ్మయని అర్థము.

ఛాందోగ్యోపనిషత్తు తృతీయాధ్యాయములో గాయత్రీ విద్యలో హృదయచ్ఛిద్రోపాసన చెప్పిన తరువాత ఈ విధముగా చెప్పిరి. "అథ యదతః ఏరో దివో జ్యోతిర్దీప్యతే". ఈ స్వర్గలోకమునకు మీద అన్ని లోకములకు పైన ఏ జ్యోతి ప్రకాశించుచున్నదో (ఛాం. 3.13.7). అచట ద్యులోకమునకు పైన ప్రకాశించుచున్నది. నేత్రములననుగ్రహించు కార్యరూప తేజమా? లేక బ్రహ్మమా? అని సంశయము. బ్రహ్మ అసన్నిహితమగుట వలన కార్యమును పొందుట వలననూ ఈ జ్యోతి బ్రహ్మపరకము కానేరదు. గుర్తులుండుట వలన కార్యరూపమైన జ్యోతియనుట యుక్తి యుక్తము "ఇదంవావ తద్యదిదమస్మిన్నంతః పురుషేజ్యోతిః" "ఇదే పురుషుని లోపలనున్న జ్యోతి" ఈ వాక్యము జఠరాగ్ని అభిన్నమైన జ్యోతి చిహ్నము చెప్పుచున్నది.

సమాధానము : అసన్నిధిః అసిద్ధము. పూర్వపు గాయత్రీ ఖండములో "పాదో అస్య సర్వాభూతాని త్రిపాదస్వా మృతం దివి" బ్రహ్మమునకు నాలుగు పాదములు. ఈ ప్రపంచమునందలి సర్వభూతములు ఒక్కపాదము తక్కిన మూడు పాదములు ద్యులోకమున నున్నవి. నాలుగు పాదములు గల బ్రహ్మ ప్రసంగము ప్రస్తుతము. "యదతః" అనుచోట యత్ శబ్దముతో ఆ బ్రహ్మమే ప్రస్తావింపబడినవి. ఆ బ్రహ్మమునకు సర్వభూతములు ఏకపాదము.

మిగిలిన మూడు పాదములలో లక్షితమైన అనంతస్వరూపము ద్యులోకమనిన 'స్వస్మిన్నేవావ తిష్ఠతే" తన స్వరూపము లేనే ఉన్నాడని అర్థము. జ్యోతిః శబ్దము బ్రహ్మకే చెప్పలేదనుట సరిగాదు. జ్యోతియనగా ప్రకాశింపజేయునది అని అర్థము. బ్రహ్మ జగత్తును ప్రకాశింపజేయుచున్నది. ఉపాధి గల బ్రహ్మమందు తేజోలింగము కల్పింపబడినవి. కనుక జ్యోతి శబ్దార్థము బ్రహ్మమే.

## 24. జ్యోతిశ్చరణాభిధానాత్ 1.1.24

సూత్రార్థము : "అథ యదతః ఏరోదివో జ్యోతిర్దీప్యతే" అను శ్రుతిలో జ్యోతిశబ్దము ద్వారా పరమాత్మయే చెప్పబడినవి. సూర్య చంద్రాదుల జ్యోతి చెప్పలేదు. ఎందులకనగా "పాదో అస్య సర్వాభూతాని త్రిపాదస్వామృతం దివి" అను పూర్వ వాక్యములో బ్రహ్మమునకు నాలుగు పాదములు చెప్పబడినవి. ఇచ్చట జ్యోతిర్ వాక్యములో స్వర్గ సంబంధము ద్వారా ఆ బ్రహ్మ యొక్క ప్రత్యభిజ్ఞ యగును". "తత్తా ఇదంతా అవగాహి జ్ఞానమును ప్రత్యభిజ్ఞ యందురు". అనగా దాని భావము మరియు ధర్మము, దీని భావ ధర్మములను విషయీకరించు నిశ్చయ జ్ఞానమును పత్యభిజ్ఞ యందురు. ఉదాహరణమునకు సో అయా దేవదతః

"తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పూరుషః" పాదో అస్య సర్వా భూతాని త్రిపాదస్వామృతం దివి" (ఛాం. 3.12.6) ఆ పరమాత్మ యొక్క ఒక పాదములో సంపూర్ణ సృష్టి కలదు. వాని మహిమను చెప్పుచున్నారు. కాని వాని మూడు పాదములు స్వర్గమునకు పైన అమృతమయముగానున్నవి. ఇచట బ్రహ్మకు నాలుగు పాదములు అనగా చరణములు చెప్పిరి. ఏ అర్థమును ప్రకాశింపజేసిననూ దానిలో జ్యోతిః శబ్ద ప్రయోగము కనుపించుచున్నది. అందువల్ల బ్రహ్మలో జ్యోతి శబ్ద ప్రయోగము అవిరుద్ధము. సర్వవ్యాపకమైనను బ్రహ్మ ఉపాధి విశేషముననుసరించి ఔపాధికరూపముతో నిర్దేశము చెప్పవచ్చును. అధికరణమనగా ఆధార నిర్దేశము. ఉపాసన కొరకు చెప్పబడినవి. ప్రతిరూపము, అన్యత్ర అన్య దృష్ట్యాలంబనమును ప్రతీకమందురు. నామాది ప్రతీకములను బ్రహ్మముగా ఉపాసించునట్లు ఉదరస్థ జ్యోతిని ప్రతీకముగా భావించి దానిలో బ్రహ్మోపాసన చేసినను దోషము లేదు. అందువల్ల చాందోగ్యోపనిషత్తు వాక్యములోని జ్యోతిః శబ్దము బ్రహ్మ పరము.

## 25. ఛందో అభిధానాన్నేతి చేన్న తథా చేతో అర్పణ నిగదాత్తథాహి దర్శనం (1.1.25)

సూత్రార్థము : ఛందోభిధానాత్ = "గాయత్రీ వా ఇదం సర్వం భూతం" అను శ్రుతివాక్యములో గాయత్రీ ఛందస్సు ఉపక్రమము చేయుట వల్ల బ్రహ్మ గురించి కాదు అనిన, న = అట్లనుట సరిగాదు.

తథా చేతో అర్పణ నిగదాత్ = గాయత్రీ ఛందస్సు ద్వారా గాయత్రిలో నున్న బ్రహ్మమునందు చిత్తము ఏకాగ్రము చేయవలెనని ఉపదేశము.

తథాహి దర్శనమ్ = అట్లే "ఏతం హ్యేవ బహుఋచా మహత్యుక్థే మీ మాంసన్తే" అను వాక్యములో వికారి కార్యబ్రహ్మము ద్వారా కారణ బ్రహ్మము యొక్క ఉపాసన కనబడుచున్నదని ఉదాహరణము. గాయత్రీ ఛందస్సు పూర్వ వాక్యములో చెప్పబడినందువల్ల జ్యోతిః శబ్దము బ్రహ్మపరము గాదు అనిన అట్లనిన సరిగాదు. ఎందువల్ల? అక్షరములను కూర్చి చెప్పిన గాయత్రీ ఛందస్సు సర్వాత్మక స్వరూపము కానేరదు. ఛందస్సు ద్వారా దానియందున్న బ్రహ్మములో చిత్తమునేకాగ్రము చేయుట చెప్పిరి. దృష్టాంతము "పతం హేవ బహు ఋచా మహత్యుక్థే మీమాంసన్తే"

ఐతరేయ ఆరణ్యకములోని (3–2–3–12) వాక్యము. ఇదే బ్రహ్మమును మహా ఉక్థములో (చాటు వాక్యములలో) ఋగ్వేదము చదువు వారు మీమాంస చేయుదురు. ఈ పూర్వ వాక్యములో గూడ బ్రహ్మకు ఉపాస్యముగా కనబడుచున్నది. ఛందస్సు గాదు.

## 26. భూతాది పాద వ్యపదేశోపపత్తే శ్చైవమ్ (1.1.26)

సూత్రార్ధము : భూతాదులను గాయత్రి పాదములుగ చెప్పుట వలన ఇచట బ్రహ్మ ప్రసంగమే. 'చ'కారము ద్వారా బ్రహ్మపరముగా పురుష సూక్తములో చెప్పుట వలన కూడ ఇచట బ్రహ్మ ప్రసంగమే. "సౌషా చతుష్పదా గాయత్రీ" ఇదంతయు బ్రహ్మమే అని చెప్పి, గాయత్రి ఛందస్సును నిర్దేశించిరి. పై శ్రుతిలో నాలుగు పాదముల గాయత్రి అని చెప్పి ఈ శ్రుతి ద్వారా భూత సమూహ ము, భూమి, శరీరము, హృదయము, ప్రాణములు చెప్పినందున బ్రహ్మమందు గాయత్రీ శబ్ద ప్రయోగము ఉచితమే. అక్షర సమూహమైన గాయత్రీ ఛందస్సునందు భూతాదుల పాద ఉపదేశము యుక్తి, సంగతము గాదు. అందువల్ల గాయత్రీ వాక్యములో బ్రహ్మమునే ప్రతిపాదించిరి. అదే బ్రహ్మమును జ్యోతిర్ వాక్యములో స్వర్గాది సంబంధముగా ప్రత్యభిజ్ఞ గావించుట వలన బ్రహ్మోపదేశమే. భూతాదులను పాదములుగా నిర్దేశించుట, "తావానస్య మహిమ" అది బ్రహ్మ యొక్క మహిమ అను శ్రుతి "విష్ట బ్యాహమిదం" సంపూర్ణ జగత్తును ఒక అంశముతో వ్యాసింపజేసి యున్నాను అను గీతావాక్యము (గీత : 10.42) "యద్వై తద్ బ్రహ్మ" "ఏది గాయత్రీ ద్వారా చెప్పిన త్రిపాద అమృత స్వరూపమో అది బ్రహ్మము" (చాం. 3.12.7) అను ఛాందోగ్య శ్రుతి ద్వారా ముఖ్య బ్రహ్మ నిర్దేశము వలన జ్యోతి శబ్దము ద్వారా బ్రహ్మోపదేశమే.

## 27. ఉపదేశ భేదాన్నేతి చేన్న ఉభయస్మిన్నప్య విరోధాత్ (1-1-27)

సూత్రార్ధము : ఉపదేశ భేతాత్ = దివి అని సప్తమి విభక్తి అని చోట "అథ ఏరో దివి" అని పంచమీ విభక్తి వేరొకచోట చెప్పుట వలన, న ఇతిచేత్ = దానినే ఇచట ప్రత్యభిజ్ఞానము ద్వారా చెప్పుట లేదు అనిన

| | |
|---|---|
| న | = అట్లనుట సరిగాదు. |
| ఉభయస్మిన్నపి | = రెండురకములుగా చెప్పినను. |
| అవిరోధాత్ | = విరోధము లేదు. |

"దివః పరమ్" అనుచోట పంచమీ విభక్తి ద్వారా స్వర్గలోక మర్యాద వినబడుచున్నది. "దివి" అన్నచోట స్వర్గము ఆధారముగా సప్తమి వినబడుచున్నది. విభక్తి భిన్నమగుట వలన ఉపదేశము భేదమగుట వలన ప్రత్యభిజ్ఞ లేదని చెప్పిన అట్లనుట సరిగాదు. రెండు రకములుగా చెప్పినను విరోధము లేదు. విభక్తి వేరైనను ప్రాతిపదికార్ధము (విభక్తి చేర్చుటకు ముందున్న శబ్ద భాగము)ను ప్రత్యబిజ్ఞ గావించిరనిన విరోధముండదు. వృక్షాగ్రమున నున్న గ్రద్దను వృక్షాగ్రమున గ్రద్ద లేక వృక్షాగ్రముపైన గ్రద్ద అని చెప్పిన తేడా లేదు. అట్లే స్వర్గమునకు పైనున్న బ్రహ్మ స్వర్గములో బ్రహ్మ అని చెప్పిన భేదము లేదు. అందువల్ల పూర్వము చెప్పిన బ్రహ్మ యొక్క ప్రత్యభిజ్ఞ గలదు. జ్యోతిః శబ్ద వాచ్యము బ్రహ్మమే.

# 11. ప్రతర్ధనాధికరణము (28-31)

సంగతి : పూర్వ జ్యోతిరధికరణములో త్రిపాద బ్రహ్మ వివేచన సందర్భములో 'యత్' శబ్దముతో సామానాధికరణమగుట వలన జ్యోతి శబ్దమున కర్ధము బ్రహ్మమని చెప్పబడినవి. కాని ఈ అధికరణము నందు 'ప్రాణోస్మి ప్రజ్ఞాత్మ" అను వాక్యములో జీవ ప్రాణలింగములుండుట వలననూ అసాధారణ బ్రహ్మలింగము లేనందువల్లనూ ప్రాణ శబ్దమునకర్ధము బ్రహ్మమని చెప్పుటకు వీలు లేదు. ఈ విధముగా ఇచట ప్రత్యుదాహరణ సంగతి.

విషయము : "సాహోవాచ ప్రాణోస్మి ప్రజ్ఞాత్మ తం మారింమాయురమృత ఇతి ఉపాస్వ" నేను జ్ఞాన రూపమగు ప్రాణమే స్వరూపముగా కలవాడను. అట్టి నన్ను ఆయుస్వరూపునిగాను మోక్ష స్వరూపునిగాను ఉపాసించుము అని ఇంద్రుడు ప్రతర్ధనునికి ఉపదేశించెను. ఈ కౌశీతకీ ఉపనిషత్ వాక్యమిచట విచారణీయ విషయము.

సంశయము : పై వాక్యములో ప్రాణ శబ్దము ద్వారా వాయువునా ఇంద్రదేవతవా జీవునా లేక పరబ్రహ్మమునా ఉపదేశించిరి అని సంశయము.

పూర్వపక్షము : పై చెప్పిన నాలుగు అర్ధముల చిహ్నములుండగా ఒకే బ్రహ్మము యొక్క అర్ధము చెప్పుట ఉచితము గాదు.

సిద్ధాంతము : ప్రాణ శబ్దమునకు అర్ధము బ్రహ్మమనియే చెప్పవలయును. అనేక చిహ్నములు బ్రహ్మమందు మాత్రమే అన్యభిచరిత రూపముగా సిద్ధమగుచున్నవి. బ్రహ్మ భిన్న అర్ధములో ఆ చిహ్నములు నిరుపయోగము. కనుక ప్రాణ శబ్దమునకు అర్ధము బ్రహ్మమనియే స్వీకరింపవలయును.

వై.న్యా.మా. 37. ప్రాణోస్మీత్యత్ర వాయుర్వ్యింద్ర జవ బ్రహ్మసుసంశయః।
చతుర్ణాం లింగసద్భావాత్పూర్వ పక్షస్త్వనిర్ణయః॥

"ప్రాణోస్మి ప్రజ్ఞాత్మాతం మమాయురమమృతమ్ ఇత్యుపాస్వ" ఈ శ్రుతిలో ప్రాణశబ్దము వాయువా లేక ఇంద్రుడా లేక జీవుడా కాక బ్రహ్మ వాచకమా? చెప్పిన శ్రుతిలో నాల్గిటి చిహ్నములున్నవి. అందువల్ల నిశ్చయముగా ప్రాణశబ్దమునకు అర్ధము చెప్పలేము.

వై.న్యా.మా 38. బ్రహ్మణో అనేక లింగాణి తాని సిద్ధాన్యనన్యథా।
అన్యేషా మన్యథా సిద్ధేర్యుత్వాద్యం బ్రహ్మనేతరత్॥

ఇచట బ్రహ్మకు అనేక చిహ్నములున్నవి. అవి అన్నీ సరైనవే, అనవసరములు గావు, ప్రబలమైనవి. ఆ చిహ్నములు ప్రాణ, ఇంద్ర, జీవుల పక్షములో సమన్వయించవు. కాని దీనికి విపరీతముగా ప్రాణ, ఇంద్ర, జీవ చిహ్నములు బ్రహ్మలో సమన్వయమగును. ప్రాణాలింగముల సిద్ధములగుట వలన దుర్భలములు. చెప్పిన శ్రుతిలో ప్రాణ శబ్దముతో బ్రహ్మబోధ కలుగుచున్నది. ప్రాణ వాయువు కాదు.

కౌశీతకీ ఉపనిషత్తునందలి ఇంద్ర ప్రతర్దన కథలో ఇంద్రుడు ప్రతర్దనునితో చెప్పెను. "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తా మాయాయురమ్ అమృతమిత్యుపాస్స్వ" (కౌశీతకి 3.2) "నేను జ్ఞాన రూపమగు ప్రాణమే స్వరూపముగా గలవాడను. అట్టి నన్ను ఆయుస్వరూపువిగాను, మోక్ష స్వరూపునిగాను ఉపాసించుము. అచట నాలుగు రకముల చిహ్నములుండుట వలన నాలుగు ప్రకారముల సంశయము" ఇదం శరీరం పరి గృహ్యోత్తాపయతి (కౌ. 3.3) ఈ ప్రాణము శరీరమును గ్రహించి నడుపుచున్నది అనునది ప్రాణవాయువు చిహ్నము. అస్మి అనునది ఉపదేశికుడైన ఇంద్రుడి అహంకారవాదము. ఇంద్రుడి చిహ్నము. "వక్తారం విద్యాత్" (కౌ. 3.8) "చెప్పువానిని తెలుసుకొనుము" అన్నచోట వక్తృత్వము జీవ చిహ్నము. "ఆనందో అజరో అమృతః" "ఆనంద స్వరూపము, వృద్ధాప్య రహితము, అమరణ ధర్మము" అనునవి బ్రహ్మ చిహ్నములు. ఇచట ప్రబల దుర్బల వివేకములేనందున నిర్ణయము కాలేదని పూర్వపక్షము.

సిద్ధాంతము : బ్రహ్మ చిహ్నములనేకములున్నవి. "త్వమేవ మే వృణీష్వయం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" (కౌ. 3.1) "మనుష్యులకు పరమ పురుషార్థ మన్నదేదియో దానిని నీవే విచారించి నాకు అనుగ్రహింపుము". అనునది "హితతమత్వము పరమపురుషార్థ సాధనము ఒక చిహ్నము "యో మాం విజానీయాత్ నాస్య కేన చిన కిర్మణా లోకోమీయతే నమాతృవధేన నపితృవధేన్" (కౌ. 3.1) 'నాయదార్థ స్వరూపమెవడెరుంగునో అట్టి వాని మోక్ష గతికి ఏ కర్మములును విఘ్న కారణము కానేరవు. మాతృహత్య గాని పితృహత్య కాని భంగము కలిగింపనేరవు. జ్ఞాన మాత్రముచే మహాపాతకములు స్పృశించవు. అనునది వేరొక బ్రహ్మము. అట్లే అన్య ఉదాహరణములు కూడ చెప్పవచ్చును. ఈ చిహ్నములు ప్రాణ, ఇంద్ర, జీవ పక్షములలో చెప్పుటకు వీలు గాదు. కాని ప్రాణాది చిహ్నములు బ్రహ్మకు చెప్పవచ్చును. ప్రాణాదులు బ్రహ్మ బోధకు ద్వారా భూతములు. అట్లు బ్రహ్మ చిహ్నములు అనేక ముండుట వలన అవి కారణములు గాదని చెప్పనలవి కానందున బ్రహ్మ ప్రాభల్యము. ఇచట బ్రహ్మమే ప్రతిపాదింపబడినవి. ప్రాణాదులు కావు.

### 28. ప్రాణ స్తథా అనుగమాత్ 1.1.28

సూత్రార్థము : ప్రాణ శబ్దము బ్రహ్మ వాచకమే అగును. ఎందులకనగా అనే అర్థములో మిగిలిన శ్రుతులు అనుసరించుట వలన ప్రాణ శబ్ద వాచ్యము బ్రహ్మమనే తెలుసుకొనవలయును. ఎందులకనగా పూర్వాపర పర్యాలోచన ద్వారా బ్రహ్మవిషయములోనే శబ్దార్థము సమన్వయమగుచున్నవి. అట్లే "త్వమేవ మే వరం వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" నాకు నువ్వే స్వయముగా వరదానము నిమ్ము. ఏది నువ్వు మనుష్యులకు పురుషార్థ సాధనమని విచారించితివో వానినే ఇమ్ము. హితతమము మనుష్యులకు బ్రహ్మ జ్ఞానమునకన్న వేరుగాదు. అందువల్ల బ్రహ్మమే ప్రాణ శబ్దము. "యోం మాం వేద నహవై తస్య కెనచవ కర్మణా" ఎవరు నన్ను తెలుసుకొందురో వారికి కర్మ లేపము లేదు. వారు అజరామరులు. కర్మ ద్వారా వారిలో ఎచ్చుతగ్గులు రావు. ఈ శ్రుతిలో కర్మ అసంబంధము మరియు అమరత్వము కర్మ వృద్ధి హ్రాసములు లేవని చెప్పిరి. ఇవన్నియు బ్రహ్మ పరముగా చెప్పుట వలననే సరియగును. అందువల్ల ఇచట ప్రాణ శబ్దము బ్రహ్మపరమే.

"మామేవ విజానీహి" నన్నే తెలుసుకొనుము. అని ఉపక్రమించి, "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మ" నేను ప్రజ్ఞాత్మ ప్రాణమును అను అహంకార వాద చిహ్నము ద్వారా ఇంద్రదేవతను చెప్పిరి అనిన –

### 29. న వక్తురాత్మోపదేశాదితి చేద ధ్యాత్మ సంబంధ భూమా హ్యస్మిన్ 1.1.29

సూత్రార్ధము : ఇంద్రుడు ప్రతర్దనునికి "నువ్వు నన్నే తెలుసుకో అని ఆత్మ విశిష్టమైన శరీరమును జ్ఞేయముగా చెప్పెను". అందువల్ల ప్రాణోస్మి ప్రజ్ఞాత్మ అనుశ్రుతిలో ఇంద్రుడే ఉపాస్యుడనిన అది సరిగాదు. ఇదే వాక్యములో బ్రహ్మకు ఆనందత్వము అమృతత్వము ఆదిగా గల అనేక ధర్మములు జెప్పబడెను. అందువల్ల బ్రహ్మమే ఉపాస్యము.

పరబ్రహ్మ వాచకము ప్రాణ శబ్దము గాదు. ఎందులకనగా నన్నే తెలుసుకొనుము. అని ఉపదేశకుడైన ఇంద్రుడు చెప్పినందువల్ల "అవాగమనా" (బృ. 3.8.8) దానిలో మనో వాక్కులు లేవు అనుశ్రుతిలో బ్రహ్మ మందు ఉపదేశ యోగ్యముల ఏదు. "ప్రాణం వై బలం" ఈ శ్రుతిలో ప్రాణమును బలరూపముగా చెప్పిరి. బలమునకు దేవత ఇంద్రుడు వానినే ప్రాణ శబ్దముతో చెప్పిన విరోధము లేదు. ఇంద్రుని జ్ఞానము అప్రతిహతము కనుక ప్రజ్ఞాత్మ అని ఇంద్రుని చెప్పవచ్చును. ఈ విధముగా చెప్పిన పూర్వ పక్షమునకు సిద్ధాంతి చెప్పు సమాధానము. "అధ్యాత్మ సంబంధ భూమా హ్యస్మిన్" ఎందులకనగా ఈ అధ్యాయములో ప్రత్యగాత్మకు సంబంధించిన ఉపదేశములు అనేకములు గలవు.

ఉపదేశికుని ఆత్మోపదేశమెట్లు? "నన్నే ప్రాణముగా తెలుసుకొనుము" అని ఇంద్రుడు ఉపదేశించెను గదా. అది ఎట్లు యుక్తి సంగతమగును?

### 30. శాస్త్ర దృష్ట్యా తు ఉపదేశో వామదేవవత్ 1.1.30

సూత్రార్ధము : వామదేవ శుకదేవులవలె ఇంద్రుడు గూడ బ్రహ్మ జ్ఞాని అనగా ఇంద్రుడికి నేను పరబ్రహ్మననే జ్ఞానము కలదు. ఆ బ్రహ్మ దృష్టితోనే "మామేవ విజానీహి" "నన్నే తెలుసుకొనుము" అని ప్రతీర్ధనునికి ఉపదేశించెను. అందువల్ల 'ప్రాణోస్మి" అన్నచోట ప్రాణము బ్రహ్మమే. ఉపదేశకుడైన ఇంద్రుడు "నన్నే తెలిసికొనుము" అనునది "అహమేవ పరం బ్రహ్మేతి శాస్త్ర దృష్ట్యా బ్రహ్మాత్మానం పశ్యన్నేవ ఉక్తమ్" నేనే పరబ్రహ్మనని శాస్త్ర దృష్టితో తననే బ్రహ్మ దృష్టితో చూచుచు ఉపదేశించెను. ఎట్లనగా వామదేవ ఋషి శాస్త్ర దృష్టితో "నేనే మనువును, నేను సూర్యుని" అని సర్వాత్మను అనుభవించుచు చెప్పెను. ఆ విధముగనే ఇచట ఇంద్రుడు చెప్పెను. అందువల్ల ఈ ఉపదేశము బ్రహ్మపరమే.

అధ్యాత్మ సంబంధము కనపడిననూ దేవాత్మయైన బ్రహ్మోపదేశము గోచరించుట లేదు గనుక ఈ వాక్యము పరబ్రహ్మను గురించి చెప్పుట లేదనిన –

### 31. జీవ ముఖ్య ప్రాణ లింగన్నేతి చేన్నోపాసా త్రైవిద్యా దాశ్రితత్వాదిహ తద్యోగాత్ (1.1.31)

సూత్రార్ధము : జీవ ముఖ్య ప్రాణ హేతువులు కనబడుట వలన "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మ" అను ఉపదేశము బ్రహ్మపరముగాదనిన అట్లనుట సరిగాదు. మూడు రకముల ఉపాసన స్వీకరింపవలయును. బ్రహ్మ లింగము వల్ల ప్రాణ శబ్దమును బ్రహ్మలింగముగా అంగీకరించుట వలన పరమ పురుషార్ధము ఈ శ్రుతిలో చెప్పుట యుక్తి సంగతము.

"వక్తారం విద్యాత్" ఉపదేశికుని తెలుసుకొనుము జీవలింగము. "ఇదం శరీరం పరి గృహ్యోత్తాపయతి" ఈ శరీరమును పట్టుకొని లేవనెత్తుచున్నది. ఇది ముఖ్య ప్రాణలింగము. ఈ రెంటిని లేక ఏదో ఒక దానిని అనగా జీవుని లేక ప్రాణమును గ్రహించవలయును కాని బ్రహ్మమును గాదు అనిన అది సరిగాదు. ఎందులకు జీవోపాసన, ప్రాణోపాసన, బ్రహ్మోపాసన అని త్రివిధోపాసనల ప్రసంగము వచ్చును, అది అభీష్టము గాదు. "మా మేవ విజానీహి" నన్నే తెలుసుకొనుము అని ప్రారంభించి "ప్రాణోస్మి" నేను ప్రాణమును అని చెప్పి "సః ఏష ప్రాణేవ ప్రజ్ఞాత్మ ఆనందో అజిరో అమృతః" అది ప్రాణము ప్రజ్ఞాత్మ, ఆనంద స్వరూపము, అజరము, అమరణ ధర్మము. ఇచట ఆనంద స్వరూపము అవిద్యమాన జరావృద్ధాప్యము లేకుండుట, అమరణధర్మము మొదలగునవి పరమాత్మ లక్షణములు. ఈ శ్రుతిలో ఉపక్రమ ఉపసంహారముల ఏకవాక్యత బ్రహ్మ పరము చెప్పినట్లైననే సరియగును.

అన్యత్ర బ్రహ్మలింగముండుట వలన ప్రాణ శబ్దమునకు బ్రహ్మమని అర్థము చెప్పిరి. అట్లే ఇచట హితతమత్వాది అసాధారణ బ్రహ్మలింగ సంబంధము ద్వారా బ్రహ్మోపదేశమే గాని అన్యార్థము గాదు. ఇది అతి స్పష్టము. బ్రహ్మసూత్ర హృదయము నందు ప్రథమ, అధ్యాయములోని ప్రథమ పాద సంకలనము సమాప్తము.

*****

# ప్రథమాధ్యాయము - ద్వితీయ పాదము

అస్పష్ట బ్రహ్మలింగములతో కూడిన శ్రుతివాక్యములను మరియు ఉపాస్య బ్రహ్మవాక్యముల సమన్వయ మీపాదములో విచారించెదరు. క్రిందటి పాదములో స్పష్ట బ్రహ్మ చిహ్నములు గల వాక్యములను సందిగ్ధమైన కొన్ని వాక్యములను బ్రహ్మమందు సమన్వయము చేసిరి. ఆ వాక్యములందు బ్రహ్మ విషయమైన హేతువులు కలవు. స్పష్ట హేతువులు లేని వాక్యములను సమన్వయ పరచుటకు ద్వితీయ, తృతీయ పాదములో ఆరంభించుచున్నారు. సంపూర్ణ జగత్ కారణత్వము వ్యాపకత్వము నిత్యత్వము మొదలగు బ్రహ్మధర్మములు వెనుకటి పాదములో ప్రసిద్ధములు. వానిని ఆధారముగా చేసుకుని ముందు రెండు పాదములు ఆరంభించిరి. అందువల్ల పూర్వ పాదముతో ఈ రెండు పాదములకు హేతుహేతుమద్ భావ సంగతులని తెలుసుకొనవలయును.

# 12. సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము

సంగతి : ఇచట “మనోమయః ప్రాణ శరీరో భారూప (ఛాం. 3.14.3) అను శ్రుతి వాక్యములో స్పష్ట బ్రహ్మమును బోధించు చిహ్నములు లేవు. స్పష్ట బ్రహ్మలింగమున్న బ్రహ్మ పరకముగా చెప్పగలము. పూర్వాధికరణముతో ఈ అధికరణమునకు ప్రత్యుదాహరణ సంగతి.

విషయము : ఛాందోగ్యోపనిషత్తులోని శాండిల్య విద్యయందు “సక్రతుం కుర్వీత మనో మయః ప్రాణ శరీరో భారూపః” దుఃసంకల్పమును విడిచెదను అని సంకల్పించెను. పరబ్రహ్మమునకు మనస్సే స్వరూపము. జ్ఞానశక్తి, క్రియాశక్తి (ప్రాణము) అనువానితో కూడిన సూక్ష్మ శరీరమే శరీముగా గలవాడు. ఈ శ్రుతి వాక్యమిచట విచారణీయము. మనోమయము జీవాత్మయా? పరమాత్మా అని సంశయము.

పూర్వ పక్షము : ప్రాణము మనస్సు జీవునికి గలవు. హృదయములో గల జీవుని ధర్మము సూక్ష్మత్వము. మనోమయత్వాది ధర్మములు గల జీవుని ఇచట ఉపాసించవలయును.

సిద్ధాంతము : సర్వం ఖల్విదం బ్రహ్మ ఇతి శాంత ఉపాసీత ఇదంతయు బ్రహ్మమే అని నిశ్చయించుకుని శమదమాదులను అవలంబించి శాంతముగా ఉపాసన చేయుము. ఈ వాక్యములో బ్రహ్మ ఉపాసన ద్వారా జీవుని హితము చెప్పబడినవి. ఈ ఉపాసనే శాండిల్య విద్యయందు చెప్పిరి. వేదాంతములో ప్రసిద్ధమైన జగత్ కారణమైన బ్రహ్మను “సర్వం ఖల్విదం బ్రహ్మ” అను వాక్యముతో చెప్పి మరల దానినే మనోమయత్వాతి ధర్మ విశేషములతో ఉపాసన కొరకు ఉపదేశించిరి. ప్రాణాదులతో సంబంధము ఉపాసన కొరకు చెప్పిరి అనిన ప్రసంగమును వదలవలసిన పనిలేదు. మరియు అప్రాసంగికము కూడ గాదు. అందువల్ల ఈ శాండిల్య విద్యలో మనో మయత్వాది విశిష్టగుణములతో బ్రహ్మమే ఉపాస్యమని చెప్పిరి.

వై.న్యా.మా. 39. మనోమయోయం శారీర ఈశోనా ప్రాణమనసే।
హృదయస్థిత్యణీయస్వే జీవే స్యుస్తేన జీవగాః॥

ఇచట చెప్పిన మనోమయము జీవుడా? పరమేశ్వరుడా? ప్రాణ మనస్సులతో సంబంధముండుట, హృదయములో నుండుట మరియు అతి సూక్ష్మమగుట వలన జీవునిలోనే సంభవము. మనో మయత్వాది ధర్మముల సమన్వయమగుట వలన మనోమయము జీవుడే.

వై.న్యా.మా. 40 శమవాక్యగతం బ్రహ్మ తద్ధితాదిరపేక్షతే।
ప్రాణాదియోగశ్చింతార్థాశ్చిన్త్యం బ్రహ్మ ప్రసిద్ధితః॥

మనోమయపదములో నున్న 'మయట్' తద్ధితపదము. ప్రాణ శరీర పదము బహు వ్రీహి సమాసమగుట వలన "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను ప్రాసంగిక శమ వాక్యములో నున్న బ్రహ్మనపేక్షించును. బ్రహ్మమందు ప్రాణ మనస్సుల సంబంధము ఉపాసన కొరకు చెప్పిరి. అన్ని వేదాంత వాక్యములలో ఉపాస్య రూపముగా ప్రసిద్ధమైన బ్రహ్మమునే గ్రహించుట ఉచితము. అందువలన మనోమయము బ్రహ్మమే.

ఛాందోగ్య తృతీయాధ్యాయము నందలి శాండిల్యవిద్యయందు ఈ విధముగా చెప్పిరి. "మనోమయః ప్రాణ శరీరో భారూపః" (ఛా. 3.14.3) చెప్పిరి. ఇచట జీవుడా? ఈశ్వరుడా? అని సందేహము.

మనస్సుతో సంబంధము జీవునిలో సుసంపాద్యము కనుక జీవుడనాలి. మనస్సు యొక్క వికారము మనోమయము. ఇది మనో సంబంధము. "ప్రాణః శరీరమస్య" అని ప్రాణ సంబంధము. ఈ రెండు ఈశ్వరుని సుసంపాద్యములు గావు. "అప్రాణోహ్యమనా శుభ్రః" (ముం. 2.1.3) "ఆ పరమేశ్వరునకు సూక్ష్మ శరీరము లేదు, మనస్సు లేదు, ఆయన నిర్మలుడు". అని ఈశ్వరుని యందు మనసు నిషేధించిరి. మరియు "ఏష మే ఆత్మా అన్తర్ హృదయమే అణీయాన్" (ఛాం. 3.14.3) ఈనా ఆత్మ హృదయము లోపల ధాన్య కణము కన్న యవల కణము కన్న చిన్నదై యున్నది. ఈ శ్రుతిలో వినబడు హృదయములోపల ఉన్నది. అణుమాత్రమై యున్నది అను ధర్మములు నిరాధారములు, సర్వగతమైన ఈశ్వరుని యందు ఏ విధముగను యుక్తి సంగతములు గావు. అందువలన మనోమయము జీవుడు. ఈపూర్వపక్షమునకు సిద్ధాంతి సమాధానము – "సర్వం ఖల్విదం బ్రహ్మ।" తజ్జలాని ఇతి శాంత ఉపాసీత (ఛాం. 3.14.1) నిశ్చయముగా ఇదంతయు బ్రహ్మమే. ఎందులకనగా ఈ జగత్తు వాలినుండే ఉత్పన్నమైనది. వానిలో లీనమగుచున్నది. వానిలోనే స్థితి కాలములో చేష్ట కలిగియున్నది. అందువల్ల బ్రహ్మోపాసకుడు శమాదుల నాచరించి శాంతించవలయును. ఈ వాక్యములో శమవిధిపరముగా వినవచ్చు బ్రహ్మమునే తరువాత చెప్పిన మనోమయాది శ్రుతి ద్వారా విశేషముగా చెప్పబడినవి. అనగా "మనోమయః ప్రణ శరీరః" అను తద్ధిత బహువ్రీహీల ద్వారా విశేషముగా చెప్పిరి. శమ వాక్యమునకు అర్థము ఎందువల్ల ఇదంతయు బ్రహ్మమో దేని నుండి జగదుత్పత్తి స్థితి లయములు కల్గుచున్నవో ఆ సర్వాత్మ బ్రహ్మమందు రాగద్వేష విషయములు సంభవములు గావు గనుక ఉపాసన కాలములో శాంతుడవై ఉండుము. ఈ వాక్యము బ్రహ్మపరము గనుక విశేషణత్వముగా చెప్పిన మనోమయత్వాదులు గూడ బ్రహ్మపరములగును. బ్రహ్మమందు మనో ప్రాణ సంబంధము యుక్తము గాదని చెప్పితివి గదా దానికి సమాధానము వినుము – నిరుపాధిక బ్రహ్మము నందు అవి యుక్తి యుక్తములు గావు గాని ఉపాస్యమైన సోపాధికమందు అవి యుక్తి యుక్తములే. అందువల్ల అన్ని వేదాంత వాక్యములలో ఏ బ్రహ్మము ప్రసిద్ధమో దానినే ఇచట కూడ ఉపాసించవలయును. వేదాంత వాక్యములలో జీవుని ఉపాస్యముగా ఎచటను చెప్పలేదు. అందువల్ల మనోమయత్వాది బ్రహ్మమే.

## 32. సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ (1.2.1)

సూత్రార్థము : పరబ్రహ్మమునే జగత్కారణముగా అన్ని వేదాంత వాక్యములలో ఉపాస్యముగా చెప్పిరి. మనో మయత్వాది విశేషగుణముల ద్వారా ఆ బ్రహ్మమే మయత్వాది విశేషగుణముల ద్వారా ఆ బ్రహ్మమే ఉపాస్యము, జీవుడు కాదు.

అన్ని వేదాంత వాక్యములలో జగత్కారణముగా ప్రసిద్ధి చెందిన బ్రహ్మమునే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను ఉపక్రమ వాక్యములో చెప్పి మరల దానినే మనోమయత్వాది విశేష గుణములతో చెప్పినందువల్ల బ్రహ్మమే ఉపాస్యము. ఇట్లు చెప్పిన ప్రకృతహాని అప్రకృత ఉపాదేయం కాదు. వాక్యోపక్రమములో శమాదులను విధించినను సన్నిహితముగా ఉండుట వలన బ్రహ్మమే ఉపాస్యము. జీవుని సన్నిహితముగా చెప్పలేదు. మరియు బ్రహ్మముతో సమానముగా జీవుని చెప్పు వాచక శబ్దములు లేవు. కనుక మనోమయత్వాది ధర్మ విశేషములతో బ్రహ్మోపాసనమే చెప్పబడినది. అంతయు బ్రహ్మ వికారమే గనుక.

## 33. వివక్షిత గుణోపపత్తేశ్చ 1.2.2

సూత్రార్థము : ఉపాసన కొరకు ఉపదేశింపబడిన సత్య సంకల్పత్వము భారూపత్వము వెలిదలుగా గల గుణములు బ్రహ్మమందే సమన్వయించును. అందువల్ల మనోమయము బ్రహ్మమే.

మనోమయత్వాది వాక్యములో చేసినది బ్రహ్మోపదేశమే. ఎందుకలనగా "భా రూపః సత్య సంకల్పః" సత్య సంకల్పుడు, ప్రకాశ స్వరూపుడు అను గుణములతో ఉపాసన కొరకు బ్రహ్మమునే ఉపదేశించిరి. సత్య సంకల్పము అనగా సృష్ట్యాదులలో అప్రతిబంధ శక్తి సంపన్నుడు అనునది పరమాత్మ యందే యుక్తి యుక్తము. "మనోమయత్వము ప్రాణ శరీరము" అను జీవలక్షణములు పరమాత్మయందు చెప్పుట సరికాదు అనిన అట్లనుట సరిగాదు. మనోమయత్వాది జీవుని అసాధారణ ధర్మమైనను సత్య సంకల్పాది బ్రహ్మను చెప్పు హేతువుల ద్వారా మరియు సర్వాత్మ కత్వము వల్లను బ్రహ్మమునే మనోమయత్వాదుల ద్వారా చెప్పవలయును. సర్వాత్మత్వము అనగా అందరిలో సమానముగా ఉన్న చైతన్య స్వరూపుడు అది జీవునికి సంభవము గాదు. సర్వాత్మము శ్వేతాశ్వతరోపనిషత్తులో ఈ విధముగా చెప్పిరి. "త్వం స్త్రీ త్వం పుమానసి" (శ్వేతా. 4.3) నీవే స్త్రీవి, నీవే పురుషుడవు, నీవే బాలుడవు, నీవే బాలికవి "సర్వతః పాణి పాదం" (గీత. 13.13) ఆ బ్రహ్మమునకు చేతులు, కాళ్ళు, కన్నులు, తలలు, ముఖములు అనునవి అనంతముగా ఉన్నవి. ఈ సర్వాత్మత్వము గీతలో కూడ ప్రసిద్ధము. మనోమయత్వాది గుణముల ద్వారా బ్రహ్మమే ఉపాస్యము.

## 34. అనుపపత్తేస్తు న శరీరః (1.2.3)

సూత్రార్థము : సత్య సంకల్పత్వాది గుణములు జీవునిలో సంభవము గావు. శారీరః = జీవః = సత్య సంకల్పత్వాది గుణముల ద్వారా ఉపాస్యుడు గాడు బ్రహ్మమే ఉపాస్యము.

సూత్రములో నున్న 'తు' శబ్దము నిశ్చయార్థము. మనోమయత్వాది గుణములు గలవాడు బ్రహ్మమే జీవుడు గాదు. ఎందులకనగా "సత్య సంకల్పః ఆకాశ ఆత్మ" (ఛాం. 3.14.2) "అవాకీ అనాదరః" (ఛాం. 3.14.4) "జ్యాయాన్ పృథివ్యాః" (ఛాం. 3.14.3) సత్య సంకల్పుడు ఆకాశముతో సమానమైన స్వరూపము

కలవాడు. పరమాత్మ ఇంద్రియ రహితుడు ఆగ్రహ రహితుడు అనగా కోరికలు లేనివాడు. పృథివీకన్న శ్రేష్ఠుడు. ఈ గుణములు జీవునిలో సంభవము గావు. కాన మనోమయత్వాది ధర్మములు బ్రహ్మమునకే చెప్పిరి.

### 35. కర్మ కర్తృ వ్యపదేశాచ్చ (1.2.4)

సూత్రార్థము : "ఏతః మితః ప్రేత్యాభి సంభవితాస్మి" అను శ్రుతిలో ఏతం శబ్దముతో చెప్పిన ప్రకృత బ్రహ్మము పొందబడేది – కర్మ 'అభిసంభవితాస్మి' అని జీవుడు పొందేటి వంటి కర్త అని ఉపదేశించిరి. మనోమయత్వాది గుణములతో బ్రహ్మమే ఉపాస్యము జీవుడు గాదు.

కర్మ కర్తృ భేద ఉపదేశము వల్ల ఉపాస్యము జీవుడు గాదు. "ఏతమితః ప్రేత్యాభిసంభవితాస్మి" (ఛాం. 3.14.4) ఏతం పదము ద్వారా మనో మయత్వాది ఉపాస్య గుణముల ద్వారా బ్రహ్మము కర్మగా చెప్పబడినది. "అభిసంభవితాస్మి" అనగా పొందుతాను అని జీవుని కర్తగా చెప్పిరి.

### 36. శబ్ద విశేషాత్ (1.2.5)

సూత్రార్థము : "అంతరాత్మన్ పురుషో హిరణ్మయః" (శత బా 10.6.3.2) ఈ శ్రుతిలో జీవ పరమాత్మలను చెప్పు సప్తమీ విభక్తి మరియు ప్రథమా విభక్తి శబ్దమునకు భేదముండుట వలన జీవుడు ఉపాస్యుడు గాడు. "అంతరాత్మన్" సప్తమీ విభక్తి, పురుషః ప్రథమా విభక్తి.

శబ్ద భేదము వల్ల గూడ జీవుని కన్న భిన్నము మనోమయత్వాది గుణములు గల పరమాత్మ ఇలాంటి ప్రకరణములోనే వేరొక శ్రుతిలో "అంతరాత్మన్ పురుషో హిరణ్మయః" అనుచోట జీవు వాచకము అంతరాత్మన్ అను శబ్దము సప్తమ్యంతము. దానికన్న భిన్నము పురుష శబ్దము ప్రథమాంతము. మనోమయత్వాది విశిష్ట గుణములు గలది పరమాత్మ, ఉపాస్య స్వరూపముగా చెప్పబడినది. కనుక బ్రహ్మమే ఉపాస్యము.

### 37. స్మృతేశ్చ (1.2.6)

సూత్రార్థము : "ఈశ్వరః సర్వ భూతానామ్" అను గీతావాక్యములో భేద స్మరణము వల్ల జీవుడు ఉపాస్యుడు గాడు. (గీత. 18.61) "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్టతి" (గీత 18.61) సంపూర్ణ భూతముల హృదయ దేశములో ఈశ్వరుడు ఉండి మాయ ద్వారా ఈ భూతములను త్రిప్పుచున్నాడు. ఇలాంటి స్మృతులలో జీవ పరమాత్మల భేద స్మరణము వల్ల బ్రహ్మ కన్న భిన్నుడైన జీవుడు ఉపాస్యుడు గాడు. కల్పింపబడిన భేదము వల్ల గూడ జీవుడు ఉపాస్యుడు గాడని చెప్పిరి. ఆకాశము అపరిచ్ఛిన్నము వ్యాపకమైనను కల్పించిన ఘటాదుల భిన్నత్వము వల్ల ఉపాధి భేదము ననుసరించి వ్యవహరింతురు. అట్లే జీవోపాధి వల్ల భేదము స్వీకరించిరి. ఇంతవరకు జీవుడు ఉపాస్యుడు కాదని నిర్ణయించి ఇపుడు పరమాత్మ ఉపాస్యత్వము శంకించుచున్నాడు.

### 38. అర్భ కౌకస్త్వాత్త ద్వ్యపదేశాచ్చనేతి చేన్న నిచా యత్వాదేవం వ్యోమవచ్చ (1.2.7)

సూత్రార్థము : అర్భ కౌకస్త్వాత్ = అల్ప స్థానములో నుండుట వలన తద్వ్యపదేశాత్ = శ్రతి స్వశబ్దము ద్వారా అనీయాన్ అని చెప్పుట వలన జీవుడే ఉపాస్యుడు.

న = పరమాత్మ గాదు.

ఇతి చేన్న ఏవం = అర్భ కౌకము మరియు అణీయస్త్వము మొదలగు విశేషరూపములు.

నిచాయత్వాత్ = పరమాత్మ సాక్షాత్కరించును.

వ్యోమవచ్చ = సర్వవ్యాపకమైన ఆకాశమును సూదిలో ఉన్న సూచ్యాకాశమని నట్లు, బ్రహ్మకు అణీయస్త్వము ఉపదేశించిరి. అందువల్ల బ్రహ్మమే ఉపాస్యము.

శ్రుతి స్వశబ్దముతో అల్ప స్థానములో నున్న ఆత్మను అణీయాన్ అని ఉపదేశించుట వల్ల జీవుడే ఉపాస్యుడు అనిన అట్లనుట సరిగాదు. అల్ప స్థానములోనున్న పరమాత్మయే ఉపాస్యము. సూదిలోనున్న ఆకాశమును సూచ్యాకాశమన్నట్లు, వ్యాపకమైనను అణీయస్త్వ ఉపదేశము ఉపాధి సంసర్గము వల్ల బ్రహ్మోపదేశమే. అర్భ కౌకము = అల్ప స్థానము దేనికి కలదో అది. దాని భావము అర్భకౌకస్త్వము "ఏషమే ఆత్మ అంతర్ హృదయే" ఈ నా ఆత్మ హృదయములో నున్నది. "అణీయాన్ వ్రీహే ర్వాయవాద్వా". వడ్ల గింజకంటెను యవ బీజము కంటెను సూక్ష్మమైనది. (ఛాం. 3.14.3) అన్నచోట శ్రుతి స్వశబ్దము ద్వారా సూక్ష్మ దేశ ఉపదేశము చెప్పెను. ఇనుప చీలక యొక్క (గుఱ్ఱపు బండితోలు వాని చేతిలో నున్న కర్ర మొదలు యందుండు ఇనుప చీల అగ్రభాగము) కాన మంత్రమును ఆరాగ్రమాత్రమందురు. ఆరాగ్రమాత్రముగ జీవుని ఉపదేశించిరి. సర్వ వ్యాపకమైన పరమాత్మను ఇచట ఉపదేశించలేదనిన, అట్లనుట సరిగాదు. హృదయ దేశములో సాక్షాత్కరించును గనుక అర్భ కౌకస్త్వము అణీయస్త్వ గుణములతో చెప్పిరి. అణీయస్త్వాది గుణములతో హృదయ దేశములో అనుభవించవలయునవి ఉపదేశము. ఏవిధముగా శాలగ్రామ శిలలో విష్ణు దృష్టి నుంచి పూజించెదరో అట్లే. సర్వ వ్యాపకుడైనను ఆ హృదయములో ఉపాసించిన ప్రసన్నుడగును. గనుక అణీయస్త్వాది గుణోపదేశము విరుద్ధము గాదు. అందువల్ల వాని సర్వ వ్యాపమత్వదిమునకు హాని కలుగదు ఆకాశమువలె సంభవము గనుక సర్వ వ్యాపకమైనను ఆకాశమును సూదిలో నున్న ఆకాశము, కుండలో నున్న ఆకాశమువలె సూక్షదేశములో చెప్పిన విధముగ ఉపాసన చేసి సాక్షాత్కరించు ఉద్దేశ్యముతో అర్భకౌకస్త్వము, అణీయస్త్వమును చెప్పిరి గాని పరమార్ధ దృష్టిలో గాదు.

పరబ్రహ్మము సర్వ వ్యాపకుడనిన అన్ని ప్రాణుల హృదయములో సంబంధముండుట వలన ఆ ప్రాణుల సుఖ దుఃఖములు బ్రహ్మకు కూడ కలుగుననిన, ఈ సందేహము ముందు సూత్రము ద్వారా పరిహరించుచున్నారు.

## 39. సంభోగ ప్రాప్తి రితి చేన్న వైశేష్యాత్ (1.2.8)

సూత్రార్ధము : సంభోగ ప్రాప్తిః = పరమాత్మ సర్వగతుడు గనుక అవిశేష చైతన్యము వలన సర్వ ప్రాణుల సుఖ దుఃఖముల సంస్పర్శ వానికి గలుగును.

ఇతి చేతన = అట్లనిన అది సరిగాదు

వైశేష్యాత్ = జీవ బ్రహ్మలలో బోక్తృత్వ అభోక్తృత్వ విశేషముండుట వలన మనోమయత్వాది గుణములతో పరమాత్మనే ఉపాసించవలయును.

పరమాత్మ సర్వ వ్యాపకుడగుట వలన చైతన్య స్వరూపుడగుట వలన జీవుని వలె సుఖ దుః ఖములనుభవించుననిన, అట్లనుట సరిగాదు. జీవుడు భోక్త, పరమేశ్వరుడు భోక్త కాదు. ఈ భేదము వలన వ్యవహారదశలో జీవ బ్రహ్మలు వేరు. అందువల్ల జీవ భోగమువల్ల పరమాత్మయందు భోగము లేదు.

ఆకాశము వలె బ్రహ్మ వ్యాపకుడైన అన్ని జీవుల హృదయములలో సంబంధముండుట వలన జీవుని వలె బ్రహ్మ సుఖ దుఃఖములు అనుభవించుననని అది సరిగాదు. జీవుని యందు గల భోక్తృత్వము బ్రహ్మ యందు లేదు గనుక. జీవుని భోగము ద్వారా పరమాత్మకు సుఖ దుఃఖములుండవు. "నాన్యతో అస్తి ద్రష్టా" వానికన్న భిన్నమైన వేరొక ద్రష్ట లేదు (బృ-3.7.23) "తత్వమసి" ఇత్యాది శ్రుతుల ద్వారా జీవ బ్రహ్మల ఏకత్వము తెలియుచున్నది. కాన జీవుని దుఃఖము బ్రహ్మకు కల్గును అని చెప్పుటకు గూడ వీలు లేదు. మిథ్యా జ్ఞానము ద్వారా కల్పింపబడిన సుఖ దుఃఖములు సమ్యక్ జ్ఞానమునకు విషయమైన బ్రహ్మమందులేవు. అజ్ఞానులు ఆకాశమునందు మలినత్వము, బోర్లించిన మూకుడివలె కనుపించును అను ధర్మముల ఆరోపించినను వాస్తవముగా ఆధర్మములతో ఆకాశమునకు సంబంధము లేదు. మిథ్యా జ్ఞానము ద్వారా కల్పింపబడిన భోగములు గాని, వాని గంధ లేశము గాని ఈశ్వరుని యందు కల్పింప శక్యము గాదు. ఈ మనోమయత్వాది గుణముల ద్వారా ఈశ్వరుడే ఉపాస్యుడు.

## 13. అత్త్రధికరణము (1.2.2)

సంగతి : పూర్వాధికరణములో బ్రహ్మమందు భోక్తృత్వము సంభవము కాదని చెప్పిరి. ఈ అధికరణములో బ్రహ్మమందు కర్తృత్వము గూడ లేదని చెప్పుచున్నారు. కాన ఇచట ప్రత్యుదాహరణ సంగతి.

విషయము : "యస్య బ్రహ్మచక్షత్రంచ ఉభే భవత్ ఓదనః" "ఎవనికి సర్వలోక స్థితి కారకులగు బ్రాహ్మణ క్షత్రియ కులములు (ఆహారము) అన్న స్థానీయములో" (కఠ. 1.2.24) అను కఠ శ్రుతిలో భుజించువాడు వినబడుచున్నాడు. అదియే ఇచట విచారణీయము.

సంశయము : ఈ శ్రుతిలో భుజించువాడు జీవుడా, అగ్నియా లేక ఈశ్వరుడా? అని సంశయము.

పూర్వ పక్షము : అన్నము జీవునికి ఇష్టము. మరియు 'స్వాదత్తి" రుచికరమైనవి తినును అని శ్రుతిలో గూడ చెప్పిరి. అందువల్ల భుజించువాడు జీవాత్మయని చెప్పవలయును. లేక అగ్నిని భుజించువాడు అని చెప్పవలయును. ఎందులకనగా "అగ్నిరన్నాదః" "అగ్ని సంపూర్ణ అన్నమును తినువాడు" (బృ. 1.4.6) అనుశ్రుతిలో అగ్నిని అన్నాదః అని చెప్పిరి గనుక. బ్రాహ్మణ క్షత్రియ కులములు మరియు పూర్తిగా జగత్తు ఎవరికి భోజ్యములో అలాంటి ఈశ్వరుడే భోక్త కాగలడు. ఈశ్వరుడి విషయములో ప్రశ్నోత్తరములో నచికేత యమరాజులకు జరుగుచున్నవి. అంతేగాక అత్తృత్వ మనగా ఇచట సంహారార్థము అని చెప్పుటయే ఉచితము. గాన పరమాత్మయే భోక్త రూపముగా చెప్పబడెను. భోక్త ఇచట పరమాత్మయే.

వై.న్యా.మా. 41.3 జీవోగ్ని రీశోవాత్తా స్వాదోదనే జీవ ఇష్యతామ్।
"స్వాద్వత్తీతి"శ్రతేర్వహ్నిర్వాగ్నిరన్నాదః ఇత్యతః॥

"యస్య బ్రహ్మచ క్షత్రంచ" ఈ మంత్రములో కనబడు "అత్తా" (భోక్తా) జీవుడా అగ్నియా, లేక పరమేశ్వరుడా? భోక్తా జీవుడే, ఎందులకనగా "తయేరన్యః పిప్పలం స్వాద్వత్తి" ఆ రెంటిలో ఒకటి మధుర కర్మఫలం అనుభవించును. అవి జీవుని భోక్తగా చెప్పిరి. లేక అగ్ని భోక్త అనవచ్చును. ఎందువలననగా "అగ్ని రన్నాదః" అగ్ని అన్న భక్షకుడన్న శ్రతిలో అగ్నిని భోక్తగా చెప్పిరి.

వై.న్యా.మా. 42.4 బ్రహ్మ క్షత్రాది జగతో భోజ్యత్వాత్స్యాది హేశ్వరః।
ఈశప్రశ్నోత్తరత్వాచ్చ సంహారస్తస్య చాత్తృతా॥

శ్రుతిలో బ్రహ్మ, క్షత్ర పదములు సంపూర్ణ జగత్తునకు ఉపలక్షణములు. సంపూర్ణ జగత్తును భక్షించుట (సంహరించుట) వలన ఇచట భోక్త ఈశ్వరుడే. రెండవ మాట – పై చెప్పిన శ్రుతి ఈశ్వర విషయ ప్రశ్నకు సమాధానముగ చెప్పబడినది. కనుక ఇచట అత్తా ఈశ్వరుడే. అత్తా అనగా సంహార కర్త. జగత్తును ఈశ్వరుడే సంహరించగలడు.

కఠోపనిషత్తులో రెండవవల్లిలో చెప్పబడినది. "యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవత ఓదనః", మృత్యు యస్యోప సేచనం క ఇత్థావేద యత్రసః" (కఠో 1.2.24) "బ్రాహ్మణ క్షత్రియ జాతి ఎవరికి అన్న స్థానీయమో మృత్యువు కూర స్థానీయమో, ఆ పురుషుడు ఉండు స్థానము "ఇదమిత్థం" "ఇది ఈ ప్రకారమని ఎవరు తెలుసుకోగలరు?" ఎవరు తెలుసుకొనలేరని అర్థము. ఇచట అన్నము, కూరలు అనే శబ్దము వలన ఎవరో భక్షకులున్నారని తెలియుచున్నది. అతడు జీవుడా, అగ్నియా, ఈశ్వరుడా అని సంశయము.

జీవుడనే చెప్పవలయును. ఎందులకనగా "ఆ రెండిలో ఒకటి మధుర కర్మ ఫలము. అనుభవించుచున్నది. అని జీవుని భక్షకునిగా చెప్పిరి గనుక. లేదా అగ్ని అన్న భక్షకుడనుట వలన అగ్నిని భక్షకుడని చెప్పగలము. ఈ పూర్వ పక్షమునకు సమాధానము. బ్రాహ్మణ క్షత్రియ జాతులు ఉపలక్షణముగ చెప్పుచు సంపూర్ణ జగత్తునిచట భోజ్యముగ చెప్పిరి. అటువంటి భోజ్యమును భుజించువాడు ఈశ్వని కన్న అన్యుడు గాలేదు. మరియు ధర్మా ధర్మముల కన్న ఆవలనున్నది. కృతా కృతముల కన్న వేరైనది భూత భవిష్యత్తుల కన్న భిన్నమైన తత్వమును నీవనుభవించుదానిని గురించి చెప్పుము అని నచికేతుడు యమధర్మరాజునడిగెను. ధర్మాధర్మాతీతము కార్యకారణాతీతము త్రికాలతీతమైన పరమేశ్వరుని గురించి నచికేతుడడుగగా "యస్య బ్రహ్మచ" అను వాక్యము ద్వారా యముడు సమాధానమిచ్చెను. అందువల్ల ఇచట ఈశ్వరుడే ప్రతిపాద్యుడు. "అనశ్నన్యన్యో అభిచాకశీతి" "రెండవ వాడు దేనిని భుజించక ఊరకుండును". అని ఈశ్వరుని యందు భోక్తృత్వము నిషేధించిరి. ఇచట భుజించుట అత్తృత్వము అనగా సంహార కర్తృత్వము దానిని నిషేధించలేదు. సంహార కర్తృత్వము అన్ని వేదాంతములలో ప్రసిద్ధమే.

**40. అత్తా చరాచర గ్రహణాత్ (1.2.9)**

సూత్రార్థము : భుజించువాడు అనగా సంహారకర్త. పరమాత్మయే లాక్షణికముగ స్థావర జంగములను సంహరించువాడు అని చెప్పుట వలన సర్వ సంహార కర్తృత్వము పరమాత్మయందె ఒప్పును. జీవుని యందు అగ్నియందు కాదు. భోక్త (భుజించువాడు) ఇచట పరమాత్మయే, స్థావర జంగములను భుజించువాడు అనుట

వలన భుజించువాడు అనగా సంహారకర్త. సంపూర్ణ చరాచర జగత్తును పరమాత్మకన్న భిన్నమయిన వారెవరు సంహరించజాలరు. సంపూర్ణ సంసారము బ్రాహ్మణ క్షత్రియుల ద్వారా ఉపలక్షితమైనది. దానిని సంహరించువాడు పరమాత్మయే కాని ఏ దేవదానవుల ద్వారా సంభవము గాదు. అందరిని సంహరించు మృత్యుదేవత వానికి ఉపసేచనము (కూర లేక ఊరగాయ) అని చెప్పుట వలన సంపూర్ణ ప్రాణులు అన్న స్థానీయులు గాన సంపూర్ణ జగత్తును లయము చేయువాడు పరమాత్మయే. మరి "అనశ్నన్ అన్యో అభిచాకశీతి" అనగా ఒక పక్షి భోక్తా రెండవది దానిని ప్రకాశింపచేయునని చెప్పినందువల్ల ముండక శ్రుతిలో, పరమాత్మ భుజించువాడు అనుట సరిగాదు. ఎందులకనగా పై ముండక శ్రుతిలో పరమాత్మయందు కర్మఫల భోక్తృత్వము నిషేధించిరే కాని వికారరూపమైన సంహారమును నిషిద్ధించలేదు. అందువల్ల పరమాత్మయే "అత్తా" సంహారకర్తా.

**41. ప్రకరణాచ్చ (1.2.10)**

సూత్రార్థము : కఠ శ్రుతిలో పరమాత్మ ప్రకరణ ప్రసంగము వల్ల పరమాత్మయే అత్తా సూత్రములోని 'చ' కారము ద్వారా "క ఇత్థా వేద యత్ర సః" "వానిని ఎవరు గ్రహించగలరు" పరమాత్మయే సంహారకర్త వేరెవరు గాదు. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్". "చైతన్య ఆత్మను అనుభవించు జ్ఞానికి చావు పుట్టుకలు లేవు" (కఠ. 1.2.18) అవి పరమాత్మ ప్రసంగము ప్రకృత విషయ ప్రకరణము. సూత్రములోని చకారము ద్వారా వానిని ఎవరు తెలిసికొనగలరు అను శ్రుతిలోని గ్రహించిరి. పరమాత్మను తెలుసుకొనుట చాల కష్టము అను అసాధారణ హేతువు గూడ పరమాత్మనే అత్తా అనుచున్నది.

# 14. గుహాధికరణము

సంగతి : పూర్వాధికరణములో బ్రాహ్మణ క్షత్రియుల సమీపమున మృత్యుపదములుండుట వలన సంపూర్ణ జగత్తు అనిత్యమని చెప్పి దానిని సంహరించువాడు పరమాత్మయనిరి. అట్లే ఇచట 'పబత్' శబ్దమునకు సమీపమున 'గుహా' ప్రవేశ శబ్దము గలదు. గుహా ప్రవేశ శబ్దము గలదు. గుహా ప్రవేశకులు బుద్ధి జీవులని పూర్వ పక్షము చేసినందున ఈ అధికరణము మొదలైనది. ఇచట దృష్టాంత సంగతి.

విషయము : 'ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రతిష్ఠౌ పరమే పరార్ధే" కర్మ ఫలమునను భవించుచు హృదయాకాశ గుహయందు నీడ, ఎండవలె పరస్పర భిన్న స్వభావముతో ఇరువురు కర్మ గోచరులై ఉన్నారు. (కఠ 1.3.1) అను శ్రుతి విచారణీయ విషయము.

సంశయము : ఈ శ్రుతిలో గుహలో ప్రవేశించిన వారు బుద్ధి జీవులా? లేక జీవాత్మ పరమాత్మలా అని సంశయము.

పూర్వపక్షము : ఎండ నీడల వలే భిన్న లక్షణములు గల జడ బుద్ధి చైతన్య జీవాత్మయే గుహలో ప్రవేశించారని చెప్పవలయును.

సిద్ధాంతము : జీవాత్మ పరమాత్మలనే చెప్పవలయును. "పిబంతౌ" అను ద్వివచన ప్రయోగము వలన ఒకడు

జీవచైతన్యమైన వేరొకడు ఈశ్వర చైతన్యమనుటయే ఉచితము. పరమాత్మ హృదయములో ప్రకటమగును గనుక హృదయస్థమనిరి. ఉపాధి వల్ల జీవేశ్వము విలక్షణము చెప్పుట సంభవము. సర్వ వ్యాపక బ్రహ్మను సాక్షాత్కరించుకొనుటకు దేశ విశేషము చెప్పుట విరుద్ధము గాదు. గాన గుహలో ప్రవేశించిన వారు జీవేశ్వరులు.

వై.న్యా.మా. 43.5 గుహాం ప్రవిష్టౌ ధీజనౌ జీవేశౌవా హృదిస్థితా।
ఛాయాతపా ఖ్యదృష్టాన్తాద్ ధీజౌనౌ స్తో విలక్షణౌ॥

"ఋతం పి బన్తౌ" ఈ శ్రుతిలో చెప్పిన ప్రవేశకర్తలు బుద్ధి మరియు జీవుడా? లేక జీవుడు మరియు పరమేశ్వరుడా? హృదయములో నున్నారని చెప్పిరి. ఎండ నీడ దృష్టాంతముగా చెప్పబడుట వల్ల ప్రవేశకర్తలు విలక్షణమైన బుద్ధి మరియు జీవుడు.

వై.న్యా.మా. 44.6 పిబన్తావితి చైతన్యద్వయం జీవేశ్వరౌ తతః।
హృత్ స్థానముపలబ్ధ్యై స్యాద్వై లక్షణ్యముపాధితః॥

"పిబన్తౌ" అన్నచోట ద్వివచనము తెలియుచున్నది. అందువల్ల రెండు చైతన్యములే కాన, ప్రవేశకర్తలు జీవేశ్వరులు. హృదయ స్థానము ఉపాసన కొరకు చెప్పిరి. జీవుడు సోపాధికుడు గాన ఛాయ వంటి వాడు. మరియు ఈశ్వరుడు నిరుపాధికుడు గాన ఎండ వంటి వాడు. ఈ ప్రకారము ఇద్దరిలో వైలక్షణ్యము గలదు.

మూడవ కఠవల్లిలో మొదలులో వినవచ్చుచున్నది. "ఋతౌ పిబన్తౌ సుకృతస్యలోకే0 గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే। ఛాయతపౌ బ్రహ్మ విదో వదన్తి పఞ్చాగ్నయో యేచ త్రినాచికేతాః॥ అవశ్య భోక్తవ్యమగు కర్మఫలమనుభవించుచు సర్వోత్తమంబును పరతత్వమునకు నివాసనంబును అగు హృదయమున ఆకాశమును గుహయందు నిలచి నీడయు ఎండయును వలె పరస్పర భిన్న స్వభావముతో ఇరువురు కర్మ గోచరులైయున్నారు. ఈ విషయమును బ్రహ్మవేత్తలును కర్మ పరాయినులు నాచికేతాగ్ని చయనము చేసిన వారు గూడ చెప్పెదరు. సుకృత కర్మఫలరూపమైన బ్రాహ్మణాది శరీరములు పరబ్రహ్మ ఉపలబ్ది కొరకు, అవి జ్ఞానాధికార కారణమైన శమాదులతో కూడుకొనినవి. అటువంటి శరీర మధ్యలో నున్న హృదయ గుహయందు ప్రవేశించిరి. లేక ఋతమనగా కర్మ ఫలమనుభవించుచు ఎండనీడల వలె విరుద్ధ స్వభావము గలవారు హృదగుహలో ప్రవేశించిరి. ఆ ప్రవేశించిన వారు బుద్ధి జీవులా లేక జీవేశ్వరులా? అని సంశయము.

బుద్ధి జీవులని పూర్వ పక్షము. వీరు గుహయందు ప్రవేశించగలరు. ఎండ నీడలులాగ వీరిలో జడ చేతనములు అను వైలక్షణ్యము కూడ గలదు.

సమాధానము : 'పిబన్తౌ' అను ద్వివచన విభక్తి ప్రయోగము ద్వారా ఇద్దరూ చైతన్యవంతులేనని ప్రతీతి అగుచున్నది. అందువల్ల చైతన్యములైన జీవేశ్వరులిచట ప్రవేశించిరి. సర్వ వ్యాపకమైన ఈశ్వరుని ఉపలబ్ది కొరకు హృదయ స్థానము వర్ణించిరి. ఇద్దరూ చైతన్యవంతులైనను సోపాధిక నిరుపాధికముల ద్వారా వైలక్ష్యణ్యము కలదు.

### 42. గుహాం ప్రవిష్టా వాత్మానౌహి తద్దశర్శనాత్ (1-2-11)

సూత్రార్థము : 'ఋతం పిబన్తౌ' అను మంత్రములో జీవ పరమాత్మలే గుహయందు ప్రవేశించిరి. ఇచట

సంఖ్య వినబడుట వలన రెండవది మూడవది అని చెప్పిటన్లు దానికి సజాతీయ వస్తువును గ్రహించుట ప్రశస్తి. 'పిబన్తౌ' త్రాగుచున్నారు అని సిద్ధమైన జీవాత్మతో పరమాత్మయే తోటి వాడగును. ఎందులకనగా ఇద్దరూ చైతన్యవంతులు. బుద్ధి జడము గనుక తోటిది గాలేదు.

జీవ పరమాత్మలనే ఇచట గ్రహించవలయును. ఎందులకనగా "ఆత్మనౌ" అనుట వలన చైతన్యములనే గ్రహించవలయును. "ఋతౌ పిబన్తౌ' అని ఫల ఉపభోగము జీవాత్మకు వినబడుచున్నది. కాన రెండవది గూడ ఆత్మయే అనుటయే న్యాయము. సంఖ్య వినినప్పుడు రెండవది గూడ సమాన స్వభావములైనవే అని గ్రహించుట లోక ప్రసిద్ధము. ఈ ఎద్దు జతను తెమ్ము అనిన రెండవ ఎద్దును తెచ్చును గాని గుఱ్ఱమునో మనిషిని తీసుకుని రారు. కర్మ ఫల భోగము వలన నిశ్చయమైన జీవాత్మ జతను చెప్పుటకు పరమాత్మయే యుక్తి సమ్మతము. పరమాత్మయందు కర్మఫల భోగము లేకపోయినను ఛత్రి న్యాయము ద్వారా ఇచట పరమాత్మనే చెప్పిరి. గొడుగు గలవారు పోవు చున్నారనిన వారితో గొడుగు లేని వారు గూడ ఉండుటనే ఛత్రి న్యాయమందురు. 'గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్' (కఠ 1.2.12) "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్' (తై.2.1) "విషమ స్థానము లేక గహన స్థానములో నున్న చిరంతన పురాణ పురుషుడు శరీర రూప గుహలో ప్రవేశించెను'. 'హృదయ గుహాకాశములోనున్న పరమాత్మను తెలిసికొొన్న వారు' అన్న ఈ శ్రుతులలో పరమాత్మ బుద్ధి రూపమైన గుహలో ఉన్నాడని చెప్పుట వలన ఇచట గూడ 'గుహా హితత్వ దర్శనము' గుహలో ఉన్నాడని చెప్పిన విరుద్ధము గాదు. పరమాత్మ సర్వ వ్యాపకుడైనను ఉపలబ్ధి కొరకు దేశ విశేషము చెప్పిన విరుద్ధము గాదు అందువల్ల జీవపరమాత్మలే గుహలో ప్రవేశించిరనుట ఉచితమే.

### 43. విశేషణాచ్చ (1.2.12)

సూత్రార్థము : జీవపరమాత్మలను గమన కర్త గంతవ్యముగను మనన కర్త మంతవ్యముగను శ్రుతులలో విశేషణము చెప్పిరి. సూత్రములో నున్న 'చ' కారము పరమాత్మ ప్రకరణము సూచించుచున్నది. సూత్రవ్యాఖ్య జీవ పరమాత్మలే గుహలో ప్రవేశించిరి. ఎందుకు? "ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవతు" (కఠ 1.3.3)

"సో అధ్వనః పరమాప్నోతి తద్విష్ణో పరమం పదం" (కఠ 1.39) "అధ్యాత్మ యోగాధిగమేన దేవం మత్వాధీరో హర్ష శోకౌ జహాతి" (కఠ 1.2.12)

"ఆత్మను రథ స్వామిగను శరీరము రథముగను తెలిసికొనుము". "ఆ సాధకుడు మార్గ అవధులను దాటి విష్ణువు యొక్క పరమధామమును చేరును. అనగా జీవుడు ఇంద్రియాదులను నిగ్రహించునేని పరబ్రహ్మ రూపమగు స్థానమును పొందును."

"స్వప్రకాశరూపుని వేదాంత జ్ఞానముచే నెరింగిన ధైర్యశాలి హర్ష శోకములను పొందదు." పై శ్రుతులలో జీవుని చేరువాడుగను పరమాత్మను గంతవ్యరూపముగను మరియు జీవుని మనను చేయువానిగను పరమాత్మను మనన యోగ్యముగను స్పష్ట భేదము చెప్పిరి. సూత్రములోనున్న 'చ' చారము ద్వారా పరమాత్మ ప్రసంగము నడుచుచున్నదని చెప్పిరి. అందువలన ఇచట జీవ పరమాత్మలనే గ్రహించువలయును.

# 15. అంతరాధికరణము (13-17)

సంగతి : పూర్వాధికరణములో 'పిబన్తౌ' అను పదము ద్వారా ద్విత్వ సంఖ్య వినబడుటచే చైతన్యవంతములైన జీవ పరమాత్మలే బుద్ధి రూప గుహయందు ప్రవేశించిరనిరి. అట్లే ఇచట శ్రుతిలో మొదట దృశ్యతే అనియు, ఆఖరిలో అమృతత్వాది గుణములు చెప్పినను, ప్రత్యక్ష కథనము ద్వారా నేత్రములో ప్రతిబింబించుట వలనను, ఆఖరి శ్రుతిని స్తుతిపరముగా చెప్పవలయునని దృష్టాంత సంగతి.

విషయము : ఛాందోగ్యోపనిషత్తులోని ఉపకోశల విద్యలో "య ఏషో అక్షిణీ పురుషో దృశ్యతే ఏష ఆత్మా ఇతిహోవాచ ఏతద్ అమృతమభయమేతద్ బ్రహ్మేతి" (4.15.1) నున్న ఈ శ్రుతి విచారణీయ విషయము.

సంశయము : కంటి యందు ప్రసిద్ధముగా కానవచ్చుచున్న ప్రతిబింబ పురుషుని లేక ఛాయాపురుషుని గూర్చి చెప్పిరాలేక బ్రహ్మను గురించి చెప్పిరా? అని సంశయము.

పూర్వపక్షము : ఆధారము మరియు 'దృశ్యతె' అను క్రియ చెప్పినందువలన ఈశ్వరుని వదిలి ఛాయా జీవాత్మలు లేక దేవాత్మ ఈ మూడింటిలో ఒకడు అక్షిస్థ పురుషుడు.

సిద్ధాంతము : "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" సుఖ స్వరూపము బ్రహ్మము. ఆకాశమువలె వ్యాపకతత్వము బ్రహ్మము. ఈ విధముగా మొదట ఉపదేశించిన బ్రహ్మమునే నేత్రములో నున్నాడని చెప్పుచు వామనీత్వం కామప్రాపకత్వము మొదలగు గుణములతో ఉపాస్యమని చెప్పబడినది. పరమేశ్వరుని వదిలి నీవు చెప్పిన మిగిలిన మూడింటిలో అమృతత్వాది ధర్మములు లేవు. అందువల్ల పరమాత్మే అక్షిస్థ పురుషుడు.

వై.న్యా.మా. 45.7 ఛాయా జీవౌ దేవతేశౌ వాసా యోక్షిణి దృశ్యతే।
ఆధార దృశ్యతోక్తే శాదన్యేషు త్రిషు కశ్చన॥

'య ఏషో అక్షిణి పురుషో దృశ్యతే' అను శ్రుతిలో ప్రతిపాదిత పురుషుడు ఛాయాత్మా లేక జీవుడా లేక దేవతా లేక పరమాత్మా? ఆ పురుషుని నేత్రరూప ఆధారము చెప్పబడినది. మరియు వానిని దృశ్యమనిరి. కాన పరమాత్మకన్న భిన్నమైన ముగ్గురిలో ఒకరిని ఛాయాత్మ అని చెప్పవచ్చును.

వై.న్యా.మా. 46.8 కం ఖం బ్రహ్మయదుక్తం ప్రాగ్ తదే వాక్షి ణ్యుపాసతే।
వామనీత్వాది నాన్యేషు నామృతత్వాది సంభవః॥

కం బ్రహ్మమని పూర్వ వాక్యములో చెప్పిన బ్రహ్మనే ప్రస్తుత వాక్యములో అన్ని ఫలములనిచ్చు వామనీత్వ గుణములతో ఉపాసించమనిరి. ఛాయాత్మా అని మూడింటిలో అమృతత్వాది ధర్మములు సంభవము గావు. కావున వాటి ఆదేశము ఇచట లేదు.

ఛాంగోగ్య చతుర్థా ధ్యాయము నందు ఉపకోశల విద్యలోని వాక్యము విష్యుడైన ఉపకోశలునికి గురువైన సత్యకాముడు చెప్పిన వాక్యమిది. య ఏషో అక్షణి పురుషో దృశ్యతే. ఏష ఆత్మేతి హోవాచ ఏతదమృత మభయమే తద్ బ్రహ్మ (ఛాం. 4.25) కంటియందు సర్వలోక ప్రసిద్ధిడై కానవచ్చు పురుషుడెవడు గలడో అతడే ఆత్మ. మనన

రహితుడు. అతడే నాశశూన్యుడగుటచే భయరహితుడు. అతడే బ్రహ్మము. ఇచట నాలుగు ప్రకారములుగా సంశయము. "అక్షణి సర్వేదృశ్యమానా ఛాయా" కన్నులలో అందరూ చూచు ఛాయా పురుషుడని చెప్పవచ్చును. కన్నుల ఆధారము, దృశ్యత్వము చెప్పవచ్చును. రూపము చూచు సమయములో ఆ జీవుడు కన్నులలో ఉండుట వలన, అన్వయ వ్యతిరేకముల ద్వారా రూపము చూచుట వలన జీవుడు అనవచ్చును. లేక దేవత అనవచ్చును. "ఆదిత్యుడు కన్నులలో దృష్టి రూపములో ప్రవేశించెను" అనిరి గనుక. ఎటుల చూచినను పరమేశ్వరుడు గాడు. ఛాయా జీవ దేవతలలో ఎవరో ఒకరు అనవచ్చును. ఈ పూర్వ పక్షమునకు సమాధానము "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" బ్రహ్మ ఆనంద స్వరూపము ఆకాశము వలె పరిపూర్ణమని పూర్వ వాక్యములో చెప్పిరి. దానినే "య ఏషో అక్షిణి" అని ప్రకృత వాచకమైన 'తత్' శబ్దముతో చెప్పి, చక్షువులలో ఉపాస్యమును ఉపదేశించి, వామనీత్వ భామవీత్వ, సంయద్ వామత్వ గుణములను ఉపాసన కొరకు చెప్పిరి. వామనీత్వమనగా కామములను ప్రాప్తింప జేయునది. భామనీత్వమనగా జగత్తును ప్రకాశింపజేయునది. సంయద్ వారు నీత్వమనగా అన్నీ కామనలను పొందినవాడని అర్థము. ఈ గుణములలో ఉపాసన చేయు బ్రహ్మము సోపాధికమగుట వలన చక్షువులను ఆధారమని చెప్పుట, చూచుచున్నాడని చెప్పుట శాస్త్ర దృష్టితో విరోధముగాదు. ఛాయా పురుషుడు జీవుడు దేవతలయందు అమృతత్వము మరియు అభయత్వము అనుగుణములు సంభవములు గావు. అందువల్ల ఇచట ఈశ్వరుడే ఉపాస్యుడు.

### 44. అన్తర ఉపపత్తేః (1.2.13)

సూత్రార్థము : అక్షిస్థ పురుషుడు పరమాత్మయే. ఇచట చెప్పిన ఆత్మత్వా మృతత్వా భయత్వాది ధర్మములు పరమాత్మయందే యుక్తి యుక్తములు ఛాయాత్మాదులందు కాదు.

"కన్నుల లోపలలో నున్న పురుషుడు పరమాత్మయే. ఎందులకనగా యుక్తియుక్తము గనుక. ఆత్మత్వము, అమృతత్వము, అభయత్వము మొదలుగా గల ధర్మములు పరమాత్మయందె ఒప్పును. అచట ఓ శ్వేతకేతా! ఆ ఆత్మ ఉన్నది అదే నీవు. "స ఆత్మ తత్వమసి" అను శ్రుతి ద్వారా ఆత్మత్వ ముఖ్యముగా పరమాత్మయందే యుక్తము. అమృతత్వము, అభయత్వము అనేకమార్లు శ్రుతిలో వినవచ్చుచున్నది. మరి కన్నులలోని పురుషుడు అనునది సర్వ దోష రహిత స్థానము గనుక ఉపదేశించిరి. "ఏతం సమ్యద్వామ ఇత్వా చక్షతే" "ఏతం హి సర్వాణి వామాన్యభి సంయన్తి" (ఛాం. 4.15.2)

వానిని సంయద్వామ అని అందురు. అనగా కర్మలకు ఉచిత కర్మఫలములు పుట్టించుట మరియు కర్మఫలములు అందజేయుట. (ఛాం. 4-15. 2,3) ఈ పై శ్రుతులలో నిర్దేశించిన సరియద్వామాది గుణములు పరమాత్మ యందే యుక్తములు. దేరొక చోట గాదు. అందువల్ల కన్నులలో ఉన్న పురుషుడు పరమాత్మే.

### 45. స్థానాది వ్యపదేశాచ్చ (1.2.14)

సూత్రార్థము : "యః చక్షుషి తిష్ఠన్" ఎవరు కన్నులతో ఉండిన 'తస్యాదితి' వానికి 'ఉత్' నామము. "హిరణ్యస్మశ్రుః ' వానికి ప్రకాశవంతమైన మీసము కలదు. ఈ ప్రకారము శ్రుతులలో స్థానము, నామము మరియు రూపము చెప్పిరి. అందువల్ల కన్నులలో నున్న పరమాత్మయే ఉపాస్యము.

ఆకాశమువలె సర్వవ్యాపకమైన పరమాత్మకు ఎట్లు కన్నులలో స్థానము చెప్పెదరు? అనిన సమాధానము. 'యః పృథివ్యాం తిష్ఠన్' ఎవడు భూమిలో ఉండి భూమిని నడిపించుచున్నాడో, కాని భూదేవికి వాని జ్ఞానము లేదు. వానికి భూమియే శరీరము. భూమిని నియమించువాడు. వాడే నీ ఆత్మ, అంతర్యామి అమృతుడు (బృ. 3.7.3) ఈ వాక్యము ద్వారా పృథివ్యాది స్థానములలో ఆ పరమాత్మ నిర్దేశింపబడినాడు. 'యః చక్షుషి తిష్ఠన్' ఎవడు నేత్రములో స్థితుడో, నేత్రములోపల నున్నాడో, ఎవనిని నేత్రము తెలుసుకొనలేదో, నేత్రమే వానికి శరీరమై యున్నదో, వాడే నీ ఆత్మ అంతర్యామి అమృతుడు అని కన్నులు పరమాత్మకు స్థానమని చెప్పిరి. అంతేగాక "తస్యోదితి నామ" వానికి నామము 'ఉత్' అని కూడ చెప్పిరి. 'హిరణ్య స్మశ్రుః' (చాం. 1.6.6.7) వాని రూపము బంగారువన్నె గల మీసములున్నవాడనిరి. మిగిలిన చోట్ల స్థానము, నామము, రూపములు ఉపాసన కొరకు చెప్పినట్లు ఇచట కూడ సర్వ వ్యాపకమైన పరమాత్మకు అక్షస్థాన నిర్దేశము ఉపలబ్ది కొరకు చెప్పిరి. ఎట్లనగా సాలగ్రామమందు విష్ణుదృష్టి చెప్పినట్లు.

### 46. సుఖ విశిష్టాభిధానాదేవచ (1.2.15)

సూత్రార్థము : 'ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ' (ఛాం. 4.10.5) 'ప్రాణము బ్రహ్మము, సుఖము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మము'. అను ఉపక్రమ వాక్యములో సుఖ విశిష్టమైన బ్రహ్మను చెప్పిరి. తరువాత అక్షిస్థాన పురుషుడు పరబ్రహ్మమేనని చెప్పిరి. ఇచట ఏకవాక్య నిర్వాహకమైన ప్రకరణము లింగముకన్న బలవత్తరమైనది. పై ఛాందోగ్యవాక్యములో ఉపక్రమించిన సుఖవిశిష్టమైన బ్రహ్మమునే ఇచట అక్ష స్థానములో చెప్పుట వలన ప్రకృత ప్రకరణము బ్రహ్మముదే. 'శ్రుతిలింగ వాక్య ప్రకరణ స్థాన సమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్యం అర్థ విప్రకర్షాత్' వెనుకటి వారికంటె ముందున్నవి తాత్పర్య నిర్ణయమున ప్రబలములు. లింగ చిహ్నము ముందున్నది. ప్రకరణము తరువాతది. కనుక దుర్బలమనిన దానికి సమాధానము. అక్ష స్థానము లింగ ప్రమాణము. ప్రాణము బ్రహ్మమనునది ప్రకరణ ప్రమాణము. కాని ఇచట ఏక వాక్య నిర్వాహకమైన ప్రకరణము లింగము కన్న బలమైనది. ప్రకృత ప్రసంగగత బ్రహ్మమునకు అక్షస్థానము చెప్పి సంయద్వామత్వాది గుణములు చెప్పుట వలనను మరియు ముందు గురువు శిష్యునకు అర్చిరాది ఉత్తరాయణ మార్గమును ఉపదేశించుట వలనను, ఈ వాక్యములో 'యః ఏష అక్షిణీ పురుషోదృశ్యతే' బ్రహ్మోపదేశమే.

### 47. శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ (1.2.16)

సూత్రార్థము : ఉపనిషద్ రహస్యములను అనుష్టించు సగుణోపాసకుడు పోవు దేవయాన మార్గము శ్రుతి స్మృతులలో ప్రతిపాదించబడినది. దానినే ఇచట అక్షిస్థ పరుషోపాసకునికి చెప్పిరి. లింగ ప్రమాణము ద్వారా కూడ బ్రహ్మత్వము చెప్పుచున్నారు. లింగమనగా హేతువు లేక కారణమని చెప్పవచ్చును. బ్రహ్మ విషయమైన రహస్యములు వేదములో ఉపనిషత్తులలో వేదాంతములో చెప్పబడినవి. అటువంటి రహస్యమైన బ్రహ్మను తెలుసుకొనిన వానికి దేవయాన మార్గమును ప్రశ్నోపనిషత్తులో చెప్పిరి. 'అథోత్తరేణ తపసా బ్రహ్మ చర్యేణ' (ప్రశ్న 1.10). బ్రహ్మచర్యము మరియు తపస్సు ద్వారా ఉత్తరాయణ మార్గమున పయనించి బ్రహ్మలోకమును చేరును. స్మతిలో 'అగ్నిర్జ్యోతి రహ శ్శుక్లః' (గీత. 8.24) 'తేజోభిమాన దేవత, జ్యోతిరభిమాన దేవత, దినాభిమాన దేవత, శుక్లపక్షాభిమాన దేవత మొదలగు దేవతల ద్వారా ఉత్తరాయణ మార్గములో తీసుకోపోబడినవాడు తిరిగిరాడు' అని చెప్పబడినది. ఆ గతిని

ఇచట ఛాందోగ్యోగములో "ఆదిత్యాత్ చంద్రమసం చంద్రమసో విద్యుతమ్' (ఛాం. 4.15.5) అని చెప్పిరి. ఆదిత్యలోకము నుండి చంద్రలోకమునకు, అచట నుండి విద్యుత్ లోకమునకు ఆయా లోకాభిమానదేవతలు ఆ జీవుని బ్రహ్మ లోకమునకు గొంపోవుదురు. ఈ విధముగా సగుణోపాసకుని బ్రహ్మలోక ప్రాప్తి చెప్పుట వలన అక్షిస్థ పురుషుడు బ్రహ్మమేనని నిశ్చయమగుచున్నది.

### 48. అనవస్థితే రసం భావాచ్చనేతరః (1.2.17)

సూత్రార్థము : ఉపాసకుని కంటిలో ఛాయా లేక ప్రతిబింబము పడునట్లు చేయు వేరొక పురుషుడు ఉపాసకుని ముందు కూర్చొనుట అసంభవము. అమృతత్వము అభయత్వము మొదలుగా గల గుణములు ఛాయాత్మమందు అసంభవము. అందువల్ల బ్రహ్మభిన్నమైన అక్షిస్థ పురుషుని ఉపదేశించుట లేదు.

ఛాయాత్మగాని, జీవాత్మగాని, దేవాత్మగాని కన్నులలో ఉన్న పురుషుడనిన అట్లనుట సరిగాదు. ఉపాసకుని కన్నులలో ప్రతిబింబము కొరకు ఎల్లప్పుడు బింబభూతమైన వేరొక పురుషుడు ఎదురుగా నుండుట కుదరదు. దీనినే సూత్రస్థ "అనవస్థానాత్" అను పదముతో చెప్పిరి. అమృతత్వాది గుణములు ఛాయాత్మనందు ఉండుట అసంభవము. దీనినే సూత్రములో అసంభవాద్ అని చెప్పిరి. అట్లే జీవాత్మ యందు అమృతత్వాది గుణములు అసంభవము. దేవాత్మను గూడ స్వీకరించలేము వారు బహిర్ముఖుడు – "ఏరాగ్రూపత్వాత్'. అంతేగాక దేవతల ఉత్పత్తి లయములు చెప్పబడినవి. దేవతల అమరత్వము చిరకాలము స్వర్గములో ఉందురు గనుక చెప్పిరి. వారి ఐశ్వర్యము పరమేశ్వరాధనము స్వతంత్రము గాదు, స్వాభావికము గాదు. అందు వల్ల అక్షిస్థ పురుషుడు పరమేశ్వరుడనే గ్రహించవలయును.

## 16. అంతర్యామ్యధికరణము (18-20)

సంగతి : పూర్వ అధికరణములో "యః పృథివ్యాం తిష్ఠన్' (బృ. 3. 7. 2) అను అంతర్యామి బ్రాహ్మణములో నున్న 'యః చక్షుషి తిష్ఠన్' అను వాక్యమును ఉదాహరణముగా చెప్పి 'స్థానాది వ్యపదేశాచ్చ' అను సూత్రములో అంతర్యామిణి బ్రహ్మమని చెప్పిరి. దానికి ఆక్షేపమును చెప్పి సమాధానము చెప్పుట వలన ఆక్షేప సంగతి.

విషయము : బృహదారణ్యకములోని అంతర్యామి బ్రాహ్మణములో "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ నవేద యస్య పృథివీ శరీరం యః పృథివీమన్తరో యమయతి, ఏషతే ఆత్మా అంతర్యామ్యమృతః॥ (బృ. 3. 7. 2)" "ఎవ్వడు భూమి యందున్నాడో భూమికి లోపల ఉన్నాడో ఇట్లున్ననూ ఆ భూదేవి ఎవ్వని ఎరుంగలేదో ఎవనికి ఆ భూదేవియో శరీరమో ఎవడు ఆ భూమికి లోపలనుండి నియమించుచున్నాడో వాడే నీ ఆత్మ అతడే అంతర్యామి, అతడే జరామరణ శూన్యుడు' అను ఈ వాక్యమిచట విచారణీయ విషయము.

సంశయము : ఇచట చెప్పిన అంతర్యామి సాంఖ్యుల ప్రధానమా? లేక అణిమాది ఐశ్వర్యములు పొందిన యోగి పురుషుడా?

పూర్వ పక్షము : జగత్కారణమగుటచే ప్రధానము నియమకము కాగలదు. లేక కర్మ ప్రధానమగుటచే జీవాత్మ గూడ జగన్నియామకము కాగలదు.

సిద్ధాంతము : జీవునితో ఏకత్వము మరియు అమరణాది అంతర్యామి ధర్మములు చెప్పినందువలన జగన్నియామకము ఈశ్వరునియందే సంభవము. 'ద్రష్టృత్వాది' అచేతనము జడమైన ప్రధాన ధర్మఉ కానేరదు. జీవుడు నియమింపబడువాడు గనుక నియామకుడు కాజాలడు. జీవుడు తన్నుతానే నియమించుకొనలేడు. అందువల్ల ఇచట పరమాత్మయే అంతర్యామి రూపముగా ఉపాస్యుడు.

వై.న్యా.మా. 47.9 ప్రధానం జీవ ఈశోవా కో అంతర్యామి జగత్రుతి।
కారణత్వాత్ ప్రధానం స్యాజ్జీవోవా కర్మణో ముఖాత్॥

"యః పృథివ్యాం అంతరోయమయతి" ఈ శ్రుతిలో పృథి వ్యాధులలో జగత్తు యొక్క అంతర్యామిని అని చెప్పిరి. అది ప్రధానమా? లేక జీవుడా? లేక పరమేశ్వరుడా? సర్వజగత్తునకు ఉపాధానమగుట వలన ప్రధానము అంతర్యామి.

వై.న్యా.మా. 48.10 జీవైకత్వామృత త్వాదేరన్తర్యామి పరేశ్వరః।
ద్రష్ట/త్వాదేర్నప్రధానమ్ న జీవో పి నియమ్యతః॥

"ఏషతే ఆత్మా అంతర్యామి అమృతః" ఈ శ్రుతిలో జీవునికన్న అభిన్నముగా మరియు అమృతత్వాది ధర్మములు పరమేశ్వరుని యందే ఉన్నవి. అంతర్యామిని ద్రష్టా, శ్రోతా అనిరి. అందువల్ల జడ ప్రధానము అంతర్యామి కాజాలదు. జీవుడు నియమింపబడువాడుగాన అంతర్యామి గాజాలడు. అందువల్ల పరమేశ్వరుడే అంతర్యామి. బృహదారణ్యకము 5వ అధ్యాయములో యజ్ఞవల్క్యుడు ఉద్దాలకునికి చెప్పినది. "ఎవడు ఈ భూమిని లోపల నుండి నడిపించుచున్నాడో వాడే నీకు నాకును ఆత్మ. అతడే అంతర్యామి జరామరణ శూన్యుడు.

భూమ్యాదుల నుండి సంపూర్ణ జగత్తు యొక్క అంతర్యామి యందు మ ఊడు విధముల సంశయము. అంతర్యామి ప్రధానమని పూర్వపక్షి చెప్పుచున్నాడు. ఆ ప్రధానము సంపూర్ణ జగత్తునకు ఉపాదానకారణమై తన కార్యమైన నియామకమునకు సమర్థమైయున్నది. లేక ధర్మా ధర్మరూపమైన కర్మానుష్ఠానము వల్ల జీవుడు అంతర్యామి. జీవునకు కర్మ ఫలమునిచ్చుటకు ఫలభోగ సాధనమైన జగత్తును సృష్టించెను. కర్మ ద్వారా జగత్తును సృష్టించుట వలన జీవుడు అంతర్యామి అనగా సిద్ధాంతి సమాధానము "ఈ నీ ఆత్మ అంతర్యామి అమృతము" "ఏష తే ఆత్మ అంతర్యామి అమృతః" అంతర్యామిని జీవతాదాత్మ్యముగను అమృతత్వముగను చెప్పిరి. అట్లే భూమి నుండి అంతరిక్షము వరకు అన్ని వస్తువులలో అంతర్యామి ఉపదేశము వల్ల సర్వ వ్యాపిత్వము ప్రతీతమగుచున్నది. ఈ రెండు కారణముల వల్ల అంతర్యామి పరమేశ్వరుడు. ప్రధానమందు అంతర్యామిత్వము సంభవము గాదు. "అదృష్టో ద్రష్టా అశృతః శ్రోతా" ఆ అంతర్యామి పరులచే చూడబడక సర్వమును చూచువాడు, సర్వమును వినువాడు. ఇచట వినబడు ద్రష్టృత్వ శ్రోతృత్వములు అచేతన ప్రధానమందు అసంభవములు. అంతర్యామి జీవుడు గూడ గానేరదు. "య ఆత్మానం అంతరో యమయతి" "ఎవడు జీవుని లోపల నుండి నియమించుచున్నాడో" అన్నచోట జీవుడు నియమింపబడువాడు, అందువల్ల అంతర్యామి పరమేశ్వరుడే.

### 49. అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్ (1.2.1)

సూత్రార్థము : "యః పృథివ్యా" మొదలుగా గల శ్రుతులలో చెప్పిన శాసనకర్త అంతర్యామి పరమాత్మయే. ఎందులకనగా శ్రుతులలో ఆత్మత్వ, అమృతత్వాది పరమాత్మ ధర్మములు చెప్పుట వలన.

అధి దైవాదులలో వినబడు అంతర్యామి పరమాత్మయే వేరొకడు గాదు. ఎందులకనగా ఆ పరమాత్మ ధర్మములు చెప్పుట వలన ఆ పరమాత్మ యొక్క సర్వాంతర్యామిత్వము అమృతత్వము, ఆత్మత్వము అను అసాధారణ ధర్మములను ఇచట ఉపదేశించుచున్నారు. భూమి ఆదిగా గల సర్వ వికారముల లోపల స్థితుడై వాటిని శాసించుచున్నాడు. ఇది పరమాత్మ యొక్క శాసన ధర్మము. ఈ నీ ఆత్మ అంతర్యామి అమరణ ధర్మము గలది. "ఏష తే ఆత్మ అంతర్యామి అమృతః" అను వాక్యములో ఆత్మత్వ అమృతత్వాదులు ముఖ్యముగా పరమాత్మయందే యుక్తి సంగతములు. అందువల్ల పరమాత్మయే అంతర్యామి.

"అదృష్టో అశ్రుతః" అను శ్రుతి ఉపదేశము ద్వారా రూపాది హీనమైన పరమాత్మవలె సాంఖ్యశ్రుతిలో కల్పింప బడిన ప్రధానములలో కూడ ఈ ధర్మములు ఉండుట వలన ప్రధానము అంతర్యామి అనిన ఈ సూత్రమును చెప్పుచున్నారు.

### 50. న చ స్మార్తమతద్ధర్మాభిలాపాత్ (1.2.19)

ప్రధానము అంతర్యామి కాజాలదు. ఎందులకనగా ప్రధానము కన్న భిన్నమైన చైతన్యములో ఉన్న ద్రష్టృత్వ, శ్రోతృత్వాది ధర్మములు చెప్పుట వలన.

సాంఖ్యస్మృతిలో కల్పింపబడిన ప్రధానము అంతర్యామి పదమునకు అర్ధము గాదు. ప్రధానము కన్న భిన్నమైన పరమాత్మ కొరకు ఈ ధర్మములు అనగా అదృష్టో ద్రష్టా అశృతః శ్రోతా "ఆ అంతర్యామి ఇతరులచే చూడబడు అందరినీ చూచువాడు. ఇతరులచే వినబడక సర్వమును వినువాడు". అని వాక్య శేషములో చెప్పుట వలన.

### 51. శారీరశ్చోభయే పిహిభేదేనైనమధీయతే (1.2.20)

'నకారము పూర్వ సూత్రము నుండి అనువర్తించును.

సూత్రార్థము : జీవుడు గూడ అంతర్యామి గాడు. బృహదారణ్యకములోని రెండు శాఖలు, కార్వశాఖయు మరియు మాధ్యం దినశాఖయు గూడ అంతర్యామి ద్వారా జీవుడు నియమింపబడు వాడగుటచే అంతర్యామి కన్న జీవుని భిన్నముగా చెప్పుచున్నవి. అధి దైవాది శ్రుతులలో చెప్పిన అంతర్యామి పరమాత్మ అని సిద్ధమగుచున్నది.

"యో విజ్ఞానే తిష్ఠన్" జీవుని లోపల నుండి వానిని నియమించుచు అను కాణ్వశాఖలో "య ఆత్మని తిష్ఠన్" ఎవడు ఈ ఆత్మలో స్థితమైయుండి దానిని నడిపించునో అని మాధ్యం దిన శాఖలో గూడ అంతర్యామి కన్న జీవుని చెప్పుచున్నవి. భూమి మొదలగు వానివలె జీవుని ఆధారముగను నియమింపబడువానిగను చెప్పుచున్నవి. ఒకే దేహములో ఇద్దరు ద్రష్టలు ఉండరని చెప్పరాదు. అసంభవము గాదు. ఇద్దరు ద్రష్టలుండుట సంభవము. అవిద్య వలన సంభవించిన కార్యకారణ రూపమయిన ఉపాధి ద్వారా ద్రష్టలందు భిన్నత్వమును పారమార్థిక

దృష్టిలో ద్రష్టల ఏకత్వమును చెప్పిరి. పరమాత్మ ఒక్కడే అయినను ఘటాకాశ మహాకాశము వలె ఉపాదుల ద్వారా భేద వ్యవహారము కలదు. అట్లే "యత్ర ద్వైతమివ భవతి". ఎచట ద్వైతమును ఆశ్రయించి సర్వ వ్యవహారము ఉండును. "యత్ర త్వస్య పరమాత్మై వాభూత్ తత్ కేనకం పశ్చేత్" "జ్ఞాన స్థితి యందు పురుషునికి సర్వము ఆత్మయే యగును. అప్పుడు ఎవడు ఎవనిని చూచును". ఈ శ్రుతులలో భేదాభేద వ్యవహారము కనుపించుచున్నది. అందువల్ల అధి దైవాదులలో పరమాత్మనే అంతర్యామిగా చెప్పిరి.

# 17. అదృశ్యత్వాధికరణము.

సంగతిః- పుర్వాధికరణములో ''యఃపృథివ్యాం తిష్ఠన్'' బృ.ఉ.3-7-2.అను అంతర్యామిబ్రాహ్మణములో యఃచక్షుషి తిష్ఠన్ అను వాక్యమును ఉదాహరణరూపముగాతీసుకొని స్థానాదివ్యపదేశాచ్చ అను సూత్రములో అంతర్యామిని బ్రహ్మమని చెప్పిరి. ఇప్పుడు దానిపై ఆక్షేపము చేసి సమాధానము చెప్పుటకు ఈ అధికరణము ఆరంభమయినది. నిమిత్తకారణుడు మాత్రమే. ఇచ్చట చెప్పుచున్నారు.

విషయము –యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుశ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్ భూయోనిం పరిపశ్యంతి దీరాః. (ముం.1.1,6.) జ్ఞానేంద్రియములకు అగోచరంబును, నామరహితంబును, జాతిశూన్యంబును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ రహితంబును, శాశ్వతంబును, సర్వశక్తియు సర్వవ్యాపకంబును, అతిసూక్ష్మంబును సర్వప్రపంచకారణంబును ధీరులు తెలిసికోనుచున్నారు. ఈ వాక్యమిచట విచారనణీయ విషయము.

సంశయము-భూతయేని ప్రధనమా? జీవాత్మయా లేక పరమాత్మయా? - అనిసంశయము.

పూర్వపక్షము - భూతయోని ఉపాదానకారణమగుటవలన ప్రధానమనవచ్చును. నిమిత్తకారణమగుటవలన జీవాత్మగూడ భూతయోనికాగలడు. ఈరెంటిలోఏదో ఒకటి తీసుకొనవచ్చును.

సిద్ధాంతము - సర్వజ్ఞత్వాది ధర్మములు చెప్పుటవలన భూతయోనికి పరమాత్మ అర్థముచెప్పుటయే ఉచితము. ''దివ్యోహ్యముర్త పురుషః''. పురుషుడు దివ్యుడు మరియు ఆకారరహితుడు. ఇట్లు దివ్యత్వాదిగుణములు చెప్పుటవలన జీవుడు భూతయోనికాదు. ''అక్షరాత్ పరతః పురుషః''. అక్షరమనగా అవ్యాకృతమనుపేరుగల సర్వవికారములకు ఆశ్రయమైన పరమేశ్వరుని అవలంబించి వానికే ఆవరణమైయున్న భూతసూక్షమే. ఏట్లనగా ఉత్పత్తికిముందు బీజమునందు అంకురమువలే పరమేశ్వరునియందున్న పంచభూతములే అక్షరములనబడును. ఇవి వినాశము లేనివి. ఈఅక్షరమునకన్న పరమైనవాడే పరమేశ్వరుడు అని చెప్పగా ప్రధానముకన్న భిన్నము భూతయోని అని స్పష్టమగుచున్నది. కనుక ప్రధానము గూడ భూతయోని గాదు. అందువలన పరమాత్మనే అంతర్యామిరూపములో ఉపాస్యమని చెప్పబడినది.

వైయ్యాసికన్యాయమాలా –

భూతయోనిః ప్రధానం వా జీవో వా యది వేశ్వరః ఆద్యౌ పక్షావుపాదాననిమిత్తత్వాభిధానతః

ఈశ్వరో భూతయోనిః స్యాత్సర్వజ్ఞత్వాది కీర్తనాత్ -దివ్యాద్యుక్తైర్న జీవః స్యాన్న ప్రధానం భిధోక్తితః

“తదవ్యయం యద్ భూతయొనిం పరిపశ్యంన్తి ధీరాః” ఈ శ్రుతిలో చెప్పిన భూతయోని ప్రధానమా? జీవుడా? లేక ఈశ్వరుడా? యోని శబ్దమునకు అర్థము ఉపాదానకారనము, మరియు నిమిత్తకారణము. అందువల్ల జగత్రూపములో పరిణామము చెందు ప్రధానము జగత్తునకు ఉపాదానకారణము అగుటవల్ల భూతయోని లేక ధర్మాధర్మముల ద్వారా జగాత్తు ఉత్పత్తిచేయు జీవుడు ఉపాదానకారణము. ఈపూర్వపక్షమునకు సమాధానము. “య సర్వజ్ఞః సర్వవిత్” అను శ్రుతిలో సర్వజ్ఞత్వము సర్వవేత్తృత్వము మొదలుగాగల బ్రహ్మ చిహ్నములు చెప్పబదినవి. అందువల్ల పరమేశ్వరుడే భూతయోని.భూతయోని దివ్యము సర్వవ్యాపకము మరియు జన్మరహితమని చెప్పబడనది. అందువల్ల పరిఛ్ఛిన్నము మరియు జన్మాదులుగల జీవుడు భూతయోని కానేరడు. “అక్షరాత్పరతః పరః” అనుశ్రుతిలో అక్షరశబ్దవాచ్యమైన ప్రధానముకన్న భిన్నము భూతయోని అనిరి. అందువల్ల ప్రధానము భూతయోని కాదు.బ్రహ్మము సంపూర్ణ జగత్తునకు ఉపాదానకాణము మరియు నిమిత్తకారణము. అందువల్ల ఈశ్వరుడే భూతయోని అనునది సిద్ధమగుచున్నది.

ముండకోపనిషత్తులో చెప్పిరి ‘‘తదవ్యయం యద్ భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః’’

ఆ అవ్యయమును సర్వప్రపంచకారణమును అగునేఅక్షరంబును వివేకవంతులు చూచుచున్నారొ అనిరి. అచట మూడురకముల సంశయము కలుగును. ప్రధానమా జీవుడా అను పక్షద్వయము ప్రాప్తము. యోని శబ్దము ఉపాదాన నిమిత్త కారణవాచకము. ప్రధానము విశ్వరూపముగా పరిణమించుటవలన ఈవిశ్వమునకు ఉపాదానకారణముమాత్రమే. జీవుడు ధర్మాధర్మములద్వారా నిమిత్త కారణము మాత్రమే అను పూర్వపక్షమునకు

ఇక్కడ సిద్ధాన్త సమాధానము చెప్పుచున్నారు.

‘‘యః సర్వజ్ఞః సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః’’ (ముం.1-1-6.) ఆ బ్రహ్మము సర్వజ్ఞము మరియు సర్వవిత్. సామాన్య రూపముగా అన్నియు తెలిసినవాడు కనుక సర్వజ్ఞత్వము కలవాడందురు. విశేషముగా అన్నియు తెలిసినవాడుకనుక సర్వవిత్ అందురు. అంతేగాక విచారరూపమయిన తపస్సు కలవాడు. ఈ విధమయిన బ్రహ్మచిహ్నములు చెప్పబడినందువలన భూతయోని పరమేశ్వరుడే. కాని జీవుడు భూతములకు కారణముగాజాలడు.

‘దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యంతరో హ్యజః’’ (ముం.2-1-2.)

ఆ జగాత్కారకణపురుషుడు సర్వప్రకాశస్వరూపుడు, నిరాకారుడు, అంతేగాక లోపల బయట వ్యాపించి ఉన్నవాడు జన్మలేనివాడు. ఈ విధముగా లోపల బయట వ్యాపించి ఉండుట మరియు జన్మరాహిత్యము వినబడుటవలన పరిఛ్ఛిన్నమైన జన్మాదులుగల జీవుడు భూతయోని కాజాలడు. ప్రధానము భూతయోని అని చెప్పుట యుక్తియుక్తము కాదు. “అక్షరాత్ పరతః పరః” (ముం.2-1-2. ) అని అక్షరశబ్దవాచ్యమైన ప్రధానముకన్నభిన్నముగా భూతయోనిని చెప్పిరి. అంవల్ల భూతయొని ఈశ్వరుడే.

## 52. అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః.1.2.21

సూత్రార్థము- "యత్తదద్రేశ్యమ్" (ముం.1.1.6.) అను శ్రుతిలో అదృశ్యత్వాది గుణములు కలవాడు పరమాత్మయే. భూతములకు కారణము ప్రధానము లేక జీవుడు కాదు. ఎందులకనగా "యః సర్వజ్ఞః సర్వవిత్" (ముం.1.1.9) సకల పదార్థముల సామాన్య జ్ఞానము మరియు విశేష జ్ఞానము గలవాడు అనుశ్రుతిలో భూతయోని సర్వజ్ఞత్వాదులు గల పరమేశ్వరుని గుణములు నిర్దేశింపబడినవి. ప్రధానములోగాని జీవునిలోగాని ఆగుణములు లేవు.

ఇచట పూర్వపక్షములో ప్రధానము లేక జీవుని ధ్యానము.సిద్ధాంతములో నిర్విశేషబ్రహ్మజ్ఞానము అని ఫలభేధము. "యత్తదద్రేశ్యమ్"అనుశ్రుతిలో అద్రశ్యత్వాదిగుణములుగల పరామాత్మయే భూతయోని వేరొకరు కాదు. ఎందులకనగా ఆ పరమాత్మ ధర్మములే చెప్పబడుటవలన "యః సర్వజ్ఞః సర్వవిత్" (ముం.1.1.9.) ఎవడు సకల పదార్థముల జ్ఞానసంపన్నుడో సామాన్యముగా వానిని సర్వజ్ఞుడందురు. అదేజ్ఞానము విశేషముగా నున్న సర్వవిత్ అందురు.

పరమాత్మ అన్నింటి యొక్క సామాన్య విశేష జ్ఞానములు కలవాడు. అందువల్ల వానిని సర్వజ్ఞః సర్వవిత్ అనిరిః అచేతనమైన ప్రధానమందు గాని పరిచ్ఛిన్నమైన జీవుని యందు గాని సర్వజ్ఞత్వము సర్వవిదత్వములు సంభవము కాదు. జడప్రధానమునందు, అంతఃకరణమను పరిచ్ఛిన్న ఉపాధిగల జీవుని యందు సర్వజ్ఞత్వాది గుణముల సంభవమే లేనప్పుడు భూతకారణము వానియందు ఎట్లుసంబవము. "యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యామోషదయః సంభవన్తి, యథా సతః పరుషాత్ కేశలోమాని తథాక్షరాత్సంభవతీహ విశ్వమ్" (ముం.1.1.7) సాలె పురుగు తనదేహమునుండి తానే దారమును సృజించి మరల తనయందే ఇముడ్చు కొనునట్లు భూమినుండి ఒషధివనస్పతులు పుట్టినట్లు, జీవించి యున్న పురుషుని నుండి తలమీద కేశములు, దేహముపై రోమములు పుట్టునట్లు, ఆఅక్షరతత్వము నుండి సంపూర్ణ విశ్వము ఉత్పన్నమగు చున్నది. సాలెపురుగు దృష్టాంతము చూచిన ద్రాష్టాంతము జడమని తొచుచున్నది. ఎందులకనగా సాలెపురుగు జడదేహమునుండి దారము ఉత్పన్నమగుచున్నదని చెప్పుట సరికాదు. దృష్టాంత ద్రాష్టాంతములయందు అత్యంతసామ్యముండవలయునను నియమములేదు. సామ్యమున్న దృష్టాంత ద్రాష్టాంతిక భావమే ఉండదు. చంద్రముఖీ అన్నప్పుడు చంద్రబింబములో కన్నులు ముక్కు కనబడుటలేదు కదా! దృష్టాంతము నందలి అనుకూలవిషయములందే సమత్వము చెప్పుట లొకప్రసిద్ధము. అందువల్ల దృష్యత్వాది గుణములుగల పరమేశ్వరుడే భూతములకు కారణము.

## 53.విశేషభేదవ్యపదేశాభ్యామ్ చ నేతరౌ.1.2.22

సూత్రార్థము:- "దివ్యోహ్యమూర్తః" అనుశ్రుతిలో దివ్యత్వము అపరిచ్ఛిన్నత్వము, సర్వవ్యాపకత్వము, మొదలగు విశేషగుణములు భూతయోనికి

చెప్పినారు. జీవునియందు ఈగుణములు లేనందువల్ల జీవుడు భూతయోని కాడు. "అక్షరాత్ పరతః పరః" అను శ్రుతిలో అక్షరతత్వమునకు పరమాత్మకు భేదము చెప్పుట వలన ప్రధానము భూతయోని కాదు.పరమాత్మయే భూతములకు కారణము.

విశేషము గుణములు మరియు భేధము చెప్పుటవలన పరమేశ్వరుడే భూతయోని కాని జీవ ప్రధానములు కావు. ''దివ్యో హ్యమూర్తః పురుషః.''(ముం.2-1-2.) పరుషుడుదివ్యస్వరూపుడు మరియు ఆకారరహితుడు. ఇచట జీవునికన్ని విలక్షణముగా భూతయోని చెప్పిరి. "అక్షరాత్ పరతః" (ముం.2.1.2.) అను శ్రుతిలో

భూతయోనిని ప్రధానముకన్న భిన్నముగా చెప్పిరి. జీవుని కన్న విలక్షణమైనఅవ్యాకృతమను నామరూపముల బీజావస్థరూపమైన అక్షరముకన్నపరమైనవాడు పరమాత్మ. అందువల్ల భూతయోని పరమాత్మయే.

54.రూపోపన్యాసాచ్చ.23.

సూత్రార్థము:- "అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ" ద్యులోకము శిరస్సు చంద్రసూర్యులు కన్నులు.(ముం.2.1.4) అను శ్రుతిలో భూతయోని యొక్క సర్వాత్మత్వమును చెప్పుట వలన గూడ భూతయోని పరమాత్మయే.

''ఏతస్మాజ్జాయతే ప్రాణః మనః సర్వేంద్రియాణి చ ఖం వాయుర్జ్యోతి రాపఃపృథివీ''(ముం.2.1.3.) ఈశ్రుతిద్వారా ప్రాణము,మనస్సు, అన్ని ఇంద్రియములు, ఆకశము, వాయువు,అగ్ని, జలము, భూమి ఉత్పన్నమైనవి.ప్రణాదులనుండి పృథివి వరకు సృష్టిని చెప్పి ''అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ'' ద్యులోకము శిరస్సు,చంద్రసూర్యులు కన్నులు అను శ్రుతిలో సర్వవికారాత్మకమైనభూతయోని యొక్క రూపోపన్యాసము కావించుట వలన పరమాత్మయే భూతయోని అని వృత్తికార మతము. కాని భగవత్పాద మతములో ఇది భూతయోని యొక్క రూపోపన్యాసము కాదు ,ఏలనన ముందుగూడ వికారమాత్ర ఉత్పత్తి చెప్పుట వలన. అతః "పురుష ఏవేదం విశ్వం కర్మ" ఈ సంపూర్ణ సంసారము పురుషరూపమే పరుషునికన్న భిన్నమైన విశ్వములేదు అని ముండక శ్రుతిలో చెప్పుటవలన సర్వాత్మకరూపోపన్యాసమువల్ల పరమాత్మయే భూతయోని. ఇచట శ్రుతిలో రూపోపన్యాసమును ఒప్పుకొనక సర్వరూపము వర్ణించుట వలన పరమాత్మయందే భూతయోనిత్వము చెప్పిరి.

## 18. వైశ్వానరాధికరణము.

సంగతి—పూర్వాధికరణములో ప్రారంభములో అదృశ్యత్వాది సాధారణధర్మములను వాక్యశేషములోగల సర్వజ్ఞత్వాది హేతువుల ఆధారముపై బ్రహ్మపరకముగా చెప్పినారు. అట్లే ఇచట ఉపక్రమములోనున్న వైశ్వానర శబ్దమునకు

వాక్యశేషములోగల హోమాధికరణ హేతువు ఆధారముగా జాఠరాగ్ని పరకముగా చెప్పవలయును. ఈ విధముగా దృష్టాంతసంగతి కారణమువల్ల వైశ్వనరాధికరణము రచించిరి.

విషయము—వైశ్వానరతత్వము ఈఅధికరణములో విచారణీయ విషయము.

సంశయము—ఛాందోగ్యఉపనిషత్తులో గల వైశ్వానరవిద్యయందు చెప్పిన "ద్యుమూర్థాది" అనగా స్వర్గము ఆవైశ్వానరునికి శిరస్సు అని వైశ్వానరుని తత్వము చెప్పబడినది.అది జాఠరాగ్నియా,భూతాగ్నియా, ఆదిత్యాది దేవతయా, జీవాత్మయా లేక పరమాత్మయా అని సంశయము.

పూర్వపక్షము—వైశ్వానరడు మరియు ఆత్మ శబ్దముల ప్రయోగము వల్ల ఈశ్వరునికన్న భిన్నమైన పదార్థము గ్రహించ వచ్చును.

సిద్ధాంతము—"మూర్థత్వాది" శ్రుతిని చూచుచు మరియు బ్రహ్మశబ్ద ప్రయోగమువల్లను పరమేశ్వరుడే వైశ్వానర శబ్దమునకు అర్థము అని చెప్పుటయే ఉచితము. ఈశ్వరునికి శాస్త్రములో వైశ్వానరుడనియు ఆత్మ అనియు శబ్దముల ప్రయోగము బహుధా కనిపించుచున్నది

వైయ్యాసికన్యాయమాల

వైశ్వానరః కౌక్షభూతదేవజీవేశ్వరేషు కః వైస్వానరాత్మశబ్దాభ్యామీశ్వరాన్యేషు కశ్చన.

ద్యుమూర్థత్వాదితో బ్రహ్మశబ్దాచ్చేశ్వర ఇష్యతే  వైశ్వానరాత్మశబ్దౌ తావీశ్వరస్యాపి వాచకౌ.

"ఆత్మానం వైశ్వానరముపాస్తే" అను శ్రుతిలో చెప్పిన వైశ్వానరుడూ జఠరాగ్నియా, భూతాగ్నియా,  దేవతయా, జీవుడా లేక పరమేశ్వరుడా? వైశ్వానర శబ్దము జాఠారాగ్నిలో,భూతాగ్నలో, మరియు దేవతయందు రూఢము,మరియు ఆత్మ శబ్దము జీవవాచకము. అందువల్ల ఈశ్వరునికన్నభిన్నమైన చెప్పిన నాలుగులో  ఏదో ఒకటి వైశ్వానర శబ్దమని చెప్పవచ్చును. అను పూర్వపక్షమునకు సిద్ధాంతి సమాధానము.  "ద్యులోకము వాని శిరస్సు" అనురీతిగా వైశ్వానరుని అవయవముల  వర్ణన ఉన్నది. మరియు "కొ న ఆత్మా కిం బ్రహ్మ" "మాఆత్మ ఏది బ్రహ్మ మేది" ఈప్రకారము ఉపక్రమమైనది. అందువల్ల వైశ్వానరము బ్రహ్మమే. వైశ్వానరశబ్దము యోగవృత్తి ద్వారా బ్రహ్మమందే సమన్వయమగుచున్నది. ఆత్మశబ్దము ముఖ్యవృత్తిద్వారా  బ్రహ్మవాచకము.

ఛాందోగ్యోపనిషత్తులోని పంచమ అధ్యాయములో వైశ్వానరవిద్యలో "ఆత్మానం వైశ్వానరముపస్తే" అనిరి.అనగా విశ్వాత్మవైశ్వానరుని ఉపాసన చేయుచున్నము. (ఛాం.5-18-1). ఈ వైశ్వానరుడు జఠరాగ్నియా, భూతాగ్నియా, ఆదిత్యదేవతయా, జీవాత్మయా లేక పరమాత్మయా అని సంశయము. అచట వైశ్వానరశబ్దమువల్ల మొదటి మూడు పక్షములు ప్రాప్తము అనగా జాఠరాగ్ని, భూతాగ్ని, ఆదిత్యదేవతలని పూర్వపక్షము. "అయమగ్ని వైశ్వానరో

యోఽయమన్తః పురుషే యేనేదమన్నం పచ్యతే” తినబడిన దానిని జీర్ణింపచేసే ఏ వైశ్వానరాగ్ని లోపలఉన్నదో, (బృ.ఉ.5-9-1) అను శ్రుతిలో వైశ్వానరాగ్ని శబ్దము జాఠరాగ్ని యందు ప్రయోగించిరి. “విశ్వస్మా అగ్ని భువనాయ దేవా వైశ్వానరమ్” దేవతలు సమస్త లోకాలకు పగటికి చిహ్నముగా వైశ్వానరాగ్నిని సూర్యరూపములో చేసారు. (ఋ.సం10-88-12). అనుచోట వైశ్వానర శబ్దము బయటనున్న భూతాగ్నియందు ప్రయోగించిరి “ వైశ్వానరస్య సుమతౌ స్యామ్” వైశ్వానరుని మంచిమనస్సులో ఉందుముగాక.( ఋ.సం.1-98-1). అన్నచోట వైశ్వానర శబ్దము దేవతయందు ప్రయోగించిరి. అందువల్ల పక్షత్రయము ప్రాప్తము. ఆత్మశబ్దము జీవునియందు రూఢియగుట వలన జీవుని వైశ్వానరుడనవచ్చును. ఈశ్వరుడనుట యుక్తము కాదు వాని చిహ్నములు లేనందువలన అను పూర్వపక్షమునకు సమాధానము ఇచ్చుచున్నారు.

వైశ్వానరశబ్దమునకు బ్రహ్మమని అర్థము చెప్పుటయే ఉచితము. ద్యుమూర్ధవాయ్వాకాశవారిపృథివీనాం శ్రవణాత్. “తస్య హ వా ఏతస్య ఆత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః”(ఛాం.ఉ.5-18-2.) ఆవైశ్వానర ఆత్మకు స్వర్గము శిరస్సు. ఈశ్రుతిలో స్వర్గాదులతో కూడిన సంపూర్ణ జగత్తు వైశ్వానరుని అవయవములుగా వినబడుచున్నది. ఇది ఈశ్వరుని కన్న భిన్నమైనవారిలో సంభవము కాదు. మరియు “కో న ఆత్మా, కిం బ్రహ్మ” (ఛా.ఉ. 5-11-1) మా ఆత్మ ఏది? బ్రహ్మ మెవరు? అను ప్రశ్నలో బ్ర హ్మ శబ్దము ఈశ్వరునియందు ముఖ్యముగా ప్రయోగించిరి, వైశ్వానరశబ్దము యోగరీత్యా బ్రహ్మమందు గలదు. “విశ్వశ్చాసౌ నరశ్చ విశ్వానరః” ఏవరు విశ్వరూపులో మరియు నరులో వారే విశ్వానరులు లేక సంపూర్ణ జగత్తుస్వరూప మెవరో వారినే వైశ్వానరుడందురు.అది పరమాత్మకే చెల్లును. వైశ్వానరుడు అనగా సర్వాత్మపురుషుడని అర్థము విశ్వానరుడే వైశ్వానరుడు. ఆత్మ శబ్దము జీవ బ్రహ్మలలో ఉపయోగింతురు. అందువల్ల వైశ్వానరుడు పరమేశ్వరుడే.

## 55.వైశ్వానరః సాధారణశబ్దవిశేషాత్ 1.2.24

సూత్రార్థము:- “ యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే” ఛాం (5.18.2) ద్యులోకాదులచే గల్పింపబడిన పరిమితి గలిగినట్టియూ, ప్రత్యగాత్మరూపముతో నెఱుంగబడునట్టియు స్వస్వరూప భూతుడైనట్టియు ఆవైశ్వానరునెవ్వడుపాసించునో వానికి అన్నిభోగములు లభించును.ఈ

వైశ్వానరశబ్దము జాఠరాగ్ని, భూతాగ్ని, ఆదిత్యాది దేవతలయందు సాధరణరూపముగను జీవాత్మ ఆత్మ శబ్దము సాధరణముగను ఉపయోగింతురు. అట్లు సాధరణముగా ప్రయోగించిన వైశ్వానర ఆత్మ శబ్దములను పరమాత్మయందు విశేషముగా ప్రయోగించుట కనబడుచున్నది. “తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజా శ్చక్షు ర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా సందేహో బహులో బస్తిరేవ రయిః పృథివ్యేవ పాదౌ” “ఆత్మరూపుడగు ఆ వైశ్వానరునకు ద్యులోకము శిరస్సు, సూర్యుడు కన్నులు, వాయుదేవత ప్రాణము, శిరస్సునుండి నడుము వరకు గల దేహమే ఆకశము, జలము నాభ్యధోభాగము, భూమిపాదములు” (ఛాం.5.18.2) ఈ శ్రుతి ముందుచెప్పిన ద్యులోకము

శిరస్సు అను విశేషణములు సర్వవ్యాపకమైన పరమాత్మ అర్థమును భోధించు చున్నది. ఉపక్రమములో "కోన ఆత్మా కిం బ్రహ్మ" (ఛాం.5.11.1 ) "మా ఆత్మ ఏది, బ్రహ్మ మేది" ఈ శ్రుతి ద్వారా ఆత్మ బ్రహ్మ శబ్దముల ప్రయోగము పరమేశ్వరుడే వైశ్వానరుడని చెప్పుటకు చిహ్నము లేక హేతువు. అందువల్ల వైశ్వానారుడు పరమాత్మయే.

56.స్మర్యమాణమనుమానం స్యాదితి.1.2. 25.

సూత్రార్థము:- "యస్యాగ్నిరాస్యం" "ఎవనికి అగ్ని ముఖమో ద్యులోకము శిరస్సో" అనుస్మృతి ద్వారా ప్రతిపాదించిన త్రిలోకీ ఆత్మకు మూలభూతమైన శ్రుతిని అనుమానము ద్వారా చెప్పుచూ పరమాత్మను నిర్ణయించు చున్నది. పైస్మృతులకు మూలభూతమగు శ్రుతులు ప్రమాణములు అని అనుమానము ద్వారా నిశ్చయమగుచున్నది.

ఇందువల్ల గూడ పరమాత్మయే వైశ్వానరుడు. మహాభారతము శాంతిపర్వముల 47-68 లో "యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖంనాభిశ్చరణౌ క్షితిః| సూర్యశ్చక్షుర్దిశః శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః||" ఎవనికి అగ్ని ముఖమో, ద్యులోకము శిరమో, ఆకాశము నాభి, పృథివి పాదములో, సూర్యుడు నేత్రమో, దిశలు శ్రోత్రములో అటువంటి సంపూర్ణ త్రైలోక్యరూపమునువర్ణించు స్మృతి వైశ్వానరశబ్దమునకు పరమేశ్వరుడని అర్థము చెప్పుచూ శ్రుతిని కల్పించుచున్నది మరియు వైశ్వానర శబ్దమునకు పరమాత్మ అని అర్థము జ్ఞాపకము గావించు చున్నది. సూత్రములో నున్న ఇతి శబ్దము హేత్వర్థకము.

ఇంకొక ప్రకారము ఆక్షేపము గావించిన దానికి సమాధానము చెప్పుచూ సిద్ధాన్తము ప్రతిపాదించు చున్నారు.

57. శబ్దాదిభ్యోఽన్తఃప్రతిష్ఠానాచ్చ నేతి చేన్న, తథా దృష్ట్యుపదేశాదసంభవాత్ పురుషమపి చైనమధీయతే. 1.2.26.

సూత్రార్థము:- జఠరాగ్న్యాద్యగ్నులలో వైశ్వనర శబ్దము రూఢము. ఆ అగ్నికి "హృదయమ్ గార్హపత్యః" అని మూడు ప్రకారముల అగ్నులు కల్పన చేయబడినవి. "తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయం"(ఛాం.5.10.1.) ఈ శ్రుతి ద్వారా ప్రాణాహుతి ఆ అగ్నులను ప్రాణాహుతికి ఆధారమని చెప్పరి మరియు శ్రరీరములోపల ఉన్నదనిరి. ఈ కారణమువల్ల వైశ్వానరుడు కానేరడుఅనిన అట్లనుటసరికాదు. ఎందులకనగా జఠరాగ్నియందు పరమాత్మా దృష్టి ఉపదేశముగనుక. జఠరాగ్నికి స్వర్గము శిరస్సు, సూర్యడు నేత్రము కానేరదు. వాజసనేయశాఖవారు వైశ్వానరుని పురుషుడు అనుచున్నారు. జఠరాగ్ని పురుషుడు గాదు.అందువల్ల పరమాత్మయే వైశ్వానరుడు.

వైశ్వానరశబ్దము పరమాత్మ కానేరదు.అది జఠరాదులందు రూఢి కనుక. అంతేగాక'' హృదయమ్ గార్హపత్యః''( ఛాం. ఉ.5-18-2) అని అగ్నిని మూడువిధములుగా కల్పించుటవలనను మరియు''తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయం''(ఛాం.ఉ.5-10-1) భుజించుటకు ముందు వచ్చిన అన్నాదుల ద్వారా ప్రాణాగ్నులకు హోమము చేయవలయును. ఈపైన చెప్పిన శ్రుతి (ఛాం5.10.1) కారణముల వల్ల ప్రాణాహుతి అధికరణమని గ్రహించవలయును. ఈ హేతువుల ద్వారా వైశ్వానరుని జాఠరాగ్ని అనవచ్చును. మరియు "అన్తః ప్రతిష్ఠానాత్

పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేద''´ ఈ వైశ్వానరుడు పురుషుని అనగా జీవుని లోపల ప్రతిష్ఠితమై యున్నాడు అని వినబడుటవలన వైశ్వానరుని జాఠరాగ్ని అనవలయును.పరమేశ్వరుడు కాదు అనిన. అట్లు అనుట సరికాదు. ''మనో బ్రహ్మేత్యుపాసీత'' మనస్సు బ్రహ్మమని ఉ పాసనచేయుము( ఛాం. ఉ. 3-18-1) '' మనోమయః ప్రాణశరీరో భారూపః''( ఛాం.ఉ. 3-14-2) " ఆబ్రహ్మము మనోమయము, ప్రాణశరీరము మరియు ప్రకాశస్వరూపము" మనోమయమనగా మనఃప్రాయము, ప్రాణశరీరమనగా సూక్ష్మశరీరము, భారూపమనగా చైతన్య లక్షణరూపము. ఇత్యాది శ్రుతుల ద్వారా జఠరాగ్నిని పరమేశ్వరుని దృష్టితో ఉపాసన చేయుటకు ఉపదేసించిరి. జఠరాగ్నిలోనే వైశ్వానర శబ్దము ముఖ్యముగా ప్రయోగించిరని చెప్పుటకు వీలులేదు. ఏలనన ద్యులోకము శిరస్సు, పృథివీ పాదములు అను విశేష ప్రయోగము అసంభవమగుటవలన. ఇంతేగాక పూర్ణపురుషుని వైశ్వానరునిగా వాజసనేయశాఖవారు అధ్యయనము గావించుచున్నారు. ''స ఏషోఽగ్నిర్వైశ్వానరో యత్పురుషః సః యో హైతమేవమగ్నిం వైశ్వానరం పురుషం పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేద''(శ.బ్రా.10-6-1-11) ఈ వైశ్వానర అగ్నియే పురుషుడు, ఏ పురుషుడు ఆ వైశశ్వానరుని తన అన్తఃకరణములో ప్రతిష్టితుడై యున్నాడని తెలిసికొనునో, అను వాక్యములో వైశ్వానరుని పురుష శబ్దముతో చెప్పిరి.ఆ పరమేశ్వరుడు సర్వవ్యాపకుడగుట వలన పరుషత్వము మరియు పురుషుని లోపల ఉండుటయు అను ధర్మములు యుక్తియుక్తములు. అందువల్ల వైశ్వానరుడు పరమాత్మయే.

**58. అత ఏవ న దేవతా భూతం చ.1-2-27.**

**సూత్రార్థము:-భూతాగ్నికాని అగ్నిఅభిమానదేవత కాని వైశ్వానరశబ్దవాచ్యము కాదు. ద్యులొకము శిరస్సు అనునవి వీనిలోగూడ అసంభవము. జాఠరాగ్ని ఉపాధిలో నున్న పరమాత్మయే వైశ్వానరుడు.**

**పైచెప్పిన కారణములవలననే భూతాగ్ని కాని అభిమానదేవతకాని వైశ్వానరుడు కానేరడు. భూతాగ్నిలో ఉష్ణత్వము మరియు ప్రకాశత్వమను గుణములు మాత్రమే గలవు గాని దానియందు స్వర్గము శిరస్సు అను కల్పన కుదరదు. ద్యులోకము, భూతాగ్నివికారూపమయిన కార్యములు. ఒకకార్యము నుండి వేరొకకార్యముత్పన్నము గానేరదు.**స్వర్గము శిరస్సు అని చెప్పుటవలన వైశ్వానరుడు జాఠరాగ్ని కాకపోయినను దేవత అనవచ్చును కదా అన్న దానికి పై సూత్రము చెప్పినారు. దేవతయందుగల ఐశ్వర్యమువల్ల గూడ ద్యుమూర్ధత్వాదుల సంభవము కాదు. దేవతలు స్వర్గాదులకు కారణము కాజాలరు. అంతేగాక దేవత ఐశ్వర్యము పరమేశ్వరాధీనము. అందువల్ల నిరంకుశ ఐశ్వర్యముగల సర్వాత్మమైన పరమేశ్వరుడే వైశ్వానరుడు.

జాఠరాగ్ని ఉపాధిగాగల పరమాత్మ ఉపాస్య మనియు శరీరములోపల ప్రతిష్టితుడైయున్నాడని వైశ్వానరుడు పరమాత్మయని ఇంతవరకు నిర్ణయించిరి. ఇప్పుడు ప్రతీకము లేక ఉపాధి కల్పన లేకుండగనే సాక్షాత్తుగా పరమాత్మ ఉపాసనచెప్పుటవలన విరోధము లేదని జైమిని ఆచార్యులు చెప్పుచున్నారు.

**59. సాక్షాదప్యవిరోధం జైమినిః 1.1.28.**

**సూత్రార్థము:- జైమిని మహర్షి చెప్పునదేమనగా బ్రహ్మమునందు జఠరాగ్ని ఉపాధి లేకయే వైశ్వానరశబ్దమునకు బ్రహ్మవాచకమని చెప్పుటలో విరోధము లేదు. పూర్వాపరములను ఆలోచించుటవలన వైశ్యానరశబ్దము బ్రహ్మవాచి అనునది సునిశ్చయము.**

**వైశ్వానరశబ్దమునకు రెండు రకములుగా అర్థము చెప్పవచ్చును "విశ్వశ్చాసౌ నరశ్చ" ఎవడు విశ్వరూపముగా నుండి నరుడో లైక "విశ్వేషాం వాఽయం నరః" విశ్వమునకు నరుడో, "విశ్వో వా నర అస్యేతి" సంపూర్ణ విశ్వము ఎవనికి నరుడో ఆతడు సర్వాత్మరూపుడగుటచే పరమాత్మయే వైశ్వానరుడు. విశ్వానర శబ్దమునకు స్వార్థములో రాక్షసవాయసాదులవలే తద్ధిత ప్రత్యయమగుటచే వైశ్వానరుడగును.పూర్వపదమునకు "నరే సంజ్ఞాయామ్" అను సూత్రముద్వారా దీర్ఘమయినది. ఈవిధముగా యౌగికార్థము చూసినను బ్రహ్మపరముగా తెలిసికొనవలయును. "అగ్రే నయతి" ముందుండి నడిపించువాడు. అందరికి నేత అగ్ని సర్వాత్మ అగుటవలన గార్హపత్యాగ్ని కల్పన, ప్రాణాహుతి, అధికరణము పరమేశ్వరునియందు యుక్తమే.** ఇంతకుముందు జాఠరాగ్నిలో పరమాత్మ ఉపాసన చెప్పిరి. ఇప్పుడు ప్రతీక ఉపాధి లేకయే సాక్షాత్తుగా పారమాత్మ ఉపాసన చెప్పినను విరోధము లేదని జైమిని ఆచార్యులు చెప్పు చున్నారు. ఈ సూత్రములో.పూర్వాపర ఆలోచనద్వారా వైశ్వానర శబ్దమునకు పరమాత్మ అని నిశ్చయముగా చెప్ప వచ్చును. పరమాత్మకు చెప్పిన సీమిత ప్రదేశత్వ శ్రుతిని వ్యాఖ్యానము చేయుచున్నారు.

**60. అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః 1.2.29.**

**సూత్రార్థము:-జ్ఞానుల హృదయములో అనుభవమునకు వచ్చుట వలన ప్రాదేశమాత్ర శ్రుతి యుక్తి సంగతము. లేనిచో ఉపసకులను అనుగ్రహించుటకు హృదయాది పరిణామాణము పరమేశ్వరునికి చెప్పిరి. ఆ హృదయమునందు పరమేశ్వరుడు ప్రకటమగునని ఆశ్మరథ్యాచార్యులు చెప్పుచున్నారు.**

హృదయాములో అభివ్యక్తి అగుటవలన సర్వగత పరమాత్మను సీమిత ప్రదేశములో చెప్పుట యుక్తమే. ఏలనన హృదయములో "అభివ్యక్తేః" అభివ్యక్తి లేక ప్రకటమగుటవలన. హృదయదేశములో అనుభవమునకు వచ్చుటచే ఆశ్మరథ్యాచార్యులు ఈవిధముగా అనిరి. ఉపాసకుల సౌకర్యమునకు అట్లు చెప్పిరి, మరియు ఉపాసకులను అనుగ్రహించుటకై వారి హృదయదేశములో ప్రకటమగును.

**61. అనుస్మృతేర్బాదరిః 1.2.30.**

**సూత్రర్థము:- బాదరి ఆచార్యల మతమేమనగా ప్రాదేశమాత్రముగల మనస్సులో నున్న పరమాత్మను మనస్సు ద్వారా ధ్యానము చేయు కారణముచే పరమేశ్వరునిగూడ ప్రాదేశమాత్రము(విస్తృత అంగుష్ఠ తర్జనీ మధ్య భాగము ప్రాదేశమాత్రము** లేక దానినే లుడితెడు అందురు.)గల వాడందురు.

ప్రాదేశమాత్రమైన హృదయ స్థానములో ప్రతిష్టితుడై ఉన్నందువలనను మనస్సు ద్వారా స్మరణ ధ్యానాదుల వలనను వ్యాపకుడైనను ప్రాదేశమాత్రమని గౌణప్రయోగము గావించిరని బాదరి ఆచార్యులు అనుచున్నారు. ఏవిధముగా ఒక శేరుతోకొలచిన ధాన్యమును శేరుధాన్యము అందురు అదేరీతిగా ప్రాదేశమాత్రత్వము శ్రుతిలో అనిరి.

**62.సంపత్తేరితి జైమినిస్తథా హి దర్శయతి.1.2.31.**

**సూత్రార్థము:-శిరస్సు నుండి చుబుకము వరకు ప్రాదేశమాత్రస్థానములో సంపత్తి ద్వారా (సమాన ప్రకరణములో చెప్పిన ధ్యానవిధి సంపాదన) వైశ్వానరుని ఉపాసించుట వలన వ్యాపకపరమేశ్వరుని ప్రదేశమాత్రుడని చెప్పినారు. జైమిని ఆచార్యుల మతమిది. వాజసనేయ బ్రాహ్మణముగూడ శిరస్సునుండి గడ్డము వరకు గల స్థానములో వైశ్వానరుని ఉపాసన చెప్పిరి.**

**తలనుండి గడ్డమువరకు దేహావయవములలో అనగా ప్రాదేశమాత్రములో వైశ్వానరుని ఉపాస్యము ప్రతిపాదించుటవలన పరమేశ్వరునికి పరిచ్ఛిన్న పరిమాణము ప్రాప్తమయినది.దానినే శ్రుతి ప్రాదేశమాత్రమనినది అని జైమిని ఆచార్యులు అనుచున్నారు. పేరొకశ్రుతిలో –"ప్రాదేశమాత్రమివ హ వై దేవాః సువిదితా అభిసంపన్నాః" "మొదలులో దేవతలు అపరిచ్ఛిన్నమైన ఈశ్వరుని సంపత్తి ఉపాసన ద్వారా ప్రాదేశమాత్రుడని తెలిసికొని సంపన్నులైరి." పైనుదాహరించిన వాజసనేయ బ్రాహ్మణమునందు స్వర్గమునుండి పృథివీవరకు ఉన్న వైశ్వానరావయవములను మూర్ధ అనగా తల పైభాగమునుండి చుబుకము అనగా గడ్డము వరకు గల అవయవములలో త్రిలోకి వైశ్వానరుని చెప్పిరి. అనగా త్రైలోక్యాత్మ వైశ్వానరుని ప్రాదేశమాత్రత్వమును చెప్పిరి.**

**63.ఆమనన్తి చైనమస్మిన్.1.2.32.**

**సూత్రార్థము:-జాబాల శ్రుతి శిరస్సునుండి గడ్డము వరకుగల మధ్యభాగములో పరమేశ్వరుని ఉపసించవలెనని చెప్పు-చున్నది.**

**జాబాల శ్రుతిలో ఈ ప్రాదేశమాత్రమునుగురించి ''య ఏషోఽనన్తోఽవ్యక్త ఆత్మా సోఽవిముక్తే ప్రతిష్ఠితః । వరణాయాం నాస్యాంచ మధ్యే ప్రతిష్టితః'' ॥ (జా.1) అనంతుడై స్పష్టముగానెఱుంగరాని వాడై యుండు పరమేశ్వరుడు అవిముక్తమున(బద్ధుడైన జీవుని యందు) నున్నాడు. అవిముక్తమెచట నున్నది? వరణకును నాసిక మధ్యలో ఆత్మ ప్రతిష్టితమైనది. (పౌరాణికులు అందువల్ల అంతర వారణాసి కనుబొమ్మల మధ్యస్థానము అనిరి) జీవ పరమేశ్వరుల భేధము కల్పితము గనుక జీవునియందు ఉన్నవాడు పరమేశ్వరుడే. అందువల్ల పరమేశ్వరుని చెప్పుటకు ప్రాదేశమాత్ర శ్రుతి యుక్తియుక్తము. సర్వాత్మస్వరూపుడైన పరమాత్మయే వైశ్వానరుడనునది సిద్ధమయినది.**

**బ్రహ్మసూత్రహృదయము నందు ప్రథమాధ్యాయములోని ద్వితీయపాద సంకలనము సమాప్తము.**

## <u>ప్రథమాధ్యాయస్య ద్వితీయపాదః సమాప్తః.</u>

## <u>ప్రథమాధ్యాయే తృతీయపాదః.</u>

# <u>19.ద్యుభ్వాద్యధికరణము.1-7.</u>

**ఈ పాదమునంద అస్పష్ట బ్రహ్మ చిహ్నములుగల జ్ఞేయబ్రహ్మవిషయముల (నిర్గుణ బ్రహ్మ) విచారము బాహుళ్యముగా గలదు. అస్పష్టబ్రహ్మ చిహ్నములున్న వేదాంత వాక్యములందుగల ఉపాస్య బ్రహ్మవిషయములను బ్రహ్మమందు సమన్వయమగుటను ఈపాదములో ప్రతిపాదంచిరి. జ్ఞేయబ్రహ్మమందు సమన్వయము భోధించుటకు ఈ పాదము నారంభించిరి.**

సంగతి:- క్రిందటి అధికరణములో మూడులోకములలో వ్యాప్తమైన( త్రైలోక్యాత్మ ) వైశ్వానరుని పరమాత్మ అనిరి. అపుడు మూడు లోకముల ఆయతనము లేక ఆధారము పరమాత్మ కన్న భిన్నమగును అను ఆక్షేపమునకు సమాధానముగా ఈ అధికరణము ప్రారంభమగు చున్నది. అందువల్ల **పూర్వ అధికరకణముతో ఈ అధికరణమునకు ఆక్షేప సంగతి.**

**విషయము:- "యస్మిన్ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః I తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముంచథామృతస్యైష సేతుః" II (ముం.2-2-5). దేనిలో ద్యులోకము, పృథివీ, అన్తరిక్షము, మరియు సంపూర్ణ ఇన్ద్రియములతో పాటు మనస్సు గూడ ఓతప్రోతమో ఆఒక్క ఆత్మనే తెలిసికొనుము, అన్యఅనాత్మవిషయముల చిన్త వదిలివేయుము, ఇదియే సంసారమును దాటించి అమృతత్వము పొందుటకు సేతువు. ఈ వాక్యము ఈ అధికరణమునకు విచారణీయ విషయము.**

**సంశయము:-ద్యులోకాదుల ఆధారము ప్రధానమా, జీవుడా లేక పరమాత్మయా? అనునది సంశయము.**

**పూర్వపక్షము:- స్మృతిలో ప్రసిద్ధమైన ప్రధానము జగత్తుకి కారణమైనందున అన్నింటికీ ఆధారమని చెప్పిరి. లేనిచో భోక్త అయినందున భోగ్య ప్రపంచమునకు ఆధారము జీవుడన వచ్చును.**

**సిద్ధాన్తము:- ద్యులోక భూలోకాదుల ఆధారము పరమాత్మయే, ప్రధానము కాని జీవుడు కాని కాజాలరు. ఎందులకనగా పరమాత్మను చెప్పు ఆత్మ శబ్ద ప్రయోగము వల్ల. ముక్తపురుషుల గన్తవ్య స్థానము జీవుడు కాని ప్రధానము గాని కాదు. బ్రహ్మ యొక్క ప్రకారణము జరుగు చున్నది, ఆ బ్రహ్మమునకు సర్వజ్ఞము, సర్వశక్తిమత్వము కలదనిరి. దానివల్ల ద్యులోకాదుల ఆధారము పరమాత్మయే, అన్యము కాజాలదు.**

**వైయ్యాసికన్యాయమాల.**

**సూత్రం ప్రధానం భోక్తేశో ద్యుభ్వాద్యాయతనం భవేత్ । శ్రుతి స్మృతిప్రసిద్ధిభ్యాం భోక్తృత్వాచ్చేశ్వరేతరః .॥**

**నాఽఽఽద్యౌ పక్షావాత్మశబ్దాన్న భోక్తా ముక్తగమ్యతః । బ్రహ్మప్రకారణాదీశః సర్వజ్ఞత్వాదితస్తథా॥**

**"యస్మిన్ ద్యౌః పృథివీ" అను శ్రుతిలో ద్యులోకము భూలోకాదులకు ఆధారము సూత్రాత్మ (హిరణ్యగర్భుడు) లేక ప్రధానమా, జీవుడా కాక ఈశ్వరుడా అని సంశయము రాగా పూర్వపక్షి శ్రుతి స్మృతులలో ప్రసిద్ధమైనది మరియు ఆత్మశబ్మము ద్వారా తెలియుచున్నందున భోక్తృత్వము వినబడుటవలనను ఈశ్వరుడు గాక సూత్రాత్మ, ప్రధానము లేక జీవుడు సర్వలోక ఆధారమనును. ద్యులోకాదులకు ఆధారము పరమాత్మయే సూత్రాత్మ గాని ప్రధానముగాని జీవుడుకాని కాదు అని సిద్ధాన్తము. ఎందులకనగా ఆత్మ శబ్దప్రయోగమువలన. అంతేగాక ముక్తపురుషుడు ప్రధానమును గాని జీవుని గాని జేరడు ఈశ్వరునే జేరును. సర్వజ్ఞత్వాది గుణములు గల బ్రహ్మ ప్రకరణము నడచుచున్నది గావున ఈశ్వరుడే ద్యులోకాదులకు ఆధారము.**

**ముండకొపనిషత్తులో ఈవిదముగా చెప్పబడినది "యస్మిన్ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం మనః సహ ప్రాణైశ్చసర్వైః। తమేవైకం జానథ ఆత్మానమన్యావాచో విముఞ్చథామృతస్యైష సేతుః ॥" (ముం.2.2.5) ఏ అక్షర పురుషునియందు ద్యులోకము, భూమి, ఆకాశము, మనస్సు ప్రాణములు సర్వేంద్రియములు ప్రతిష్టింపబడియున్నవో ఆతడే ఆత్మ. అతడే ఏకస్వరూపుడు. కాన ప్రాపంచిక విషయాలోచన వీడుము. ఇదియే అమృతత్వమునకు మార్గము.**

పైన చూపినరీతిగా ముండక శ్రుతిలో ద్యులోక భూలోకాదులు గల సంపూర్ణ జగత్తునకు ఆత్మయే ఆధారము. ఆ ఆధారమునే తన ఆత్మరూపముగా తెలిసికొనుము కాని ఆశ్రయుంచియున్న ద్యుభూలోకాదులను కాదు. దీనికైన వేరైన అనాత్మను ప్రతిపాదించు తర్క శాస్త్రాదివచనములను వదిలిపేయుము, ఏలనన అవి పురుషార్థ సాధనములు గావు. ఇచట సంశయము. ద్యుభ్వాది (స్వర్గ భుములకు)ఆధారము సూత్రాత్మయా, ప్రధానమా, భోక్తజీవుడా లేక ఈశ్వరుడా. సూత్రాత్మహిరణ్యగర్భుడు కావచ్చును."వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సన్దృబ్ధాని భవన్తి" (బృ.3.7.2) హే, గౌతముడా! వాయువు గొప్పత్రాడు దానిచే ఈ లోకములన్నియు పరలోకములన్నియు మరియు భూతములన్నియు వాయువను సూత్రములో (చేర్చికట్ట బడి) గుచ్చబడి యున్నవి.(బృ.ఉ.3-7-2.) అను శ్రుతి ప్రసిద్ధి ద్వారా వాయువు సూత్రాత్మ ద్యుభ్వాద్యాయతనము అని తెలియు చున్నది. ప్రధానము కావచ్చును ఏలనన దానిని సాంఖ్యస్మృతిలో సర్వాధారముగా ప్రసిద్ధమను చున్నారు గాన. భోక్త జీవుడన వచ్చును ఏలనన "తమేవైకం జానథఽఽత్మానమ్ " భూమ్యాదులకు ఏ పదార్థమాధారమో దానినొక్కదానినే తెలిసికొనుము. అని ఆత్మ శబ్ద ప్రయోగము వల్ల. ఈ పూర్వపక్షి సంశయమునకు సిద్ధాన్తి సమాధానము. సూత్రాత్మ, ప్రధానములను మొదటి రెండు పక్షముల సంభవమే లేదు ఏలనన ఇవి స్వర్గభూములకు ఆధారము కానేరవు.

ఆత్మశబ్దము నకు భోక్త జీవుడనిన ఆతడుగూడ స్వర్గభూములకు ఆధారము కానేరడు. "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం I తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమమ్ సామ్యముపైతి"II(ముం.ఉ. 3-1-3.) "ఎపుడు తత్వదర్శి స్వయంజ్యోతిస్వరూపుడైన సువర్ణమైన, బ్రహ్మఉత్పత్తి స్థానమైన జగన్నిర్మాత పరమేశ్వరుని, పూర్ణపురుషుని, తెలిసికొనునో (అనుభవించునో) అపుడు పుణ్యపాపములను దహించి నిరంజనుడై అద్వైతరూపమయిన సమానత్వమును పొందును." ద్యుభ్వాద్యాయతనమును ముక్తపురుషులు పొందుదురు అని వినిపించుచున్నందున భోక్త అయిన జీవుడు సర్వాధారము కాజాలడు. "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ముం.1.1.3) దేనిని తెలిసికొనిన సర్వము తెలియునో, అని ఒక విజ్ఞానముద్వారా సర్వవిజ్ఞానముతో విషయము ఉపక్రమించిరి. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ముం.3.2.9) బ్రహ్మమును తెలిసికొనిన వాడు బ్రహ్మరూపమే అగును, అని ఉపసంహారము గావించిరి. బ్రహ్మ ప్రకరణమగుట వలన సర్వజ్ఞత్వాదులు చెప్పుట వలన భూతములకు కారణము, ఆధారము చెప్పుటవలన ద్యుభ్వాద్యాయతనము బ్రహ్మమే.

64.ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్.1-3-1.

సూత్రార్థము:-"యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతమ్" "దేనియందు దేవలోకము, భూలోకము, అంతరిక్షలోకము మొదలగునవి కల్పితములో" అను శ్రుతియందు ద్యులోకాదులకు ఆశ్రయము పరబ్రహ్మమే ఎందులకనగా బ్రహ్మవాచకము ఆత్మశబ్దము శ్రుతిలో గలదు.

ఇచట పూర్వపక్షములో ప్రధానాదుల ఉపాసన. సిద్ధాన్తములో బ్రహ్మజ్ఞానమని ఫలభేదము. "ద్యౌశ్చ భూశ్చ ద్యుభువౌ, ద్యుభువావాదీ యశ్చ జగతః తద్యుభ్వాది" స్వర్గము భూలోకము దేనిలో ప్రధానములో అట్టి సర్వలోకాధారము పరబ్రహ్మమే అగును. దేనికంటే "స్వ శబ్దాత్". పరబ్రహ్మ స్వరూపము చెప్పుటకే ఆత్మశబ్దప్రయేగము గావించిరి. "తమేవైకం జానథ ఆత్మానం" (ముం.2.2.5.) ఆ ఆత్మనొకదానినే తెలిసికొనుము. అనుచోట ఆత్మశబ్దము పరమాత్మ విషములోనే సంభవము అన్యత్ర కాదు. ఉపాధివిశిష్టమైన జీవాత్మయందుకూడ ఆత్మశబ్దము ప్రయోగింతురుకదా అనుటకు వీలులేదు. "తమేవైకం జానథ" అను శ్రుతిలో "ఏవ" శబ్దము (నిశ్చయార్థకము)మరియు " ఆత్మ" శబ్ద ప్రయొగము వల్ల కార్యరూపమయిన విశిష్టచైతన్యము గ్రహణము కాదు కాని నిరుపాధిక నిర్గుణ నిరాకార పరబ్రహ్మమే విజ్ఞేయము అని అర్థము. దేనిమీద దేవదత్తుడు కూర్చున్నాడో దానిని తీసుకురమ్ము అనిన కూర్చున్న ఆసనమునే తీసుకొనివచ్చుదురు కాని దేవదత్తుని కాదు.అట్లే ఏకరస ఆత్మ అన్నింటికీ ఆయతనము, అదే విజ్ఞేయము అని ఉపదేశించిరి.అందువల్ల ఉపక్రమములో నున్న ఆయతనత్వమును గౌణ సేతుత్వ హేతువుగా భావించి ప్రథమ ఆత్మశబ్ద ప్రయోగమువల్ల పరబ్ర హ్మమునే ఆయతనముగా భావించవలయును.

**65.** ముక్తోపసృప్యవ్యపదేశాత్.1.3.2.

సూత్రార్థము:-“బ్రహ్మజ్ఞాని నామరూపములనుండి ముక్తుడై అనగా అజ్ఞానము దాని యొక్క కార్యములనుండి విడివడి పరాత్పరమైన సర్వోత్కృష్ట దివ్యపురుషునితో ఏకీభవించును”. అను ఈశ్రుతివాక్యములో ముక్త పురుషుల ద్వారా పరబ్రహ్మ ప్రాప్యమని చెప్పబడినది, గనుక దేవలోక భూమ్యాదులకు ఆధారము పరబ్రహ్మమే.

పరబ్రహ్మమే ద్యులోక భూమ్యాదులకు ఆయతనము, ఏలనన ముక్తపురుషులు ప్రాప్తిచెందునది ఈపరబ్రహ్మమే అని “ముక్తోపసృప్య” అనుపదము ద్వారా ఉపదేశించుటవలన. ముక్తోపసృప్య పదమునకు ముక్తోపసృప్యతా అని  అర్థము. అనగా అవిద్యవలన దేహాదులందు ఆత్మబుద్ధి ఉండుటవలన దేహపూజాదులందు రాగమును, మరియు దేహాదుల అనాదరము వలన ద్వేషము చూడబడుచున్నది. అవిద్య నశించుటవలన  దానికి విపరీతముగా రాగాది దోషములనుండి ముక్తులై ద్యుభూములకు ఆధారమయిన బ్రహ్మముతో ఐక్యము  అని అర్థము. “తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్” తత్వవేత్త నామరూపాదులనుండి విముక్తుడై సర్వోత్కృష్ట  దివ్యపురుషుని ప్రాప్తి పోందును, అని ముండకోపనిషత్తు (3-28 వ శ్లోకము) లో ఉపదేశించిరి. ప్రధానాదులలో ముక్తపురుషుడు జేరునని ఏశ్రుతిలోనూ  ఏశాస్త్రములోను ఉపదేశించలేదు.  అందువల్ల ద్యులోకాదులకు ఆయతనము పరబ్రహ్మమే.

### 66. నానుమానమతచ్ఛబ్దాత్ 1.3.3.

సూత్రార్థము:- సాంఖ్యుల ద్వారా పరికల్పితమైన ప్రధానము ద్యులోకాదులకు ఆశ్రయము కానేరదు. ఎందులకనగా “యస్మిన్ ద్యౌః” అనువాక్యములో ప్రధాన  వాచక శబ్దము లేదు.

అనుమీయతే ఇతి అనుమానం, సాంఖ్యులు కల్పన చేయు ప్రధానము  ఇచట ద్యుభ్వాద్యాయతనము  కానేరదు. ఎందులకనగా ఈ అచేతన ప్రధానము యొక్క ప్రతిపాదనము చేయు శబ్దము లేనందువలన దానినే సూత్రములో అతచ్ఛబ్దాత్ అనిరి. “యః సర్వజ్ఞః సర్వవిత్” సామాన్యముగా విశేషముగా అన్నియు తెలిసినవాడు అని శ్రుతిలో జడమునకు విపరీతమైన చైతన్యమును ప్రతిపాదించు శబ్దములు గలవు గాన ప్రధానము ద్యుభసాఖ్యులద్వారా పరికల్పితమైన ప్రధానము ద్యులోకాదులకు ఆశ్రయము కానేరదు.

### 67.ప్రాణభృచ్చ 1.3.4.

సూత్రార్థము:- జీవుడు గూడ స్వర్గభూములకు ఆశ్రయము కాజాలడు. ఎందులకనగా వానిని ప్రతిపదించు శబ్దములు లేవు.

సూత్రములోని చ శబ్దము పూర్వసూత్రములోని ద్యుభ్వాద్యాయతనము మరియు,అతచ్ఛబ్దాత్ అను పదముల యొక్క అనువర్తనము సూచించును. ప్రధానమువలే ద్యు భూలోకముల ఆయతనము జీవుడు, అను శబ్దముగూడ శ్రుతులలో కానరాదు. జీవునిలో ఆత్మత్వము చైతన్యత్వము ఉన్నను ఉపాధి పరిచ్ఛిన్నుడైనుండుట వలన సర్వజ్ఞాత్వాది గుణములు లేవు. అందువల్లగూడ జీవుడు ద్యు భ్వాదుల ఆయతనము కాజాలడు. జీవుని ఆయతనత్వము ఖండిచిన తరువాత ముందు మూడు సుత్రములద్వారా అన్య హేతువును చెప్పుచున్నారు.

68. భేదవ్యపదేశాత్.1.1.5.

సూత్రార్థము:- ఆ ఒకే ఆత్మను తెలిసికొనుము. అని శ్రుతిలో జ్ఞాత జ్ఞేయరూపములుగా జీవపరమాత్మల భేధము చెప్పుట వలన జీవుడు భూమ్యాదుల ఆశ్రయము కానేరడు.

ద్యు భ్వాద్యాయతనము మరియు ప్రాణభృచ్చ అను పదములు ముందు మూడు సూత్రములలో అనువర్తించును. “తమేవైకం జానథ ఆత్మానం” ముండకోపనిషత్తులో ఆ ఆత్మనే తెలిసికొనుము అని ప్రాణము ధరించిన ముముక్షువును జ్ఞాత తెలిసికొనువానిగా, ఆత్మశబ్దవాచ్యమైన బ్రహ్మమునే జ్ఞేయమని తెలిసికోవలసిన బ్రహ్మముగను భేధోవపదేశము అనగా భిన్నములుగా ఉపదేశించుట వలన జీవుడు ద్యుభ్వాద్యాయతనము గాజాలడు.

66. ప్రకరణాత్.1.3.6.

సూత్రార్థము:- “దేనిని తెలిసికొనిన ఇదంతయూ తెలిసకొబడునో” అని ప్రకరణము ఆరంభించిరి. ఇది బ్రహ్మ ప్రకరణము. కాన జీవుడు భూమ్యాదుల ఆశ్రయము కానేరడు.

“కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి” హే భగవన్ దేనిని తెలిసికొనిన ఈ సంపూర్ణ సంసారము తెలిసికోబడును.(ముం.1-1-3). ఒకవిజ్ఞానము ద్వార సర్వవిజ్ఞానము యొక్క ప్రసంగము కాన వచ్చుచున్నది. అది బ్రహ్మజ్ఞానము ద్వారానే సంభవము. సంపూర్ణ సంసారమునకు అధిష్ఠానము బ్రహ్మ, వానిని తెలిసికొనిన వానిలొ కల్పిత సంపూర్ణ సంసార జ్ఞానము కలుగును. బ్రహ్మప్రకరణములో జీవుడు ద్యుభ్వాద్యాయతనము కానేరడు.

67. స్థిత్యదనాభ్యాం చ. 1.3.7.

సూత్రర్థము:- “ద్వా సుపర్ణా” అనుమంత్రములో ఔదాసీన్య పూర్వక స్థితి, కర్మఫలభోగము, పరమాత్మ, క్షేత్రజ్ఞుల భేద నిర్దేశము ఉన్నందువల్ల జీవుడు భూమ్యాదుల ఆశ్రయము కానేరడు.

“ద్వా సుపర్ణా” అను మంత్రములో ఒకే వృక్షముపై సమాన స్వభావముగల రెండు పక్షులు గలవు. “తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి” వానిలో ఒకటి కర్మఫలరూపమైన తీపి చేదు పండ్లను ఆరగించును, “అనశ్నన్ అన్యో అభిచాకశీతి” రెండవది కేవలము దానికి సాక్షియై యుండును.(ముం.3-1-1) అని ఉదాసీన భావము నిర్దేశించిరి.

దీనికి అర్థము శరీరరూపమయిన వృక్షముపై కర్మఫలములను అనుభవించు జీవాత్మరూపమయున పక్షియు మరియు పరబ్రహ్మరూమయిన పక్షి ఉదాసీన భావముతో నుండి ఆజీవునకు ప్రకాశము నిచ్చుచుండు నని అర్థము. ఒకనిని ఉదాసీనునిగను వేరొకనిని కర్మఫల భోక్తగను అనిన కారణముగా జీవుడు ద్యుభ్వాద్యాయతనము కాలేడు గాని పరబ్రహ్మమే సర్వాయతనమని సిద్ధము.

## 20. భూమాధికరణము.1.3.8-9.

సంగతి- క్రిందటి అధికరణములో ఆత్మశబ్దప్రయోగమువల్ల ద్యులోకాదుల ఆయతనము పరమాత్మఅనిరి, అట్లనుట సరికాదు. ఏలనన "తరతి శోకమాత్మవిత్" (ఛాం.ఉ.7-1-3.) "ఆత్మవేత్త శోకమును దాటును" ఈ ప్రకరణములో ప్రశ్నోత్తరముల పరంపర ప్రాణముకన్నముందు కానబడుట లేదు,అందువల్ల ప్రాణములో ఆత్మశబ్దప్రయోగము సంభవము. ఈవిధముగా ఆక్షేపము కలుగుటవలన ఈఅధికరణము ప్రారంభమయినది. గాన పూర్వాధికారణముతో దీనికి ఆక్షేపసంగతి.

విషయము- "భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః" "భూమానం భగవో విజిజ్ఞాస" "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శ్రుణోతి నాన్యత్ విజానాతి స భూమా" (ఛాం.ఉ.7-23, 24.) భూమాతత్వమునే ఉపాసించవలయును. సనత్కుమారుని ఈ ఉపదేశమును విని నారదుడు మీ ఉపదేశాను సారము భూమాతత్వమునే ఉపాసింతును కాని భూమాతత్వమును తెలియజేయుడు, అనిన ఏ స్థితిలో సాధకుడు తనకన్న భిన్నవస్తువును చూడడో, వినడో, తెలిసికొనడో దానిసే భూమా తత్వమందురు. ఈశ్రుతి వాక్యము ఈ అధికరణమలో విచారణీయ విషయము.

సంశయము-భూమా శబ్దమునకు అర్థము ప్రాణమా లేక పరమాత్మయా? అని సంశయము.

పూర్వపక్షము- నారద సనత్కుమార ప్రసంగములో నామము నుండి ఆశవరకు ప్రశ్నోత్తరములు కానవచ్చు చున్నవి దానిముందు ప్రశ్నోత్తరములు కాన వచ్చుట లేదు. అందువల్ల అనుగతమైన అతివాదిత్వ శబ్దము భూమాపరముగా చెప్పుట వలన భూమాశబ్దార్థము వాయువు అనవలయును.

సిద్ధాంతము- "ఏష తు వా అతివదతి యః సత్యేనాతివదతి" అతివాది అగువాడు సత్యముద్వారానే అతివాది అగుచున్నడు (ఛాం ఉ. 7-16) తు అను శబ్దముద్వారా ప్రాణప్రకరణము వేరుచేసి సత్యము యొక్క ప్రసంగము ప్రారంభమయినది. అందువల్ల భూమా పదమునకు అర్థము పరమాత్మయే. మహాఉపక్రమము గూడ పరమాత్మదే. సమస్త ద్వైతాభావము (ద్వైతము యొక్క అభావము) గూడ పరమాత్మనందే, గాన భూమాపదము యొక్క అర్థము పరమాత్మఅనియే నిశ్చయమయినది.

వైయాసికన్యాయమాలా

భూమా ప్రాణః పరేశో వా ప్రశ్నప్రత్యుక్తివర్జనాత్ । అనువర్త్యాతివాదిత్వం భూమోక్తేశ్చాసురేవ సః॥

విచ్ఛిద్యైష త్వితి ప్రాణం సత్యస్యోపక్రమాత్తథా । మహోపక్రమ ఆత్మోక్తేరీశోఽయం ద్వైతవారణాత్॥

నారదసనత్కుమారుల ప్రసంగములో "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి" ఈత్యాది వాక్యములో వచ్చిన భూమాశబ్దము ప్రాణమా లేక ఈశ్వరుడా అను సంశయమునకు పూర్వపక్షి ప్రణోపదేశాన్తరము ప్రశ్నోత్తరములు లేవు మరియు అతివాదిత్వము అనువర్తించుట వలన భూమా శబ్దార్థము ప్రాణమే అనును. సిద్ధాంన్తి సమాధానము. "ఏష తు అతివదతి" అను వాక్యములో 'తు' శబ్దముద్వారా ప్రాణ ప్రసంగమును వేరుచేసి "యః సత్యేనాతివదతి" అను వాక్యములో సత్యశబ్దము ద్వారా ముందున్న అవాన్తర (రెండితి మధ్య) ప్రకరణము ఆరంభించిరి. ప్రకరణము మొదలునుంచి ఆత్మశబ్ద ప్రయోగము గలదు. మరియు "యత్ర నాన్యత్పశ్యతి" అని ద్వైతనిషేధము గావింరి. అందువల్ల భూమాశ బ్దమునకు అర్థము ఈశ్వరుడే.

ఛాందోగ్యములోని సప్తమాధ్యాయములో నారదునుకి సనత్కుమరులు నామముతో ఆరంభించి ముందుముందు అనేకతత్వములను ఉపదేశించి ఆఖరిలో అతిశయరాహిత్యమయిన భూమాతత్వమును ఉపదేశించిరి.."యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ చ్ఛృణోతి నాన్యద్విజానాతి స భుమా" (ఛాం.ఉ.7-24-1). ఈ శ్రుతికి అర్థము 'ఏ స్థితిలో అన్యము చూడడో, అన్యము వినడో, అన్యము తెలిసికొనడో అదే భూమాతత్వము'.అచట భూమా శబ్ద వాచ్యములో రెండురకముల సందేహముగలదు. ప్రశ్నప్రత్తుత్తరములు లేకవోవుటవలన భూమాశబ్దార్థము ప్రాణమని ప్రాప్తము. పూర్వము నామాదితత్వములలో "అస్తి భగవో భూయః" (చాం.ఉ. 7-1-5.)"దీనికన్న పెద్దది కలదా" అని నారదుడు మాటి మాటికి అడిగిన 'కలదు' 'అస్తి' అని సనత్కుమారులు జవాబిచ్చేడివారు. ఈ విధముగా ప్రశ్నప్రతివచనములద్వారా నామాది మొదలు ప్రాణము వరకు తత్వమును ఉపదేశించి ప్రాణముతరువాత ప్రశ్నసమాధానములు లేకనే భూమాతత్వమును ఉపదేశించిరి. కాన ప్రాణ భూమాదుల మధ్య విచ్ఛేదకశబ్దము లేకవోవుటచే భూమాశబ్దార్థము ప్రాణమే. కాని ప్రాణతత్వమునుపదేసించి ప్రాణమే ఉపాస్యమని అతివాదిత్వమను పేరుగల ఉత్కర్షమును చెప్పి ప్రాణవిచ్ఛేదక సందేహ నివృత్తి కొరకు ఆ అతివాదిత్వమును అనువృత్తిచేసి భూమాతత్వమునుపదేశించి ప్రాణ భూమాశబ్దముల అభేధము సూచించిరి, కనుక ప్రాణమే భూమాశబ్దార్థము.

అను పూర్వపక్షమునకు సమాధానము ఇచ్చుచున్నరు.ఈ భూమాతత్వము పరమేశ్వరుడే. ఏలనన "ఏష వా అతివదతి యః సత్యేన అతివదతి" (ఛాం.ఉ.7-16-1). ఎవడు సత్యతత్వమును ఆత్మగా అనుభవించి అది సర్వాతీతమని చెప్పునో ఆతడే యథార్థముగా అతివాది (సర్వాతీతమునెటింగి పలుకువాడు) ఇచట అతివాదిత్వ కారణము ప్రాణమను దానిని 'తు' శబ్దముద్వారా తొలగించి ముఖ్య అతివాదిత్వ కారణము బ్రహ్మమనుటకు 'సత్య' శబ్దముద్వారా వేరుగా ప్రారంభించిరి. అంతేగాక పరమో పక్రమములో "తరతి శోకమాత్మవిత్ " (ఛాం.ఉ.7-1-3) ఆత్మవేత్త శోకసాగరరూపమైన ఈ సంసారమును దాటును. అని వేద్య తత్వము పరామాత్మ అనిరి. మరియు "యత్ర

నాన్యత్ పశ్యతి" ఏ స్థితిలో రెండవ తత్వమును చూడడో అని ద్వైతనిషేధముద్వారా భూమాతత్వము యొక్క లక్షణము చెప్పిరి, గాన అద్వైత పరమాత్మతత్వమే భూమార్థము.

## 71.భూమా సమ్ప్రసాదాదధ్యుపదేశాత్.1.3.8.

**సూత్రార్థము:- "భూమాత్వేవ" భూమాతత్వమే తెలిసికొనుటకు యోగ్యమైనది, అను శ్రుతిలో చెప్పిన భూమాతత్వము పరమాత్మయే ఎందులకనగా ప్రాణోపదేశము తరువాత భూమా ఉపదేశము గావించిరి.**

**పూర్వపక్షి భూమాతత్వముద్వారా ప్రాణోపదేశమనును, సిద్ధాన్తి బ్రహ్మజ్ఞానోపదేశమనును. ఛాందోగ్యములో ఏడవ అధ్యాయములో "భూమాతత్వమునే ఉపాసన చేయువలయునని" సనత్కుమారుడు నారదునికి చెప్పెను. నారదుడు భూమాతత్వమును తెలియజేయుమనెను. ఏస్థితియందు సాధకుడు తనకన్న భిన్న వస్తువును చూడడో, వినడో, తెలిసికొనడో ఆస్థితినే భూమా అందురు. ఈవాక్యము ఇచట విచారణీయము. ప్రాణము ఆశకన్న గొప్పది అని సనత్కుమారుడు చెప్పిన తరువాత నారద సనత్కుమారుల పశ్నోత్తర పరంపర లేదు. ప్రాణమే భూమాతత్వమని పూర్వపక్షము. ఎందులకనగా ప్రాణవేత్తను అతివాది అనిరి అనును.**

**భూమాతత్వము పరమేశ్వరుడే. ఏలనన "సమ్ప్రసాదాదధ్యుపదేశాత్" ఏ అవస్థలో జీవుడు సంపూర్ణముగా ప్రసన్నుడవుతాడో ఆనిద్రా అవస్థను సంప్రసాదమందురు. అదే సుషుప్తి. ఆ సంప్రసాద అవస్థలో ప్రాణములు జాగరూకములైయుండును. సంప్రసాద శబ్దముద్వారా ప్రాణమునందురు. ఆప్రాణమునకన్న పైన ఉపదేశము గలదు. "ప్రాణాదధి" ప్రాణోపదేశము తరువాత భూమాతత్వమును ఉపదేశించిరి. ప్రాణోపదేశము తరువాత ప్రశ్న సమాధానములు లేవనుట సరికాదు.ప్రాణ ఉపదేశమువిని ఊరుకొనిన అకృతార్థుడైన నారదులవారికి సనత్కుమారులే స్వయముగా ప్రాణభిన్న మైన భూమాతత్వమును ఉపదేశించిరి. అతివాదిత్వము ప్రాణవిషయమే ననుట సరికాదు. "ఏష తు వా అతివదతి యః సత్యేనాతివదతి" ఎవడు సత్యమైన ఆత్మనెఱింగి చెప్పునో వాడే యథార్థముగా అతివాది అగును. ఈ శ్రుతిలో 'తు' శబ్దము ద్వారా ప్రాణము యొక్క అతివాదిత్వము తొలగించి సత్య పదవాచ్య పరమాత్మవాదమును అతివాదిత్వమని చెప్పుచు ప్రాణభిన్నమైన భూమాతత్వమును ఉపదేశించిరి. మరియు 'తరతి శోకమాత్మవిత్' అను శ్రుతి వాక్యములో శోకపద వాచ్యమయిన అవిద్యాకార్యమయిన సంసారమును ఆత్మజ్ఞానముద్వారా దాటుట చెప్పుటచే భూమాతత్వము పరమాత్మ అనియే అనుకొనవలయును.**

## 72. ధర్మోపపత్తేశ్చ1.3.9.

**సూత్రార్థము:- "యత్ర నాన్యత్పశ్యతి" "ఏ అవస్థలో ఇతరులను చూడడో అది భూమా" అనుశ్రుతిలో చూచుట వినుట తెలిసికొనుట అను సర్వవ్యవహారాభావము అనగా వ్యవహారము లేకుండుట భూమాధర్మమైన పరమాత్మ యందే యుక్తియుక్తము. అందువల్ల గూడ భూమా తత్వము పరమాత్మయే.**

భూమా తత్వము పరమాత్మయే. ఏలనన 'యత్ర నాన్యత్ పశ్యతి' అనుశ్రుతిలో దర్శనాదుల వ్యవహారాభావము భూమాతత్వములో అనిరి. అంతేగాక 'యో వై భూమా తత్ సుఖం' 'యోవై భూమా తదమృతమ్' నిశ్చయముగా భూమాతత్వము సుఖస్వరూపము మరియు అమృతస్వరూపము. ఈ రెండు ధర్మములు పరమాత్మయందే యుక్తము. అందువల్ల భుమాతత్వమునకు అర్థము పరమాత్మయే.

## 21. అక్షరాధికరణము.1.3.10-12.

సంగతి- క్రిందటి అధికరణములో సత్య శబ్దము బ్రహ్మమందు రూఢమయినందున భూమాశబ్దమునకు అర్థము బ్రహ్మమనిరి.అట్లే అక్షరశబ్దము వర్ణార్థమునందు రూఢమయినందున అక్షరార్థము వర్ణమే అగును. అను దృష్టాంన్త సంగతి వలన ఈ అధికారణము మొదలయినది.

విషయము-'స హోవాచైతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్త్యస్థూలమితి' (బృ.3-8-7/8.) హే! గార్గి ఆకాశము అక్షరములో ఓతప్రోతము, దానిని బ్రహ్మవేత్తలు స్థూలత్వ, అణుత్వ ధర్మముల రహితము అందురు. ఈవాక్యము ఇచట విచారణీయ విషయము.

సంశయము- అక్షర శబ్దము వర్ణమా, లేకపరమాత్మయా అని సంశయము.

పూర్వపక్షము-అక్షర శబ్దము వర్ణములో ప్రసిద్ధము. అదువల్ల ఇవట అక్షరశబ్దమునకు అర్థము ప్రణవాక్షరమనవలయును.

సిద్ధాన్తము- పృథివీనుండి అవ్యాకృత పర్యంతము సంపూర్ణ జగత్తునకు ఆధారమగుటవలనను, ఏ ధర్మములు లేకుంటవలనను,శాసనకర్త అగుటవలనను, ద్రష్టృత్వాది చైతన్య ధర్మములను చూచుచు అక్షరశబ్దమునకు అర్థము బ్రహ్మమనుటయే ఉచితము.

వైయాసికన్యాయమాల.

అక్షరం ప్రణవః కింవా బ్రహ్మ లోకేఽక్షరాభిదా । వర్ణే ప్రసిద్ధా తేనాత్ర ప్రణవః స్యాదుపాస్తయే.॥

అవ్యాకృతాధారతోక్తేః సర్వ ధర్మ నిషేధతః। శాసనాదద్రష్టృతాదేశ్చ బ్రహ్మైవాక్షరముచ్యతే.॥

"ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంన్తి అస్థూలమనణ్వహ్రస్వమ్" అను వాక్యములో నున్న అక్షరము పదము ప్రణవమా లేక బ్రహ్మమా అనిన లోకములో అక్షర శబ్దము వర్ణములో ప్రసిద్ధమగుట వలన ప్రణవాక్షరము ఉపాసనకు చెప్పిరనవలయును. 'అక్షరము' అవ్యాకృతము ఆకాశమునకు ఆధారమగుటవలనను, దానిలో అన్ని రకముల

ధర్మములు నిషేధించుటవలనను , అదే సంపూర్ణ జగత్తునకు శాసనకర్త అగుటవలనను, ఇంద్రియములకు అగోచరమగుటవలనను మరియు దానినే ద్రష్ట అనుట వలనను బ్రహ్మమే అక్షర శబ్దార్థము.

బృహదారణ్యకోపనిషత్తులోని మూడవ అధ్యాయములో యాజ్ఞవల్క్యుడు గార్గికి చెప్పెను "ఏతద్వై తదక్షరం గార్గి! బ్రాహ్మణా అభివదన్తి అస్థూలమనణ్వహ్రస్వమ్" (బ్ర.3.8.8.) బృహదారణ్యకోపనిషత్తులో ఐదవ అధ్యాయములో గార్గికి యాజ్ఞవల్క్యుడు ఇచ్చిన సమాధానములోనిదీవాక్యము. "హే గార్గి, ఆ అక్షరమును గురించి బ్రహ్మవేత్తలు ఈవిధముగా చెప్పుచున్నారు స్థూలత్వము అణుత్వము హ్రస్వత్వము మొదలుగాగల ధర్మములు లేనిది." ఇచట అక్షరశబ్దముద్వారా ప్రణవము లేక బ్రహ్మమును చెప్పుచున్నరా అని సందేహము. ప్రణవమని పూర్వపక్షము. ఏలనన ''యేనాక్షర సమామ్నాయమధిగమ్య'' అనుచోట అక్షర శబ్దము వర్ణములో రూఢమయినందున ప్రణావక్షరమును ఇచట ఉపాశ్యముగా చెప్పవలయును.

దీనికి సిద్ధాన్తి సమాధానము- అక్షరశబ్ద వాచ్యము బ్రహ్మమే. ఏలనన 'అంబరాన్తధృతేః' పృథివ్యాది ఆకాశపర్యన్తము గల వికారములను ధరించుట వలన. ''ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ'' "హే, గార్గి, ఈఅక్షరములోనే ఆకాశము ఓతప్రోతము.(పడుగు పేకవలే) (బృ.ఉ.3-8-11). ఆకాశశబ్ద వాచ్యమయిన అవ్యాకృతమునకుగూడ ఆధారము అక్షరమే, గాని ప్రణవమునకు అది అసంభవము. ఇంకా 'అస్థూలమనణ్వహ్రస్వమ్' ఆఅక్షరమునందు స్థూలత్వ అణుత్వ హ్రస్వత్వాది ధర్మములు లేవు అనుచు సంపూర్ణ సంసారధర్మములను నిషేదించిరి.మరియు ''ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః'' ఈ అక్షరము యొక్క శాసనములోనే సూర్యచంద్రులున్నారు. (బృ.ఉ. 3-8-9). అని ఈ అక్షరము ద్వారా సంపూర్ణ జగత్తుయొక్క శాసనమువినిపిచుచున్నది. అంతేగాక ''తద్వా ఏతదక్షరం గార్గి అదృష్టం ద్రష్టృ అశ్రుతం శ్రోతృ'' హే, గార్గి, ఈఅక్షరము చూడబడదు కాని అందరికి అదే ద్రష్ట దానిని వినలేముగాని అందరిలోనుండి అదే వినుచున్నది. (బృ. 3-8-11). ఈ శ్రుతిలో ద్రష్టృత్వాదులకు అనగా చూచుట అను ప్రామాణములకు అది విషయము కాదు అనిరి. ఇవన్నియు ప్రణవ పక్షములో కల్పించలేము. అందువల్ల బ్రహ్మమే అక్షర శబ్దార్థము.

### 73. అక్షరమమ్బరాన్తధృతేః 1.3.10.

సూత్రార్థము:- "ఏ తద్వై తదక్షరం హే గార్గి! ఇది అదే అక్షరము స్థూలము కాదు, అణువుకాదు. ఈ శ్రుతిలో అక్షరశబ్దార్థము బ్రహ్మమే. అదే భూమి నుండి ఆకాశము వరకు అన్ని వికారములను ధరించుచున్నది.

అక్షరశబ్దము వర్ణమందు రూఢి అగుటవలన 'ఓంకార ఏవేదం సర్వం' అన్నచోట ఓంకారమును సర్వాత్మరూపముగా

ఉపాసించవలయుననుట అక్షరశబ్దము వర్ణమందే అర్థమని పూర్వపక్షము. సిద్ధాన్తములో 'న క్షరతి ఏవం అశ్నుతే ఇతి అక్షరః' ఏది నశించదో మరియు వ్యాపకమో దానినే అక్షరమందురు. అందువల్ల నిత్యము వ్యాపకము అను ధర్మముల ద్వారా అక్షరము పరమాత్మయే. ఏలనన 'అమ్బరాన్తధృతేః' ఆకాశము పర్యంతము సంపూర్ణ జగత్తునకు ధారణము కలిగియుండుట పరబ్రహ్మనకు కన్న వేరైనదానికి సంభవముకాదు. "శఓతస్చ ప్రోతఛ్చఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకా" (బృ.ఉ.3-8-11). 'హే! గార్గి, ఈఅక్షరములో ఆకాశము ఓతప్రోతము'. ఈశ్రుతిలో పృథివీమొదలు ఆకాశము వరకు వికారజాతములైనసంపూర్ణ జగత్తు ఈఅక్షరములో ఓతప్రోతమై యున్నది. బ్రహ్మ కన్న భిన్నమైనదానిలో ఈ ఆధారత్వము సంభవము కాదు. ''ఓంకార ఏవేదం సర్వమ్'' ఇదంతా ఓంకారమే, ఇలాంటి వాక్యములు బ్రహ్మ ప్రాప్తికి సాధనరూపముగా చెప్పుచూ ఓంకార స్తుతి చేసిరి.

కాని కార్యము కారణాధీనము గాన ఆకాశము వరకు ధారణ ప్రధానమునకు గూడ సంభవము అను ఆశంకకు సమాధానము.

74. సా చ ప్రశాసనాత్.1.3.11.

సూత్రార్థము:- ఆకాశాది భూతముల ధారణ పరమేశ్వరుని కర్మమే, కాని అచేతనమైన ప్రధానాదులదికాదు. ఎందులకనగా ఈఅక్షరుని శాసనములో సూర్యచంద్రులు విశేషరూపముగా స్థితులైయున్నరు అను ఈశ్రుతిలో ప్రాశాసనము చెప్పబడినది.

ఆకాశమువరకు అన్నింటినీ ధరించుట పరమేశ్వరుని కర్మయే. ఏలనన 'ప్రశాసనాత్'' అన్నింటిని శాసించుటవలన. "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" ఈ అక్షర ప్రశాసనములో సూర్యచంద్రులు ధరింపబడి యున్నారు (బృ.3.8.9). పరమేశ్వరుని శాసన కర్మ వినబడుచున్నది. అచేతనప్రధానములో జగత్తును శాసించు శక్తి లేదు. మట్టి కుండ శాసించుట చూడబడుట లేదు గదా.

75.అన్యభావవ్యావృత్తేశ్చ.1.3.12.

సూత్రార్థము:- అక్షర శబ్దార్థమైన బ్రహ్మములో అచేతనమైన ప్రధానాదుల ధర్మము లేదు. అందువల్ల గూడ అక్షరార్థము బ్రహ్మమే గాని ప్రధానము కాదు. "తద్వా ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్టృ" (బృ.3.8.11). " హే గార్గి!అదే ఈ అక్షరము పరుని చే చూడబడదు తాను చూచును." ఇచట చెప్పబడిన ద్రష్టుత్వాది ధర్మములు ప్రధానమునందు సర్వధా అసంభవము. అందువల్ల పరబ్రహ్మమే అక్షరపదవాచ్యము, వర్ణము కాదు.

## 22.ఈక్షతికర్మవ్యపదేశాధికరణము.1.3.13.

సంగతి:- వెనుకతి అధికరణములో వర్ణములో రూఢమైన అక్షరశబ్దమునకు గూడ బ్రహ్మమని అర్థము చెప్పిరి. ఎందులకనగా ఆకాశాదిభూతములకు సంపూర్ణ జగత్తునకు సర్వాధారమను అసాధారణహేతువు వలన మరియు 'న క్షరతి అశ్నుతేవా' నాశనము లేనిది, వ్యాపకమైనది అను వ్యుత్పత్తి ద్వారా అక్షరము బ్రహ్మమని చెప్పబడినది. సమముగా అదేరీతిగా ఇచట 'దేశపరిచ్ఛిన్నము, ఫలశ్రుతి' అను హేతువులద్వారా 'పర' శబ్దమును హిరణ్యగర్భపరముగా తీసికొనవలయును. ఇచట దృష్టాన్త సంగతి.

విషయము:- "యః పునరేతం త్రిమాత్రేణోమిత్యనేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత" (ప్ర.5.5) "ఏ పురుషుడు మూడు మాత్రలతో గూడిన పరిపూర్ణోంకారము నాలంబుగ గైకొని పరమేశ్వరునుపాసించునో" అను ఈవాక్యము విచారణీయము.

సంశయము:- ఈశ్రుతిలో పరబ్రహ్మ ధ్యేయమా లేక అపరబ్రహ్మమైన హిరణ్యగర్భుడు ధ్యేయమా? అని సంశయము.

పూర్వపక్షము:- "స సామభిరున్నీయతే బ్రహ్మలోకమ్" (ప్ర.5.5) ఈ విధమైన దేశపరిచ్ఛిన్నఫలము చెప్పుట వలన అపర బ్రహ్మమే ధ్యేయమని చెప్పవలయును.

సిద్ధాన్తము:- ధ్యాతవ్యరూపములో ఇచట పరబ్రహ్మమునే ఉపదేశించిరి. అది జీవఘనపరము. ధ్యానమునకు కర్మమగు విషయము భూతపదార్థము కావచ్చును కాని సమ్యగ్దర్శనమునకు విషయభూతము పరబ్రహ్మమే. పురుష పర శబ్దములద్వారా అదే ధ్యేయము యొక్క ప్రత్యభిజ్ఞ అగును. పరిచ్ఛిన్నఫలము క్రమముక్తి నపేక్షించి చెప్పిరి గాన విరోధము లేదు.

వైయాసికన్యాయమాల:

త్రిమాత్రప్రణవే ధ్యేయమపరం బ్రహ్మ వాపరమ్। బ్రహ్మలోకఫలోక్త్యాదేరపరం బ్రహ్మ గమ్యతే॥

ఈక్షితవ్యో జీవఘనాత్పరస్తాత్ప్రత్యభిజ్ఞతా । భవేద్ధ్యేయం పరం బ్రహ్మ క్రమముక్తిః ఫలిష్యతి ॥

. "యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత"(ప్ర.5.5) అనుశ్రుతిలో మూడు మాత్రలతో గూడిన ఓంకారమును అపర బ్రహ్మముగా ధ్యానించవలయునా లేక పరబ్రహ్మముగానా? బ్రహ్మలోక గమనమను సీమితఫలము చెప్పటవలన ఇచట అపర బ్రహ్మము ధ్యేయము అను పూర్వపక్షమునకు సమాధానము. వాక్యాన్తములో

సర్వోత్కృష్ట విరాట్రూప, హిరణ్యగర్భములకన్న ఉత్కృష్టమైనది సాక్షాత్కరిచుకొనవలయుననిరి. 'పరము' మరియు 'పురుష' శబ్దముల ద్వారా పరబ్రహ్మ ప్రత్యభిజ్ఞ అగుచున్నది. బ్రహ్మధ్యానమునకు బ్రహ్మలోకప్రాప్తి ఫలము కాదు కాని ఆఖరిలో ముక్తి. అందువల్ల బ్రహ్మమే ధ్యేయమని సిద్ధమగుచున్నది.

**ప్రశ్నోపనిషత్తులో వినబడుచున్నది "యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత" 'ఏ పురుషుడు మూడు మాత్రలతో గూడిన పరిపూర్ణోంకారము నాలంబుగా గైకొని పరమేశ్వరునుపాసించునో' అను శ్రుతిలో ధ్యేయవస్తువు హిరణ్యగర్భమగు అపర బ్రహ్మమా లేక పరబ్రహ్మమా? అని సంశయము. అపరబ్రహ్మమని పూర్వపక్షి అభిప్రాయము. ఎందులకనగా "స సామభిరున్నీయతే బ్రహ్మలోకమ్" (ప్ర.5.5) తృతీయ మాత్రారూపములగు సామమంత్రములచే బ్రహ్మలోకమునకు గొనిపోబడును. (మంత్రములకు రూపము కలదని మీమాంసకుల అబిప్రాయము) అని కమలాసనలోకప్రాప్తి వినబడుచున్నది. అంతమాత్రముచే పరబ్రహ్మధ్యానముయొక్క పరమపురుషార్థమను ఫలము కలుగదు. ' పరం పురుషం' అనుపర శబ్దవిశేషణము అపరబ్రహ్మమందుగూడ వినియోగింతురు. దేహాదులనపేక్షించి పరముగాన అపరబ్రహ్మమును పరమనవచ్చును గాన అపరబ్రహ్మమే ధ్యేయమని పూర్వపక్షము.**

దీనికి సిద్ధాన్తి సమాధానము. పరబ్రహ్మమే ధ్యేయము. ధ్యేయత్వముద్వారా తెలిసికొనవలసిన పరబ్రహ్మము యొక్క ప్రత్యభిజ్ఞ శ్రుతిలో చెప్పిరి. "స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురుష మీక్షతే"(ప్ర.5.5) ఆసాధకుడు జీవసమూహమైన హిరణ్యగర్భునికన్న వేరైన శ్రేష్ఠపురుషుని అనగా అందరిహృదయములోనున్న పరమాత్మను చూచును. ఉపాసనద్వారా బ్రహ్మలోకము జేరిన సాధకుడు పైవిధముగా పరబ్రహ్మమును చూచును. అచట చూడవలసిన పరమాత్మనే వాక్యోపక్రమములో ధ్యానవిషయముగా చెప్పిరి. పర పురుష శబ్దముల ద్వారా పరబ్రహ్మముయొక్క ప్రత్యభిజ్ఞ చేసిరి. కేవలము బ్రహ్మలోక ప్రాప్తియే ఫలము కాదు. క్రమముక్తి సంభవమగుటవలన పరబ్రహ్మమే ధ్యేయము.

### 76. ఈక్షతికర్మవ్యపదేశాత్సః. 1.3.13.

సూత్రార్థము:- "యః పునరేతం త్రిమాత్రేణ" 'ఎవడు మూడు మాత్రలుగల ఓంకారమును పురుషరూపునిగా ధ్యానించునో' అను శ్రుతిలో ధ్యేయము పరబ్రహ్మమని ఉపదేశించిరి. అపరబ్రహ్మముకాదు. ఎందులకనగా 'పరాత్పరం' "హిరణ్యగర్భుని కన్న పరమైన అందరిశరీరములో ప్రవేశించిన" అని వాక్యశేషము కనబడుచున్నది.